# ప్రపంచ చరిత్ర

(ఆరవ భాగము)



రచన:

జవహర్‌లాల్ నెహ్రూ

అనువాదం:

చింతా దీక్షితులు

సంస్కృతి ప్రచురణ

(45)

వెల రెండు రూపాయలు



## రచయిత

జననం 1889. కాశ్మీర బ్రాహ్మణులు. తండ్రి ప్రఖ్యాత న్యాయవాది మోతీలాల్ నెహ్రూ. తల్లి స్వరూపరాణీ. జన్మస్థానం ప్రయాగ-అలహాబాద్. ఇంటివద్ద కొంతకాలం ప్రైవేటు చదువుకొని హారోలో, కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయంలోని ట్రినిటీ కళాశాలలో విద్య నభ్యసించారు. అలహాబాద్ హైకోర్టులో న్యాయవాదిగా జీవితాన్ని ప్రారంభించారు. 1918లో ఇండియన్ హోమ్‌రూల్ లీగుకు కార్యదర్శి అయినారు. 1918 నుంచి అఖిలభారత కాంగ్రెస్ సభలో సభ్యుడుగానున్నారు. 1921 లో మొదటిసారి కారాగృహ వాసా న్ననుభవించారు. ఇప్పటికి ఎనిమిది మారులు శ్రీకృష్ణజన్మస్థానాన్ని చూచివచ్చారు. 1929 లో కాంగ్రెస్ కార్యదర్శి అయినారు. 1930 లోను 1936, 37, 46 లలోనూ కాంగ్రెస్ అధ్యక్షులయినారు. 1950 నుంచి మరల నేటివరకు కాంగ్రెస్ అధ్యక్షులుగానే వున్నారు. వివాహితులు. భార్య కమలా నెహ్రూ చనిపోయింది. కొడుకులు లేరు. ఒక్కతే కుమార్తె-ఇందిరా గాంధి. చెల్లెండ్రిద్దరు-విజయలక్ష్మి పండిట్, కృష్ణ హాతీసింగ్.

ఈయన గొప్ప ప్రజాస్వామ్యవాది. ఆంగ్లంలో అనేక గ్రంథాలను రచించారు. వీరి రచనలలో 'సోవియట్ రష్యా', 'ప్రపంచ పరిణామము'లను మా ప్రచురణలలో ప్రచురించియున్నాము. నేడు (1953) ఇండియా ప్రధానిగా నున్నారు.

విలాసము: 17, యార్క్ రోడ్డు, న్యూ ఢిల్లీ.

# విషయసూచిక

లేఖ | పుట

# పటములు

# విప్లవములగూర్చి స్థూలముగా, యూరోపులో 1848 లో జరిగిన విప్లవములగూర్చి ప్రధానముగా

జనవరి 28, 1933

మరల మనము యూరోపు పోవలెను. ఆ ఖండమున 19 వ శతాబ్దిని, క్లిష్టమై నానాటికి మారుచున్న పరిస్థితులను గమనించవలెను. రెండు నెలల క్రితము వ్రాసిన కొన్ని జాబులలో ఈ శతాబ్దిని పరిశీలించితిమి. అందలి ప్రధాన లక్షణములను కొన్నింటిని నీకు చెప్పితిని. అందు పేర్కొన్న "తత్వముల" నీవు జ్ఞాపకముంచుకొనియుండవు. అప్పుడు నేను పేర్కొన్న కొన్ని తత్వములివి— పారిశ్రామిక తత్వము (1), ధనికతత్వము (2), సామ్రాజ్యతత్వము (3), సాంఘికతత్వము (4), జాతీయతత్వము (5), అంతర్జాతీయతత్వము (6). ప్రజాస్వామికమును గూర్చియు, * విజ్ఞాన శాస్త్రమును గూర్చియు రవాణా పద్ధతులలో కలిగిన బ్రహ్మాండమగు మార్పులను గూర్చియు, ప్రజలకందుబాటులో నుండు విద్యనుగూర్చియు, దాని ఫలమగు నేటి వార్తాపత్రికనుగూర్చియు కూడ నేను చెప్పియుంటిని. ఈ విషయము లన్నియును, ఇంకను అనేక విషయములును కలిసి నాటియూరోపు నాగరికత యైనది. అది బూర్జువా నాగరికత. క్రొత్తగా వచ్చిన మధ్య తరగతుల ప్రజలు, పరిశ్రమలను తమ వశము చేసికొని ధనికపద్ధతిపై నడుపుచుండిరి. యూరోపులోని ఈ బూర్జువా నాగరికత దినదిన ప్రవర్ధమానమగుచు వచ్చెను. ఔన్న

(1) Industrialism. (2) Capitalism. (3) Imperialism. (4) Socialism. (5) Nationalism. (6) Internationalism.

* Democracy.

త్యమునందు కొనెను. శతాబ్దాంతమునకు దాని శక్తి దానికి తెలియ వచ్చుటయేగాక లోకమునకు కూడ వెల్లడియయ్యెను. అప్పుడు సంభ వించినది విపత్తు.

ఆసియా ఖండములో ఈ నాగరికత ఎంతవరకు పనిచేసినదో కూడ కొంత వివరముగ మనము చూచియే యున్నాము. వృద్ధియగు చున్న పారిశ్రామిక తత్వమును పురస్కరించుకొని యూరోపు తన చేతులను దూర దేశములకు చాచెను. ఆ దేశములను గ్రసించ ప్రయ త్నించెను. వానిని తన వశము చేసికో ప్రయత్నించెను. తన లాభము కొరకు వాని వ్యవహారములలో జోక్యము కలిగించుకొనుటకు యత్నిం చెను. యూరోపు అన్నప్పుడు నా అభిప్రాయము ముఖ్యముగా పడమటి యూరోపు అనియే. ఇదియే పారిశ్రామికముగా ముందంజ వేసినది. పశ్చిమ దేశములన్నింటిలోను ఇంగ్లాండు తిరుగులేని నాయకత్వము వహించెను. మిగత దేశములను మించిపోయెను. తత్కారణమున నమితముగా లాభమునందెను.

ఇంగ్లాండులోను, పశ్చిమదేశములందును కలుగుచున్న ఈ గొప్ప మార్పులు, శతాబ్దాదిని నాటి రాజులుగాని, చక్రవర్తులుగాని గుర్తించనే లేదు. పుట్టుకొనివచ్చుచున్న నూతన శక్తుల మహత్తు వారి కవగాహన కాలేదు. రాజకీయ రంగమునుండి నెపోలియన్ తొలగింపబడినపిమ్మట యూరోపు నేలు ఈ రాజులకొక పేధ్యాస. తమ్మును, తమసాటివారిని కలకాలము గద్దెలపై నిలుపుకొనుట ఎట్లని? ప్రపంచమున నిరం కుశత్వము అవ్యాహితముగ సాగుట ఎట్లని? ఫ్రెంచి విప్లవమువల్ల, నెపోలియన్‌వల్ల వారు భీతావహులైరిగదా! ఆ బెదురు వారి కింకను పూర్తిగా తీరనేలేదు. ఇకముందు తగిన జాగ్రత్తలు తీసికోవలెనని వారూహించిరి. వెనుక నేనొక జాబులో చెప్పినట్లు పత ప్రవర్తకులతో వారు మైత్రి నెరపిరి. రాజులుకూడు దైవదత్తాధికారమును నిలుపు కొనుటకును, తామిష్టమువచ్చినట్లు వ్యవహరించుటకును, ప్రజల నణచి

పెట్టుటకును వారు "పవిత్ర స్నేహము" నిట్లు నెరపిరి. ఇదివరలో జరిగినట్లే ఇప్పుడుకూడ నిరంకుశ ప్రభుత్వము ఇందుకై మతముతో చేతులు కలిపెను. ఇట్టి స్నేహములను సంధానము చేయుటలో రష్యా దేశపురాజు-జార్ అలగ్జాండరు ప్రముఖపాత్ర వహించెను. పారిశ్రామిక తత్వవాసన అతని దేశమునకు తగలలేదు. రష్యాదేశము మధ్యయుగము నాటి దేశమువలె మిక్కిలి వెనుకబడి యుండెను. రష్యాలో పెద్ద నగరములు బహుకొద్దిగానుండెను. వ్యాపార మభివృద్ధి చెందలేదు. చేతిపనులు సైతము ఉన్నత స్థాయిని పొందలేదు. నిరంకుశ ప్రభుత్వము విచ్చలవిడిగా సాగిపోవుచుండెను. మిగత యూరోపియన్ దేశములలో పరిస్థితులు భిన్నముగా నుండెను. యూరోపులో పడమటికి పోయినకొలది మధ్యతరగతుల ప్రజల ప్రాముఖ్యము వెల్లడి యగుచుండెను. ఇంగ్లాండులో నిరంకుశ ప్రభుత్వము లేదని ఇదివరలో చెప్పియుంటిని. రాజు తన యిష్టము ప్రకారము సంచరించుటకు వీలులేదు. పార్లమెంటు అతనిపై ఒకకన్ను వేసియుంచెను. కాని, పార్లమెంటు మాత్రము కొద్దిమంది ధనికుల వశములో నుండెను. రష్యా నేలు నిరంకుశ ప్రభువునకును, ఇంగ్లాడు నేలు ధనిక జనాధిపత్యమునకును * హస్తి మశకాంతరము వార యుండెను. కాని ఆ రెండు దేశముల లోను సాదృశ్యమొక్క విషయమున కలదు. అది, ప్రజాసామ్యమన్నను, విప్లవమన్నను భీతి.

ఇట్లు యూరోపు నందంతటను ప్రజలకనుకూలముగా నుండు ఉద్యమములన్నిటిని నిష్కారణముగ నణచివేయుచుండిరి. ప్రాతి హాల్యము విజయవంతముగా నుండెను. 1815 లో వియాన్నా కాంగ్రెసు తీర్మానముల ననుసరించి పలుదేశములు-ఇటలీ, తూర్పు యూరోపు మున్నగునవి-పరదేశస్థుల ఏలుబడిలోనుండవలసివచ్చెను. బలాత్కారముగా నా దేశము లణచిపెట్టబడినవి. కాని ఇట్టి కృత్యములు చిర

* Oligarchy.

కాలముపాటు జయప్రదముగా సాగవు. చిక్కులు వచ్చియేతీరును. నీళ్లు మరుగుచున్న గిన్నెపై మూత నణచిపెట్టుట వంటి దిట్టకార్యము. యూరోపు దేశము కుత కుత ఉడుకుచుండెను; వేడియావిరి బలవంతముగా ఉండుండియు బయటకు వచ్చుచుండెను. వెనుక ఒక జాబులో 1830 లో జరిగిన తిరుగుబాటుల గూర్చి వ్రాసియుంటిని. అప్పుడు యూరోపులో అనేక మార్పులు జరిగెను. ముఖ్యముగా ఫ్రాంసులో బోర్బన్ రాజకుటుంబము అంతరించెను. ఈ విప్లవములను చూచి రాజులు, చక్రవర్తులు, అంతకన్న వారి మంత్రులు భయపడిరి. ప్రజలను వారు తీవ్రముగా బాధించి అణచివేసిరి.

యుద్ధములవల్లను, విప్లవములవల్లను పలుదేశములలో గొప్ప మార్పులు కలిగినవన్న విషయము అనేక లేఖలలో మనము తరుచు చూచి యుంటిమి. వెనుకటి కాలములో సంభవించిన యుద్ధములు మతమునకుగాని, రాజవంశములకుకాని సంబంధించియుండెను. తరుచు అవి ఒక జాతి వేరొకజాతిపై చేసిన రాజకీయ దండయాత్రలైయుండెను. ఈ హేతువులన్నింటికిని వెనుక సామాన్యముగా ఆర్థిక కారణమొకటి కూడ ఉండెను. అందువల్లనే యూరోపు, ఆసియాలకు సంబంధించిన మధ్య ఆసియా జాతులు చేసిన పెక్కు దండయాత్రలకు కారణము ఆకలిచే వారు పడమటి దిక్కుగా పోవలసి వచ్చుటయే. ఆర్థికాభివృద్ధి దేశమునకు బలమునిచ్చును. మిగత దేశములకన్న నది మిన్నయై యుండును. యూరోపు మున్నగు దేశములలో జరిగిన మతయుద్ధములని చెప్పబడు వానియందు సైతము ఆర్థిక హేతువంతర్లీనమైయుండు నని చెప్పియుంటిని. నేటికాలమును సమీపించినచో మతయుద్ధములను, రాజవంశములకు సంబంధించిన యుద్ధములను మనకు గోచరముకావు. యుద్ధముమాత్ర మంతరించలేదు. అది మరియు తీవ్రతరమయ్యెను. కాని యుద్ధములకు నేటి కారణములు ఆర్థిక, రాజకీయములకు సంబంధించినవే. రాజకీయ కారణములు ముఖ్యముగా జాతీయత

ననుసరించివచ్చినవి. ఒక జాతి వేరొక జాతిని అణచివేయుట కాని, జాతీయతలు రెండు కలహశీలములై వివాదపడుటగాని, జరుగుచున్నది. ఈ వివాదమైనను ఆర్థిక కారణములవల్లనే చాలవరకు కలుగుచున్నది. ముడి వస్తువుల కొరకును, మార్కెట్టుల కొరకును నేటి పారిశ్రామిక దేశములు వివాదపడుట ఇట్టిదే. దీనినిబట్టి ఆర్థికకారణములే యుద్ధమునకు నాడు నాటికి ప్రాధాన్యమువహించుచున్నవని మనము గ్రహించవచ్చును. నిజమునకు నేడవి పరమ ప్రధానములుగా నున్నవి.

వెనుకటి కాలమున విప్లవములుకూడ ఇట్టి మార్పులనే పొంది యుండెను. తొలి విప్లవములు స్థాన విప్లవములు * మాత్రమే. రాజ కుటుంబములోని వ్యక్తులు ఒకరిపై నొకరు కుట్రలు పన్ని పోరాడి హత్యలు చేసికొనుట. లేదా కుపితులై ప్రజలు తిరుగబడి నిరంకుశ ప్రభువును తుదముట్టించుట. లేదా ఆశాపూరితుడైన సైనికుడొకడు తన సేప సహాయముతో సింహాసనమును వశపరచుకొనుట. అస్థానవిప్లవము లనేకము కొద్ది మందితో సంబంధించినవిమాత్రమే. ప్రజాబాహుళ్యమున కిందు సంబంధములేదు. వా రుపేక్షాభావము వహించియుందురు. పాల కులు మారిరి కాని పరిపాలన పద్ధతి మారకుండెను. ప్రజల జీవితము లందెట్టిమార్పును కలగకుండెను. దుష్టుడగు పాలకుడున్న ప్రజల నమి తముగా నతడు పీడించును. వాని పరిపాలనము దుర్భరముగానుండును. పాలకుడు ఇంతకన్న మంచివాడైన పరిస్థితులు సహించుటకు వీలుగా నుండును. పాలకుడు దుష్టుడైనను, మంచివాడైనను ప్రజల సాంఘిక, ఆర్థిక పరిస్థితులలో ఇట్టి విప్లవముల వలన నెట్టి మార్పును కలుగదు. సాంఘిక విప్లవము సంభవించదు.

జాతి విప్లవము ** వలన అధికముగా మార్పుకలుగును. ఒకజాతి వేరొకజాతిని పాలించునప్పుడు, పై చేయి పరపాలకవర్గమువారిదే. ఇది అనేక విధములుగా పాలితదేశమునకు హానికరముగా నుండును.

* Palace revolutions. ** National revolution.

వేరొక దేశముయొక్క లాభముకొరకు పాలితదేశము పాలింపబడును. లేదా ఇట్టి లాభము పరదేశమందలి ఒక వర్గమునకు చెందును. పాలిత ప్రజల ఆత్మగౌరవమునకిది గొడ్డలిపెట్టు. ఇంతేకాదు. అధికారయుక్తము లగు ఉద్యోగములను పాలితదేశమందలి ఉత్తమ తెగలవారికి దక్క కుండ పరపాలకవర్గమువారు తమ చేతులలో పెట్టుకొందురు. పరపాల కులే లేకున్న నీ యుత్తమ తెగల వారాయుద్యోగములను చేయువారే కదా! జాతి విప్లవము నిర్విఘ్నముగా కొనసాగినచో పరపాలకులు తొలగిపోదురు. ఆ దేశమందలి ఉత్తమ తెగలవారు వెంటనే వారి స్థానము నాక్రమింతురు. తమకంటె మిన్నలగు పరపాలకులు తొలగి పోవుటచేత ఉత్తమ తెగలవారికి అధికముగా లాభించును. దేశమునకు మొత్తముమీద ఇది లాభదాయకమే. పరదేశశ్రేయస్సు కోరే ఏలుబడి తొలగినదికదా! సంఘములోని తగ్గు తెగలవారికిది ఎక్కువ లాభకర ముగా నుండక పోవచ్చును. జాతీయ విప్లవముతోపాటు సాంఘిక విప్లవము సంభవించినప్పుడే వారికికూడ లాభము కలుగును.

సాంఘిక విప్లవము—పైపైనిమాత్రమే మార్పులు కలిగించు ఇతర విప్లవములవంటిది కాదు. సాంఘిక విప్లవములో రాజకీయ విప్లవమును కలిసియుండును. ఇది సంఘ రచననే మార్చివేయును. పార్లమెంటును సర్వతంత్ర స్వతంత్రముగా జేసిన ఇంగ్లీషు విప్లవము వట్టి రాజకీయ విప్లవము మాత్రమే కాదు. కొంత సాంఘిక విప్లవముకూడ. అధికార ములో నున్న వారితో భాగ్యవంతులగు బూర్జువా ప్రజలు కలియుట సంభవించినదికాన బూర్జువా ప్రజలలో పై తరగతివారు రాజకీయముగా, సాంఘికముగా ఔన్నత్యము గాంచిరి. బూర్జువా ప్రజలలో క్రింది తరగతి వారును, ప్రజాసామాన్యమును ఎట్టి లాభమును పొందలేదు. ఫ్రెంచి విప్లవములో సాంఘిక విప్లవాంశ మధికముగానుండెను. సంఘము నది తారుమారు చేసెను. కొన్నాళ్ళపాటు ప్రజాసామాన్యము సైతము పలుకు బడిని సంపాదించెను. చివరకు ఇక్కడకూడ బూర్జువాకే విజయము

చేకూరెను. విప్లవములో తాము చేయవలసిన పని చేసినపిమ్మట ప్రజా సామాన్యము వెనుకటి స్థితికే పోవలసివచ్చెను. ఈ విప్లవమువల్ల ప్రత్యేక హక్కులు అనుభవించు కులీనులుమాత్రము తొలగింపబడిరి.

అట్టి సాంఘిక విప్లవములు నాటి సంఘ పరిస్థితుల ననుసరించి యుండును. మూల ముట్టుగా అవి మార్పులను కలుగజేయును. వట్టి రాజకీయపు మార్పులనేకాదు. ఉత్సాహపూరితుడగు ఒక్క పురుషుడు గాని, కొందరు కలిసిగాని సాంఘిక విప్లవములను తీసికొని రాజాలరు. ప్రజాసామాన్యమందుకు సంసిద్ధులై యుండవలెను. సంసిద్ధులై యుండుట అనగా ఒకరు చెప్పిన పిమ్మట సిద్ధముగా నుండవలెనని చెప్పి సంసిద్ధులగుట కాదు. నా అభిప్రాయమేమనగా ఆనాటి సాంఘిక ఆర్థిక, పరిస్థితులు దుర్భరముగా నుండుటచే ప్రజలకు బ్రదుకే భారముగా నుండును. అట్టి మార్పువచ్చిననేగాని వారు బ్రదుకలేరు. వారికి శాంతియుండదు. నిజమునకు ఎన్నియుగములనుండియో కోటానుకోట్ల ప్రజలకు బ్రదుకుభారముగానే యుండెను. వారెట్లు సహించియుండిరో ఊహాతీతము. ఒక్కొక్కసారి వారు తెగించి తిరుగుబాట్లు చేసిరి. అవి ముఖ్యముగా కర్షకుల, కార్మికుల తిరుగుబాట్లు. క్రోధోన్మత్తులై వారు చేతికందిన దానినెల్ల గ్రుడ్డిగా ధ్వంసము చేసిరి. కాని వీరికి సంఘమును సంస్కరించ వలెనను కోరికలేదు. అయినా ఇట్టి తిరుగుబాట్లవల్ల నాటి సంఘమర్యాదలు విచ్ఛిన్నమైనవి. ప్రాచీన రోములో, మధ్య యుగములందు యూరోపులో, ఇండియాలో, చీనాలో ఇట్లు జరిగెను. వీనివల్లనే అనేక సామ్రాజ్యములు కూలినవి.

వెనుకటి కాలమున సాంఘిక, ఆర్థికములగు మార్పులు మందముగానే వచ్చెను. ఉత్పత్తి, అమ్మకము, రవానా పద్ధతులు పెక్కు సంవత్సరముల కాలము మార్పులేక ఒకేమాదిరిగా నుండెను. కావున ప్రజలు జరుగుచున్న మార్పును గమనించరైరి. ప్రాతసంఘ మర్యాదలు శాశ్వతమనియు, మారవనియు వారూహించిరి. ఈ మర్యాదలను, వాని

ననుసరించివచ్చు ఆచారములను, నమ్మకములను పవిత్రములుగా మతము పేర్కొనుచుండెను. పరిస్థితులు మారిపోయినను, ప్రజలుమాత్రము సంఘమును మార్చవలెనని అనుకోరు. పారిశ్రామిక విప్లవమును దానితోపాటు రవానా పద్ధతులలో పెద్ద మార్పులునురాగానే, సంఘములో మార్పులు వేగముగావచ్చెను. క్రొత్త తరగతుల ప్రజలు ముందుకు వచ్చి ధనవంతులైరి. కర్షకులకును, కార్మికులకును భిన్నముగా పరిశ్రమలలో పనిచేయు ఒక క్రొత్త తరగతి పొడ చూపెను. ఆర్థిక రచన దీనిని బట్టి మారవలసి యుండెను. రాజకీయమగు మార్పులును రావలసి యుండెను. పడమటి యూరోపు ఎందును బొందని విచిత్ర పరిస్థితిలో నుండెను. అవసరమైనప్పుడు వివేకముగల సంఘము తనలో మార్పులు కలిగించుకొని తద్ద్వారా లాభమును పొందును. కాని సంఘము లెన్నడును వివేకవంతములు కావు. అవి సమిష్టిగా ఆలోచనలు చేయవు. వ్యక్తులు తమ్ముగూర్చియు, తమకు లాభాకరమైన విషయముల గూర్చియు ఆలోచింతురు. సమాన ప్రయోజనములుగల తరగతులవారును అట్లుచేతురు. సంఘములో ఒకతరగతి పైచేయిగా ఉన్నయెడల అది అట్లే ఉండగోరును. మిగత తరగతులవారు తమకు లోకువగనుక వారిని స్వలాభముకొరకు వాడుదురు. సంఘములో తానొక వ్యక్తి కాబట్టి సంఘలాభమే తనలాభమని భావించుట ఉత్తమము. అది వివేకము. అది దూరదృష్టి. కాని అధికారములోనున్న పురుషుడుగాని, తరగతిగాని తనకున్నదానిని అంటి అంటిపెట్టుకొని యుండకోరును. అమలులో నున్న సంఘస్థితియే ఉత్తమమని మిగత తరగతుల వారితోను, ప్రజలతోను చెప్పి నమ్మించుట వల్లనే సులభముగా వారు తమస్థానముల నిలుపుకొనుచున్నారు. ప్రజలకిది నచ్చజెప్పుటకు మతముచే సాక్ష్యమిప్పించుచున్నారు. ఈ విషయమునే విద్యాభ్యాస సమయమున బోధింప జేయుచున్నారు. చివరకు ప్రతివాడును ఈ విషయమునే పూర్తిగా నమ్ముచున్నాడు. మార్చుటకు ప్రయత్నించుట లేదు. ఎంతటి ఆశ్చర్యము?

ఈ పద్ధతి వల్ల బాధపడుచున్న ప్రజలుసైతము ఇది సరియైన పద్ధతి యనియు, ఇదియే ఉండవలయుననియు నమ్ముచున్నారు. తన్నులు తినుచు, గుద్దులు తినుచు, ఇతరులు యధేచ్ఛగా జీవితము అనుభవించు చున్ననూ, తాము మాడుచు ఉండవలెననియే వారి కోరిక.

సాంఘిక పద్ధతిలో మార్పురాదనియు, దానివల్ల బహు సంఖ్యాకులు బాధపడుట ఎవరి దోషమును కాదనియు ప్రజ లూహింతురు. అది వారి తప్పే. వారి కిస్మత్. * అది వారి ప్రారబ్ధము. వెనుకచేసిన పాపములకిది వారికి శిక్ష. సంఘ మెన్నడును పూర్వాచారమును వదలి పెట్టలేదు. మార్పు దానికి కిట్టదు. ప్రాతపుంతలో ఇరుకుకొనియు అచ్చట ఉండుటకే ఇష్టపడును. అచ్చట ఉండుటయే వారిధర్మము. అంతేకాదు. సంఘ పరిస్థితులను బాగుచేయ గోరువారు ప్రాతపుంతనుండి బయటికి రమ్మనిన నట్టివారినది శిక్షించును.

ఎక్కడి కక్కడ తృప్తిపడువారును, ఆలోచనలేనివారును సంఘములో నుందురు. వారి యిష్టము ననుసరించి సాంఘిక, ఆర్థిక పరిస్థితులు ముందుకు పోకుండ ఆగవు. ప్రజల బుద్ధులు మారకున్నను అవిమాత్రము ముందుకు చొరుచుకొని పోవును. ప్రాతకాలపు ఊహలకును, యాదార్థ్యమునకును అంతరి మెక్కువయగును. ఈ యంతరమును తగ్గించుటకు ప్రయత్నించకున్నచో, ఈ రెంటికిని సమీకరణము కుదర్చకున్నచో సంఘరచన విచ్ఛిన్నమై ఉపద్రవము సంభవించును. నిజమగు సాంఘిక విప్లవము తెచ్చిపెట్టు పరిస్థితి ఇట్టిదే. విప్లవము తటస్థించుటకు తగిన పరిస్థితులున్నచో, ప్రాతకాలపు అభిప్రాయముల వల్ల కొంత ఆలస్యము జరిగినను అది వచ్చియే తీరును. ఇట్టి పరిస్థితులు లేనినాడు కొద్ది వ్యక్తులెంత గింజుకొన్నను అది రానేరాదు. విప్లవము తటస్థించిన పిమ్మట నిజస్థితి ప్రజలకు తెలియవచ్చును. వారప్పుడు యదార్థము గ్రహింతురు. ప్రాతపుంతనుండి బయటికి వచ్చుట తడవుగా

---

* మహ్మదీయు లీపదమును విధి అను అర్థములో వాడుదురు.

వారు ముందుకు చొరుచుకొని పోవుదురు. ఆ కారణముననే విప్లవ సమయములందు ప్రజలను పట్టపగ్గములుండవు. కావుననే-వెనుకలాగు చుండు సంప్రదాయ పరత్వమునకు విప్లవమే అనివార్యఫలము. సంఘ రచన మారదను తెలివితక్కువ నమ్మకము ప్రజలు పెట్టుకోక, పరిస్థితుల ననుసరించి తాము ప్రవర్తించినచో సాంఘిక విప్లవము లుండవు. అప్పుడుండునది నిరంతర పరిణామమే.

అనుకోకుండనే విప్లవములను గురించి సుదీర్ఘముగ వ్రాసితిని. ఇది నాకిష్టమైన విషయము. నేడు ప్రపంచమందంతట అప్రయోజకు లున్నట్లు నాకు తోచుచున్నది. అనేకచోట్ల సాంఘిక పద్ధతి బీటలు వారు చున్నట్లు తోచుచున్నది. వెనుకటి కాలమున నిట్టి పరిస్థితులే సాంఘిక విప్లవమునకు దారి తీసినవి. ప్రపంచమున నేడు గొప్ప మార్పులు రానున్నవని నమ్మ వీలగుచున్నది. ఇండియాలోను, పరపాలన క్రింద మ్రగ్గు ప్రతి దేశములోను జాతీయతయు, పరపాననుండి దేశమును తప్పించ వలెనను కోరికయు ప్రబలముగా నున్నవి. కాని చాలవరకీ ఆకాంక్ష భాగ్యవంతులలోనేకద్దు. కర్షకులు, కార్మికులు, ఇతరులు నిరంతర దారిద్ర్య బాధితులగుటచే ఖాళీకడుపుల నింపుకొనుటకే ప్రయత్నించు చున్నారు. ఇది సహజమే. అస్పష్ట జాతీయ స్వప్నములపై వారి బుద్ధి పోవుటలేదు. కడుపునిండుగ తిండి దొరికినగాని, పరిస్థితులు చక్కబడిన గాని వారికి జాతీయత యన్నను, స్వరాజ్యమన్నను అర్థరహితమే యగును. కాబట్టి ఇండియాలో నేటి సమస్య రాజకీయమే కాదు. అంత కన్న అధికముగా అది సాంఘికమగుచున్నది.

విప్లవములనుగూర్చి అప్రస్తుత చర్చకు నేను దిగుటకు కారణము-19 వ శతాబ్దిలో అనేక తిరుగుబాట్లు, కల్లోలములు యూరోపులో తట స్థించినవి. ముఖ్యముగా 19 వ శతాబ్ది ప్రథమ భాగమున తలయెత్తిన తిరుగుబాట్లు పెక్కులు పరపాలనమును దులిపివేయుటకు చేసిన జాతీయ విప్లవములే. వీనితోబాటు, పారిశ్రామిక దేశములలో, సాంఘిక తిరుగు

బాటుకు సంబంధించిన అభిప్రాయములు ధనికవర్గమునకును, కార్మికుల కును మధ్యజరుగు పోరాటమును యినుమడింప జేసెను. ప్రజలు ఆలో చించ వొడగిరి. సాంఘిక విప్లవము తెచ్చుటకు ప్రయత్నించదొడగిరి.

1848 సంవత్సరమునకు విప్లవ సంవత్సరమని యూరోపులో పేరు. అనేక దేశములలో తిరుగుబాట్లనేకము తలయెత్తినవి. కొన్ని కొంతవరకు విజయము సాధించినను మొత్తముమీద విఫలమైనవి. పోలెండు, ఇటలీ, బొహిమియా, హంగరీ దేశములలో తిరుగుబాట్లకు కారణము-అణగద్రొక్కబడిన జాతీయత. పోలెండు తిరుగుబాటు ప్రష్యా మీద. బొహిమియా, ఉత్తర ఇటలీల తిరుగుబాటు ఆష్ట్రియామీద. ఆ తిరుగుబాట్లన్నియు అణచివేయబడినవి. ఆష్ట్రియాపై చేసిన హంగరీ తిరుగుబాటు అన్నిటికన్న పెద్దది. దాని నాయకుడు లోజోస్ కోస్సూత్. దేశాభిమాని యనియు, స్వాతంత్ర్యమునకై పోరాడు వాడనియు హంగరీ చరిత్రలో ఇతడు ప్రసిద్ధిగన్నాడు. రెండు సంవత్సరములపాటు నిరోధించి నను ఈ తిరుగుబాటుకూడ అణచివేయబడెను. కొన్ని సంవత్సరములు గడచిన పిమ్మట, డీయక్ అను గొప్ప నాయకుని నాయకత్వమున, వేరొక పద్ధతిని పోరాడి హంగరీ విజయము చేకొన్నది. సాత్విక నిరోధముతో డీయక్ పోరాడెనన్న విషయము గమనింపవలెను. 1867 లో హంగరీ ఆష్ట్రియాలు, సమానస్థాయాన ఒక్కటై హాప్స్బర్గ్ చక్రవర్తి ఫ్రాంసిస్ జోసెఫ్ ఏలుబడిక్రింద * ద్వంద్వ ఏకాధిపత్యమును స్థాపించెను. 50 ఏళ్ళ తరువాత ఇంగ్లీషు వారిని ఐర్లాండు ప్రజలు ఎదిరించినప్పుడు డీయక్ యొక్క సాత్విక నిరోధ పద్ధతులనే వరవడిగా పెట్టుకొనిరి. ఇండియాలో, 1920 సంవత్సరమున సహాయ నిరాకరణో ద్యమము ప్రారంభించినప్పుడు కొందరు డీయక్ పోరాటమును స్మరించిరి. కాని ఈ రెండు పద్ధతులకును హస్తి మశకాంతరము భేద మున్నది.

---

* **Dual monarchy.**

1848 సంవత్సరమున జర్మనీలోకూడ తిరుగుబాట్లు కలిగెను. కాని అవి తీవ్రమైనవి కావు. అవి అణచివేయబడినవి. కొన్ని సంస్కరణములు మాత్రము వాగ్దానము చేయబడినవి. ఫ్రాంసులో గొప్ప మార్పు వచ్చెను. 1830 సంవత్సరమున బోర్బను వంశస్థులు తరిమి వేయబడిరి. నాటినుండియు లూయి ఫిలిప్ రాజుగా నుండెను. అతడు * సగము పాలు నియమబద్ధ ఏకాధిపతి. 1840 సంవత్సరమగుసరికి ప్రజల కాతడన్న విసుగుపుట్టినది. అందుచే నతనిని రాజ్యచ్యుతునిజేసిరి. ప్రజాప్రభుత్వము మరల స్థాపించబడెను. ఇది రెండవ రిపబ్లిక్. మొదటిది మహా విప్లవకాలము నాటిది. ఈ గడబిడల తొందరలో, నెపోలియన్ మేనల్లుడు, లూయి బోనాపార్టు అనువాడు పారిసుకు వచ్చి, స్వాతంత్ర్య ప్రియుడని చెప్పి, రిపబ్లికుకు ప్రెసిడెంటుగా ఎన్నుకోబడెను. అధికారము కరగతము చేసికొనుట కిదియొక పన్నుగడ. తన పదవిలో నిలువద్రొక్కుకొని, సైన్యమును స్వాధీనము చేసికొనెను. 1857 లో హఠాత్సంభవము రాజ్యాంగమున జరిగెను. అతడు తన సైనికులనుజూపి పారీసు ప్రజలను భీతావహులను జేసెను. ప్రజల నెందరినో తుపాకితో కాల్చి చంపెను. రాజ్యాంగ సభను భయభ్రాంతము చేసెను. మరుసటి సంవత్సరము తన్ను, మూడవ నెపోలియన్ అను పేర, చక్రవర్తిగా ప్రకటించుకొనెను. రాజ్యముచేయనప్పటికిని నెపోలియన్ కొడుకునకు రెండవ నెపోలియన్ అని పేరు. 4 సంవత్సరముల పైకాలము నిట్లు హీనముగా గడపి రెండవ రిపబ్లిక్ అంతరించెను.

1848 లో ఇంగ్లాండులో తిరుగుబాటు లేదు కాని అల్లరిమాత్రము ఎక్కువగా నుండెను. విపత్తు సంభవించినప్పుడు ఇంగ్లాండు వంగి వినమ్రమైయుండి విపత్తునుండి తప్పించుకొనును. దాని రాజ్యాంగ మందుకు తోడ్పడును. గత్యంతరము లేనప్పుడు రాజీ కుదుర్చుకొనుట ఇంగ్లీషువారు దీర్ఘానుభవమువల్ల నేర్చుకొనిరి. రాజ్యాంగము బిగిసి

---

* Semi—Constitutional monarch.

యుండి, ప్రజలు రాజీకి ఒప్పుకొనని ఇతర దేశములలో పెద్దమార్పులు హఠాత్తుగా, సంభవించినవి. కాని ఇంగ్లీషువారు పై విధముగా ఎట్టి మార్పులు రాకుండ తప్పించుకొనిరి. 1832 లో ఒక రిఫారం బిల్లు విషయమై ఇంగ్లాండులో గొప్ప అలజడి కలిగెను. వెనుకటికంటె ఎక్కువమంది ప్రజలకు, పార్లమెంటుకు సభ్యుల నెన్నుకొనుటకై ఈ బిల్లు వోటింగు హక్కునిచ్చెను. నేటి ప్రమాణములను బట్టి చూచిన ఈ బిల్లు మితముగా నుండెను. ఎవరికిని కష్టము కలిగించునది కాదు. మధ్య తరగతులలోని కొందరికి మాత్రమే వోటు వేయ హక్కుకలిగినది. కార్మికులకును, ఇతరులనేకులకును వోటు లేనేలేదు. అప్పుడు పార్లమెంటు కొద్దిమంది భాగ్యవంతుల చేతులలో నుండెను. తమ విశేషాధికారములకును, తమ రాటన్ బరోలకును హాని వాటిల్లునని వారు భయపడిరి. ఈ రాటన్ బరోల ప్రజలే వీరిని సునాయాసముగా కామన్సు సభకు తమ ఓటిచ్చి పంపువారు. కాన వీరు రిఫారం బిల్లును శాయశక్తులా ప్రతిఘటించిరి. రిఫారం బిల్లు చట్టమైనచో ఇంగ్లాండు నాశమగుననియు, ప్రపంచ మంతరించుననియు వారు వాదించిరి. అప్పుడు అంతఃకలహము సంభవించవలసినదే. కాని ప్రజల ఆందోళనకు ప్రతి పక్షులు భయపడ, బిల్లు చట్టమగుట కంగీకరించిరి. బిల్లు ప్యాసైన పిమ్మట ఇంగ్లాండు యధాప్రకారము జరుగుచుండెను. పార్లమెంటు వెనుకటివలెనే భాగ్యవంతుల చెప్పుచేతలలో నుండెను. మధ్య తరగతులలో భాగ్యవంతులకు మాత్రము మరికొంత అధికారము చేజిక్కెను.

1848 ప్రాంతమున మరియొక కలవరముదేశము నూపివేసెను. దానికి చార్టిస్టు కలవరమని పేరు. అనేక సంస్కరణములను కోరుచు, ప్రజల చార్టరు (ప్రజల పట్టా)ను తయారుచేసి దానిని ఒక బ్రహ్మాండమైన అర్జీతోపాటు పార్లమెంటుకు అందియ్యవలెనని తీర్మానింపబడినది. అందువల్లనే దాని కా పేరు వచ్చినది. పాలక వర్గమువారు భీతావహులైరి. పిమ్మట ఉద్యమము అణచివేయబడినది. ఫ్యాక్టరీలలో పనిచేయు

కార్మికులు కష్టముల పాలగుచు అసంతృప్తితోనుండిరి. ఈ తరుణమందే కొన్ని లేబరు (కార్మిక) చట్టములు చేయబడినవి. తత్కారణమున కార్మికుల అవస్థ కొంత బాగుపడెను. నానాటికిని వృద్ధియగుచున్న వర్తకము కారణముగా ఇంగ్లాండు భాగ్యవంతమగుచుండెను. అది ప్రపంచ కర్మాగారము అగుచుండెను. లాభములలో అధికభాగము ఫాక్టరీ యజమానులకు చెందుచుండెను. కొద్దిభాగము మాత్రము కార్మికులకు ముట్టుచుండెను. ఈ యీ కారణములవల్ల 1848 లో తిరుగుబాటు తలయెత్తలేదు.

1848 సంవత్సరోదంతము ఇంకను నేను పూర్తిగా చెప్పలేదు. రోములో ఆయేడు ఏమి జరిగినదో చెప్పవలసియున్నది. తరువాతి లేఖలో దానిని గురించి వ్రాతును.

## 127

# ఇటలీ ఏకీభవించి స్వతంత్ర జాతియగుట

జనవరి 30, 1933

వసంత పంచమి

1848 వృత్తాంతములో ఇటలీ కథ చివరకు నిలిపితిని. 1848 సంవత్సరమున ఉద్రేకమునురేపు సంభవములన్నింటిలో మిక్కిలి ఆకర్షణీయమైనది రోములో జరిగిన వీరోచితమగు పోరాటము.

నెపోలియన్ కాలమునకు ముందు, ఇటలీ చిన్న రాష్ట్రములతో, చిల్లర రాజుల మయమై యుండెను. నెపోలియన్ కొద్దికాలముపాటు దానిని ఏకముచేసెను. నెపోలియన్ తరువాత నది పూర్వస్థితికో, అంత కన్న పాడుస్థితికో వచ్చెను. 1815 సంవత్సరమున, వియన్నా కాంగ్రెసులో సమావేశమైన, విజేతలగు మిత్రజాతులు దేశమును విభజించి తమలోతాము పంచుకొనిరి. వియన్నాను, దాని చుట్టునుండు ప్రదేశమును ఆస్ట్రియా తీసికొనెను. చిల్లర ఆస్ట్రియన్ రాజులనేకులు ప్రశస్త ప్రదే

ములను సంపాదించిరి. రోమును, దానిని చేరియున్న రాష్ట్రములను (వీనినే పాపర్ రాష్ట్రములందురు) పోపు స్వాధీనములోనికి మరల వచ్చెను. నేపిల్సును, దక్షిణ భూమియు ఒక బోర్బన్ రాజు పాలనమున "రెండు సిసిలీల రాజ్య"మయ్యెను. వాయవ్యమున, ఫ్రెంచి సరిహద్దుల సమీపమున పీడ్మాంటు, సార్డీనియాలకు రాజొకడు తయారయ్యెను. ఈ చిన్నరాజులు, పీడ్మాంటు మినహాగా, నిరంకుశముగా పాలింపదొడగిరి. ప్రజలను పీడించిరి. నెపోలియన్ రాకకు పూర్వము సైతము వీరుగాని, ఇతరులుగాని ఇంత నిరంకుశముగా లేరు. అయితే నెపోలియన్ రాకవల్ల దేశ ముద్రిక్తమయ్యెను. ఇటలీని ఏకము చేయవలెననియు, స్వతంత్రము చేయవలెననియు యువకులు కలలు కనదొడగిరి. పాలకులు పీడించుచున్నను, అధవా పాలకులు పీడించుటచేత చిన్న చిన్న తిరుగుబాట్లు అనేకము తటస్థించెను. రహస్యకూటములు పనిచేయదొడగెను.

అచిరకాలముననే ఒక ఉత్సాహపూరితుడగుయువకుడు పైకి వచ్చెను. స్వాతంత్ర్యోద్యమమునకు అతనిని నాయకునిగా అందరును అంగీకరించిరి. ఇతని పేరు గూసెప్పి మాజినీ. ఇతడే ఇటలీ జాతీయతకు ప్రవక్త. 1831 లో అతడొక సంఘమును స్థాపించెను. దానిపేరు "యువ ఇటలీ". ఇటలీని ప్రజాప్రభుత్వముగా జేయుట దానిలక్ష్యము. అనేక సంవత్సరములపాటు అతడు ఇటలీలో లక్ష్యసిద్ధికై ప్రయత్నించెను. దేశమునుండి అతడు బహిష్కరింప బడెను. తరుచు అతడు ప్రాణములకు తెగించి పనిచేసెను. జాతీయ వాఙ్మయమున నితని వ్రాతలు పెక్కులు ప్రమాణగ్రంథములైనవి. 1848లో ఉత్తర ఇటలీయందంతట తిరుగుబాట్లు పొడ చూపినప్పుడు మాజినీ తనకు తగినతరుణము వచ్చినదని యూహించి రోముకువచ్చెను, పోపు తరుమగొట్టబడెను. ముగ్గురు సభ్యుల కమిటీక్రింద ప్రజాప్రభుత్వము (రిపబ్లికు) స్థాపించబడెను. వీరినే "ట్రయంవీరు" లందురు. ట్రయంవీర్ అనేమాట ప్రాచీన

రోము చరిత్రనుండి గ్రహింపబడినది. ఈ ముగ్గురు త్రయంపీరులలోను మాజినీ ఒక్కడు. బాల్యదశలోనున్న ఈ రిపబ్లికును అన్నివైపులనుండి శత్రువులు ఢీకొనిరి. ఆష్ట్రియనులు, నియోపాలిటనులు(నేపిల్సుప్రజలు). పోపును అధికారమున నిలుపుటకు వచ్చిన ఫ్రెంచివారు సైతము ఢీకొనిరి. రోమన్ రిపబ్లికు తరపు పోరాడిన ప్రధానయోధుడు "గారిబాల్డీ". ఆష్ట్రియనుల నాతడు పట్టుకొనెను. నియోపాలిటన్ సైన్యముల నాతడు ఓడించెను. ఫ్రెంచి సేనలను సైత మాతడు కాలు కదపకుండ నిలిపివేసెను. స్వచ్ఛందసైనికుల సాహాయ్యమున నత డీ పని చేయగలిగెను. రిపబ్లికును రక్షించుటకై రోములోన ధైర్యసాహసములుగల ఉత్తమ యువకు లీ స్వచ్ఛంద సైనికులు. వీరిందుకై తమ ప్రాణముల సమర్పించిరి. చివరకు, వీరయుద్ధమైన పిమ్మట, రోము రిపబ్లికు ఫ్రెంచివారి వశమయ్యెను. వారు పోపును మరల తీసికొనివచ్చిరి.

ఈ విధముగా పోరాటము మొదటిదశ ముగిసెను. ప్రచారము చేయుచు, తరువాత రానున్న పెద్ద పోరాటమునకు సిద్ధపడుచు మాజినీ, గారిబాల్డీలు వేరువేరు విధములుగా పనిచేయుచుండిరి. వారిరువురకును ఎంతమాత్రము పోలికలేదు. ఒకడు ఆలోచనాపరుడు; ఆదర్శముల సాధింప ప్రయత్నించువాడు. రెండవవాడు సైనికుడు, గెరిల్లాసమరమున లబ్ధ ప్రతిష్ఠుడు. ఇటలీని ఏకము చేయవలెననియు, ఇటాలీకి స్వేచ్ఛ సంపాదింపవలెననియు వారుబద్ధ కంకణులైరి. ఈ నాటకమున మూడవ పురుషు డొకప్పుడు రంగమునకెక్కెను. అతని పేరు కావూర్. పీడ్‌మాంటురాజైన విక్టర్ ఎమ్మాన్యుయల్ వద్ద ప్రధాన మంత్రిగా నుండెను. విక్టర్ ఎమ్మాన్యుయల్‌ను ఇటలీకి రాజుగా చేయవలెనని కావూర్ ఉవ్విళ్ళూరుచుండెను. చిల్లరరాజుల ననేకులను అణచివేసి తొలగించవచ్చును. కాన నతడు మాజినీ, గారిబాల్డీలు చేయుచున్న కార్యముల నుండి లాభము పొందుటకు సంసిద్ధుడైయుండెను. అతడు ఫ్రెంచివారితో కుట్రలు పన్నెను. అప్పుడు ఫ్రాంసుకు రాజు మూడవ నెపోలియన్.


1815 లో ఇటలీ
స్విట్జర్లాండు
ఆస్ట్రియా
సావాయి
లంబార్డీ — వెనీషియా
వెనిస్
పీడ్మాంటు
పార్మా
మోడినా
లుక్కా
టస్కనీ
అడ్రియాటిక్
కార్సికా
(ఫ్రెంచి)
పోపు రాజ్యములు
రోము
నేపిల్సు
రెండు సిసిలీలు
సార్డీనియా రాజ్యము
నేటి ఇటాలియన్ సరిహద్దు

ఫ్రెంచివారిని వారిశత్రువులైన ఆష్ట్రియనులతో యుద్ధమునకు దింపెను. ఇది జరిగినది 1859 వ సంవత్సరమున. ఆష్ట్రియనులు ఫ్రెంచివారితో పోరి, ఓడిపోయిరి. ఈ సందు చూచుకొని గారిబాల్డీ నేపిల్సు-సిసిలీరాజుపై ఒక దండయాత్ర తనకుతానై సాగించెను. ఇదియే లోకప్రసిద్ధినందిన గారిబాల్డీ దండయాత్ర. గారిబాల్డీ అనుచరులు రక్తకవచులు(ఎర్రచొక్కాల వారు)1000 మంది యుండిరి. వారికి యుద్ధశిక్షణలేదు. సరియైన ఆయుధములులేవు. యుద్ధసామగ్రిలేదు. వీరిని వెంటబెట్టుకొని గారిబాల్డీ సుశిక్షితులగు సైనికుల నెదిరించెను. ఎదిరిబలముతో చూచిన 1000 మంది రక్తకవచులు స్వల్ప సంఖ్యాకులు. కాని వారి ఉత్సాహము, ప్రజలకు వారిపైగల సద్భావము కారణముగా విజయపరంపరను వారు సాధించిరి. గారిబాల్డీ యశస్సువ్యాపించెను. అతని మాహాత్మ్య మెట్టిదో అతడు తారసిల్లు చుండగానే సైన్యములు కరిగిపోయెడివి. అయినను అతడు సాధించదలచినకార్యము కష్టసాధ్యమైనది. అనేక పర్యాయములు గారిబాల్డీయును, అతని స్వచ్ఛంద సైనికులును ప్రమాదముపాలు కావలసినదే. పరాజయము పొందవలసినదే. కాని పరాజయము రానున్న తరుణమున కూడ విజయలక్ష్మి అతనిని వరించినది. తెగించి సాధించు సాహస కార్యముల కిట్టి ఫలమే తరుచు కలుగును. కావుననే పరాజయము విజయముగా మారును.

గారిబాల్డీ తన 1000 మంది సైనికులతో సిసిలీలోదిగెను. అచ్చటి నుండి నెమ్మదిగా వారు ఇటలీకి పోయిరి. దక్షిణ ఇటలీ గ్రామముల ద్వారా గారిబాల్డీ పోవునపుడు స్వచ్ఛంద సైనికులకై ప్రజలను ప్రార్థించువాడు. అతడు వారికి వాగ్దానము చేసిన బహుమతులు అసాధారణమైనవి. అతడిట్లు చెప్పెను-"రండి. రండి. ఇంటిని కనిపెట్టుకు ఉండువాడు పిరికిపంద. మీకు నేనిచ్చు బహుమతులు-శ్రాంతి, కష్టములు, యుద్ధములు. అయితే మనము విజయము చేపట్టవలెను. లేదా మృతినందవలెను." విజయమునుబట్టియే విజయములు చేకూరును. గారిబాల్డీ

సాధించిన తొలి విజయములు కారణముగా ఇటాలియనుల జాతీయత ఉద్రిక్తమయ్యెను. స్వచ్ఛంద సైనికులు కుప్పతిప్పలుగా వచ్చిపడిరి. వారు గారిబాల్డీ గీతము పాడుచు ఉత్తరముగా నడచిపోయిరి.

"సమాధులు తెరచుకొన్నవి. మృతులు
దూరమునుండి వచ్చిరి,
ఆత్మార్పణము చేసికొన్న మృత
యోధులదయ్యములు యుద్ధమున
కై లేచుచున్నవి,
హస్తముల ఖడ్గములుధరించి, య
శోహారములతో,

ఇటలీనా
మముతోజ్వలించు మృతహృదయములతో.
రండు వారిని చేరుడు! రండు అను
సరింపుడు, ఓ స్వదేశ యువకులారా!
రండు మన బావుటావిప్పుడు, మనజ
ట్టును నడుపుడు!
రండు కటిక ఉక్కుతో అందరును రండు వేడి
అగ్నితో అందరును రండు.
ఇటాలియా ఆశయ జ్వాల
తో అందరును రండు!
ఇటాలియానుండి పో, మా ఇంటి
నుండి పో,
ఇటాలియానుండి పో, ఓ పరాయి
పురుషుడా, పో."

ప్రపంచమందంతటను జాతీయగీతము లొకే మాదిరిగానుండునుగదా!

గారిబాల్డీ విజయములు కావూర్‌కు లాభించెను. దీని పర్యవసానముగా పీడ్‌మాంటు రాజైన విక్టర్ ఇమ్మాన్యుయల్, 1861 సంవత్సరమున ఇటలీకి రాజయ్యెను. రోము ఇంకను ఫ్రెంచిసైనికుల వశమందుండెను. వెనీసు ఆష్ట్రియనుల వశమందుండెను. పదిసంవత్సరములు దాటకుండనే వెనీసు, రోములు రెండును మిగత ఇటలీలోచేరెను. రోము రాజధాని అయ్యెను. అప్పటికి ఇటలీ ఏకత సాధించి జాతి అయ్యెను. కాని మాజినీ కిది ఇష్టముగాలేదు. జీవితమంతయు నతడు ఇటలీని రిపబ్లికుగా జేయ ప్రయత్నించెను. ఇప్పుడు ఇటలీ, పీడ్‌మాంటు విక్టర్ ఇమ్మాన్యుయల్ రాజ్యమైపోయెను. ఈ నూతన రాజ్యము నియమబద్ధమైన మాటయు, విక్టర్ ఇమ్మాన్యుయల్ రాజైనతోడనే ట్యూరిన్‌లో ఇటాలియన్ పార్లమెంటుసభ సమావేశామైన మాటయు నిజమే.

ఇట్లు ఇటలీ మరల ఏకమై ఒకజాతియైనది. పరపాలన అంతరించినది. ముగ్గురివల్ల ఇది జరిగినది—మాజినీ, గారిబాల్డీ, కావూర్. ఈ ముగ్గురిలో ఎవరు లేకున్నను స్వాతంత్ర్యమింత త్వరలో వచ్చెడిదికాదు. చాల సంవత్సరములకు పిమ్మట, ఇంగ్లీషుకవి, నవలాకారుడు అయిన మెరిడిత్ ఇట్లు వ్రాసెను—

కష్టములలోనున్న ఇటాలియాను చూచి
యుంటిమి,
అది సగము లేచి మరల భూమిపై కూలి
పోవుట చూచియుంటిమి. ఇప్పుడో
నాగలిదున్నిన చోటనే విరగబం
డిన గోధుమ చేనువలె
సుభిక్షముగా, చక్కగా ఉన్నది, ఇటలీ వారి
నిగూర్చియే మా తలంపులు

ఇటిలీ దేశమునకు ప్రాణముపోసిన
వారిని గురించియే
కావూర్, మాజినీ, గారిబాల్డీ; ముప్పురు.
దాని మేధ, దాని ఆత్మ, దాని ఖడ్గము; వారే
వినాశకరమగు వైషమ్యములనుండి
శుభలక్ష్యముతో ఇటలీకి
స్వేచ్ఛ గూర్చినవారు,

సంక్షిప్తముగా ఇటలీ స్వాతంత్ర్య సమరమును గూర్చి ముఖ్య విషయములను చెప్పియుంటిని. ఈ చిన్న వృత్తాంతమును కడచి పోయిన కాలమునాటి మృత చరిత్రఖండముగా నీవు భావించవచ్చును. కాని యీ వృత్తాంతమును సజీవమైనదానిగాచేసికొని, ఈ పోరాటమందలి ఆనందమును, బాధను నీవు పొందుట ఎట్లో చెప్పెదను. ఎన్నో సంవత్సరములకు పూర్వము నేను విద్యార్థిగానున్నప్పుడు నా అనుభవమిట్టిది. ట్రెవెల్యాన్ వ్రాసిన మూడు పుస్తకములప్పుడు చదివి ఈ కథ తెలిసికొంటిని. "గారిబాల్డీ: రోమన్ రిపబ్లిక్ కొరకు పోరాటము" ఒక పుస్తకము; "గారిబాల్డీ: వేయిమంది" రెండవ పుస్తకము; "గారిబాల్డీ: ఇటలీ నిర్మాణము" మూడవపుస్తకము.

ఇటాలియనుల పోరాటము జరుగుచున్నప్పుడు ఇంగ్లీషు ప్రజలు, గారిబాల్డీ యన్నను, అతని రక్త కవచులన్నను సానుభూతి చూపిరి. ఇంగ్లీషు కవులనేకులు ఈ సమరమునుగూర్చి హృదయమును కదలించు కవిత్వమల్లిరి. వారి యోగక్షేమములకు భంగము రానప్పుడు ఇంగ్లీషు ప్రజలు స్వతంత్రమునకై పోరాడు వారిపట్ల సానుభూతి చూపుట చూడ వింతగానుండును. స్వేచ్ఛకై పోరాడుచున్న గ్రీసుకు వారు బైరన్ కవిని, ఇతరులను పంపిరి. ఇటలీకి అభివందనములుచెప్పిరి. దానిని ప్రోత్సహించిరి. కాని పొరుగుననున్న ఐర్లెండుకును, దూరముననున్న ఈజిప్టు, ఇండియా మున్నగు దేశములకును వారి రాయబారులు మాక్సిమ్ తుపాకు

లను, వినాశనమును తెచ్చిరి. అనాటి ఇటలీనిగూర్చి స్విన్బరన్, మెరిడిత్, ఎలిజబెత్ బారెట్ బ్రౌనింగు కవులు చక్కని కవిత్వముచెప్పిరి. ఈ విషయమునుగురించియే మెరిడిత్ నవలలుకూడ వ్రాసెను. స్విన్బరన్ వ్రాసిన—"రోముముందు అగుట"—అనుపేరుగల పద్యమునుండి కొన్నిపంక్తులు ఉదహరించుచున్నాను. ఇటలీ పోరాటము జరుగుచుండగా, అది అనేక విఘ్నముల నెదుర్కొనుచుండగా, పరాధికారులను రాజద్రోహు లనేకులు కొలుచుచుండగా ఈ పద్యము వ్రాయబడినది.

"బహుమతులున్నవి మీ యజమానులు మీ
కిచ్చుటకు,
స్వేచ్ఛమీకు బహుమతులీయజాలదు;
నిలువ నీడనీయక నిలుచుటకు తావు
నీయక
మేరలేని, అడ్డులేని, నిద్రలేని వేగ
ముతో,
పొమ్మని సేనల నది పురిగొల్పును—
కడుపునిండ తిండిలేని సేనలను స్వేచ్ఛకై రక్త
మిచ్చు సేనలను,
దాని బీజమునకై వారి జీవితములను
చల్లుచుండిన సేనలను,
వారి భస్మము జాతిని మరల పునఃసృష్టి చేయుటకు
వారి ఆత్మలు దానికొరకొక నక్షత్రమును వెలి
గించుటకు."

## 128
# జర్మనీ తలయెత్తుట

జనవరి 31. 1933

వెనుకటిజాబులో ఒక గొప్ప యూరోపియన్ జాతి నిర్మాణమును పసము చూచితిమి. నేడు మనకది బాగుగాతెలిసినజాతియే. ఇప్పుడు మరియొక జాతి నిర్మాణమునుగూర్చి తెలిసికొందము. అది జర్మనీ.

సమాన భాషయున్నను, సమాన లక్షణము లనేకమున్నను, జర్మనీ. చిన్నవీ పెద్దవీ, అగు అనేక రాష్ట్రములుగా విభజింపబడి యుండెను. చాలశతాబ్దులకాలము, హాప్సుబర్గుల పాలనమందలి ఆష్ట్రియా జర్మను రాష్ట్రములలో మిన్నయైయుండెను. పిమ్మట ప్రష్యా ముందుకు వచ్చెను. జర్మను ప్రజల నాయకత్వమువహించు విషయమున నీ రెంటి కిది స్పర్ధ ఏర్పడెను. నెపోలియన్ రెంటి రాష్ట్రములను పరాఘాతులను చేసెను. తత్కారణమున జర్మనుజాతీయత బలమునంది అతని తుది పరాజయమునకు సాయపడెను. ఇట్లు ఇటలీలోను, జర్మనీలోను, నెపోలియన్ అనుకోకుండ, కోరకుండ, జాతీయోద్యమమునకును. స్వేచ్ఛాభావనలకును, ప్రోత్సాహమిచ్చెను. నెపోలియన్ కాలమునాటి జాతీయ నాయకుడొకడు, ఫిచీ అను తత్వజ్ఞాని తన ప్రజలకు ప్రబోధము కలిగించినదేశభక్తి పరాయణుడు.

నెపోలియన్ అనంతరము అర్ధశతాబ్ది వరకు ఈ చిన్న రాష్ట్రములు సాగుచుండెను. వీనిని సమ్మేళనము చేయుటకెన్నియో ప్రయత్నములు జరిగెను. కాని ఆష్ట్రియన్, ప్రష్యన్ రాజులును, దొరతనములును నాయకత్వము కోరుచుండుటచే అవి ఫలించలేదు. ఈ కాలమున స్వేచ్ఛా ప్రియులనందరను దొరతనము పీడించుచుండెను. 1830లోను, 1848 లోను తిరుగుబాట్లు జరిగెను. అవి అణచివేయబడినవి. ప్రజలను జోకొట్టుటకై కొన్ని చిల్లర సంస్కరణములును జరిగెను.

ఇంగ్లాండులోవలెనే, జర్మనీలో అచ్చటచ్చట రాక్షసి బొగ్గుగనులు, ఇనుపగనులు ఉండెను. పారిశ్రామికాభివృద్ధికి పరిస్థితు లనుకూలముగా నుండెను. జర్మనీకి ప్రసిద్ధి దాని తత్త్వజ్ఞానులవల్లను, శాస్త్రజ్ఞులవల్లను, సైనికులవల్లనుకూడకలిగెను. ఫ్యాక్టరీలు కట్టబడెను. అప్పుడు పారిశ్రామిక కార్మికవర్గము అభివృద్ధి నందదొడగెను.

ఈ సందర్భమున, శతాబ్ది మధ్యభాగములో, ప్రష్యాలో ఒక పురుషుడు తలయెత్తెను. జర్మనీలోనేగాదు, యూరోపియన్ రాజకీయము లలో గూడ నతడు ప్రబలుడు కానుండెను. ఈ పురుషుడు ఆటోవాన్ బిస్మార్కు. ఇతడు ప్రష్యాలో భూమి కామందు. వాటర్లూ యుద్ధ సంవత్సరమున నతడు జన్మించెను. అనేక సంవత్సరములపాటు అతడు అనేక దేశములలో రాజ్యతంత్రజ్ఞత నెరపు దూతగానుండెను. 1862లో అతడు ప్రష్యాకు ప్రధానామాత్యుడయ్యెను. తోడనే అతని సామర్థ్యము గోచరమయ్యెను. ప్రధాని అయి వారము దాటకుండగనే ఒక ఉపన్యాస ములో ఇట్లతడు చెప్పెను-"ఈనాటి మహాసమస్యలు ఒక నిర్ణయమునకు రాగలవు. ఉపన్యాసములవల్ల కాదు, పెక్కుమంది చేతులెత్తిన తీర్మాన ములవల్ల కాదు. ఇనుముతో, రక్తముతో."

* రక్తము, ఇనుము: ఈ మాటలు ప్రసిద్ధికెక్కినవి. దూరదృష్టితో, కఠినదనముతో నాత డవలంబించిన రాజనీతి ఈ మాటల కనుగుణముగా నుండెను. ప్రజాస్వామిక మన్న నతనికి కిట్టదు. పార్లమెంటులన్నను, ప్రజాసభలన్నను అతనికెంతమాత్రము గౌరవములేదు. అతడు భూత కాలమునకు సంబంధించినవాడు. కాని సమర్థుడు. పట్టుదలగలవాడు కాబట్టి అతని ఇష్టముప్రకారము వర్తమాన కాలమును నడిపించెను. పందొమ్మిదవ శతాబ్ది రెండవభాగమున, అతడు నేటి జర్మనీ నిర్మాత అయ్యెను. యూరోపియన్ చరిత్రకు ఒక రూపము నేర్పరిచెను. తత్వ

* రక్తము, ఇనుము = **Blood & iron**-ఇంగ్లీషు భాషలో ఇవి జాతీయము. వీని అర్థము—సైనికబలముతో కార్యసాధన చేసికొనుట.

జ్ఞానులయొక్కయు, శాస్త్రజ్ఞుల యొక్కయు జర్మనీ మరుగుపడెను. క్రొత్త జర్మనీ, ఖడ్గరక్తములతో, సైనిక బలసామర్థ్యముతో యూరోపు ఖండమంతటిలోను ప్రబలముగా నుండెను. ఆనాటి జర్మన్ ప్రముఖు డొకడిట్లనెను—"బిస్మార్కు జర్మనీని గొప్పగాచేసెను. జర్మనులను అల్పులనుగా చేసెను." యూరోపులోను, అంతర్జాతీయ విషయము లందును జర్మనీని ఒక గొప్పదేశముగా చేసిన అతనిరాజనీతి జర్మను లకు ఆనందదాయకముగా నుండెను. నానాటికి వృద్ధియగుచున్న తమ జాతి పలుకుబడిని చూచి వారతదెంతతమ్ము హింసించుచున్నను పడియుండిరి.

బిస్మార్కు అధికారమునకు వచ్చుటకుపూర్వము కర్తవ్యమును చక్కగా ఆలోచించుకొనియుండెను. జాగ్రత్తగా తయారుచేసిన ప్రణాళి కను వేసికొనియుండెను. అక్షరాలా ఈ ప్రణాళిక ననుసరించి అతడు పోయెను. ఆశ్చర్యకరమగు విజయమును సాధించెను. జర్మనీని, తత్ ద్వారా ప్రష్యాను యూరోపులో ప్రబల దేశములుగా జేయ నాతడు సంక ల్పించి పనిచేసెను. ఆ కాలమున మూడవ నెపోలియన్ ఏలుబడిలో నున్న ఫ్రాంసు యూరోపుఖండములో మిక్కిలి ప్రబలజాతిగానుండెను. ఆస్ట్రియాకూడ దానికి ప్రతిస్పర్థియైయుండెను. బిస్మార్కు ఇతర దేశము లతో నెట్లు చరించెనో, తరువాత వరుసక్రమమున వారి నెట్లు తొలగించి వేసెనో చూచినయెడల, ప్రాతకాలపు అంతర్జాతీయ రాజకీయములు, రాజ్యతంత్రజ్ఞత ఎట్లుండెనో మనము తెలిసికొనవచ్చును. మొట్టమొదట జర్మన్ నాయకత్వ సమస్యను పరిష్కరించ నతడు పూనుకొనెను. ప్రష్యా, ఆస్ట్రియాలమధ్యనున్న ప్రాతస్పర్థలు ఉండుటకు వీలులేదు. ప్రష్యాకు అనుకూలముగా నీ సమస్య చివరకు పరిష్కారము కావలెను. తాను ప్రష్యాకు ఒదిగి ఉండవలసిదేయని ఆస్ట్రియా గ్రహించవలెను. పిమ్మట ఫ్రాంసు వంతు వచ్చును. [నేను ప్రష్యా, ఆస్ట్రియా, ఫ్రాంసు అన్నప్పుడు ఆ యా దేశముల ప్రభుత్వములనియే నా యభిప్రాయము.

ఈ ప్రభుత్వము లన్నియు నిరంకుశములు. అచ్చట పార్లమెంటు సభల కధికారము బహుకొద్ది.]

బిస్మార్కు తన సైనిక బలమును ప్రశస్తముగాచేసెను. ఇంతలో మూడవ నెపోలియన్ ఆష్ట్రియాను డీకొని ఓడించెను. ఈ పరాజయ మును పురస్కరించుకొని గారిబాల్డీ దక్షిణ ఇటలీలో యుద్ధముసాగించెను. దానికి ఫలితముగా ఇటలీ స్వతంత్రమయ్యెను. ఆష్ట్రియా బలహీనమగును గాన, ఇదంతయు బిస్మార్కుకు అనుకూలముగా నుండెను. రష్యన్ పోలెండులో జాతీయమగు తిరుగుబాటు తలయెత్తగా, అవసరమైనచో పోలెండు దేశీయులను కాల్చివేయుటకైనను సరే సహాయము చేతునని బిస్మార్కు జారుకు చెప్పెను. ఇట్టిపని దుష్కీర్తికరమైనది. కాని దీని వల్ల బిస్మార్కుకు ప్రయోజనము కలిగినది. ముందు ముందు యూరోపు వ్యవహారములలో తాను కలుగజేసికొనుట తటస్థించినచో జారు తనపై సద్భావమున్నది గాన తన పక్షమవలంబించగలడు. పిమ్మట ఆష్ట్రియాతో స్నేహముచేసి డెన్మార్కును ఓడించెను. వెంటనే ఫ్రాంసు, ఇటలీల సమ్మతితో, సహాయముతో ఆష్ట్రియాపై కెదురుతిరిగెను. 1866 సంవత్సరమున స్వల్ప కాలములోనే ఆష్ట్రియా బిస్మార్కువశమయ్యెను. ఈ విధముగా ప్రష్యా జర్మనీలో నాయకత్వము వహించెను. జర్మనీలో నాయకత్వ మీరీతిగా పరిష్కారమైన పిమ్మట ఆష్ట్రియానతడు ఉదార భావముతోచూచెను. వారిలోని కోపబీజముల నిట్లు తొలగించెను. ఉత్తర జర్మనీ సంయుక్త ప్రభుత్వము స్థాపించుటకు ఇప్పుడు అనుకూల్య మేర్పడినది (దీనిలో ఆష్ట్రియాలేదు). ఇది ప్రష్యా నాయకత్వమున పుట్టినది. దీనికి బిస్మార్కు ఫెడరల్ ఛాన్స్లరు అయెను. నేటి మన రాజకీయ పండితులు, ధర్మశాస్త్రవేత్తలు కొందరు మాసముల తరబడి, సంవత్సరముల తరబడి ఫెడరేషనులగూర్చియు, రాజ్యాంగ విధానముల గూర్చియు చర్చించి వాదింతురు. చూడుడు, అయిదుగంటలలో, ఉత్తర జర్మన్ ఫెడరేషనుకు నూతన రాజ్యాంగ విధానమును బిస్మార్కుచెప్పి

వ్రాయించెను. కొద్దిమార్పులతో ఈ రాజ్యాంగ విధానమే 50 సంవత్సరములకాలము, ప్రపంచయుద్ధము ముగియువరకు, జర్మనీలో అమలులో నుండెను. యుద్ధానంతరము 1918 లో రిపబ్లికు స్థాపించబడెను.

బిస్మార్కు, ఉన్నతమగు, తన ప్రథమలక్ష్యమును సాధించెను. పిమ్మటచేయవలసినపని, ఫ్రాంసును పరాభూతముచేసి, యూరోపులో తన ప్రాబల్యమును స్థాపించుకొనుట. నెమ్మదిగా ఎదుటివానికి తెలియకుండ అతడందుకై సంసిద్ధమయ్యెను. ఇతర యూరోపియన్ దేశముల కనుమానము కలుగకుండునట్లు అతడు జర్మనీ ఐక్యతకు పాటుపడెను. పరాజితమగు ఆష్ట్రియా ఉదారబుద్ధితో చూడబడుటవల్ల నా దేశ ప్రజలలో ద్వేషము చాలవరకు శమించెను. ఇంగ్లాండు, ఫ్రాంసుకు ఆజన్మ ప్రతిస్పర్థి. మూడవ నెపోలియన్ యొక్క దూరాశాభూయిష్టమగు పన్నుగడలను అపనమ్మకముతో కనిపెట్టుచుండెను. ఫ్రాంసుపై బిస్మార్కు తలపడినప్పుడు ఇంగ్లాండు సద్భావమును సంపాదించుట కష్టముకాదు. యుద్ధమున కాతడు పూర్తిగా సంసిద్ధుడయినను బహు చాకచక్యముతో మెలగుటచేత, 1870 లో మూడవ నెపోలియనే ప్రష్యాపై యుద్ధమును ప్రకటించెను. కలహశీలయగు ఫ్రాంసు ఏమియు నెరుగని ప్రష్యాపై విరుచుకొని పడినదని యూరోపులోనివారు తలచిరి. పారిస్‌లోని ప్రజలు "పద బెర్లిన్! పద బెర్లిన్!" అని అఱవదొడగిరి. మూడవ నెపోలియన్ త్వరలోనే విజయమును సాధించిన సైన్యమునకు నాయకుడై బెర్లిన్ పట్టణమును ప్రవేశింతునని సంతోషించెను. కాని దీనికి వ్యతిరేకముగా జరిగెను. సుశిక్షితమగు బిస్మార్కు సైన్యము ఫ్రాంసు ఈశాన్య సరిహద్దుపై విరుచుకొనిపడెను. దానిముందు ఫ్రెంచిసేన పేకముక్కలవలె కూలిపోయెను. కొద్దివారములలో మూడవ నెపోలియన్ చక్రవర్తియు, అతని సైన్యమును జర్మనులచే చెరబెట్టబడెను.

ఈ విధముగా ఫ్రాంసుయొక్క రెండవ నెపోలియన్ సామ్రాజ్యము అంతరించెను. వెంటనే పారిస్‌లో రిపబ్లికు ప్రభుత్వము స్థాపించ

బడెను. మూడవ నెపోలియన్ పతనమునకు కారణములనేకమున్నవి. ప్రజలను పీడించుటచే నతనికి ప్రజలలో పలుకుబడిలేకపోవుటయే ప్రధాన కారణము. పరదేశములపై యుద్ధములు తలపెట్టి అతడు ప్రజలదృష్టిని మరలింప ప్రయత్నించెను. కష్టదశలోనున్న రాజులును, దొరతనములును అవలంబించు పద్ధతియే యిది. అతనికి మనోరథసిద్ధి కలుగలేదు సరిగదా యుద్ధమే అతని దురాశలను అడుగంటించెను.

పారిస్‌లో నేషనల్ డిఫెన్సు దొరతనము * నెలకొల్పబడెను. ప్రష్యాతో వారు సంధిజేసికొన గోరిరి. కాని బిస్మార్కు సూచించిన సంధి షరతులు మిక్కిలి అవమానకరముగా నుండుటచే వారు, తమకు సైన్యము లేకున్నను, పోరాటము సాగించవలెననియే నిశ్చయించిరి. జర్మను సేనలు వార్సై (Versailles) వద్దను, పట్టణము చుట్టును నిలిచి పారిస్‌ను చాలకాలము ముట్టడించిరి. చివరకు పారిస్ లొంగిపోయెను. నూతన రిపబ్లికు పరాజయమునకు తలయొగ్గెను. బిస్మార్కు కఠిన షరతుల నంగీకరించెను. నష్టపరిహారముక్రింద పెద్ద మొత్తము చెల్లించుటకు ఫ్రాంసు ఒప్పుకొనెను. అన్నింటికన్న విచారకరమైన విషయము-200 సంవత్సరములకుపైగా ఫ్రాంసులో భాగమైన ఆల్సేసు, లొరైను రాష్ట్రములు జర్మనీకి ధారాదత్తము చేయవలసివచ్చెను. పారిస్ ముట్టడి ముగియక పూర్వమే ఒక నూతన సామ్రాజ్యోదయమును వార్సై వీక్షించెను. 1870 సెప్టెంబరులో మూడవ నెపోలియన్ ఫ్రెంచి సామ్రాజ్యమంతరించెను. 1871 జనవరిలో, ప్రష్యారాజు కైజరుగా, అనగా చక్రవర్తిగా, వార్సై భవనములో, లూయీXIVయొక్క వైభవోపేత మగు హాలులో ఐక్య జర్మనీ ప్రకటింపబడెను. జర్మనీలోని రాజులును. ప్రతినిధులును, అందరును అందు సమావేశమై తమ చక్రవర్తిని, కైజరును, "ముదమొప్పంగాంచి సేవించిరి." ప్రషియన్ రాజవంశమగు హోహెన్ జోలరెన్ నేటినుండి సామ్రాజ్యమును పాలించు వంశ

---

* Government of National Defence.

మయ్యెను. ఐక్య జర్మనీ ప్రపంచమందలి ప్రబల దేశములలో నొక్కటి అయ్యెను.

వార్‌సైలో ఉల్లాసములు, ఉత్సవములు చెలరేగుచుండెను. చేరువ లోనే ఉన్న పారిస్‌లో దుఃఖము, శోకము, అవమానములతో ప్రజలు కుములుచుండిరి. కష్టపరంపర తటస్థించుటచేత ప్రజలు దిగ్భ్రాంతులగు చుండిరి. సుస్థిరము, సుస్థాపితము అగు దొరతనమైనను వారికిలేదు. నేషనల్ అసెంబ్లీకి రాజపక్షవలంబు లనేకులు ఎన్నుకోబడిరి. వీరు కుట్రలు పన్ని ఏకాధిపత్యము స్థాపింపజూచిరి. తమ దారిలో నున్న అడ్డంకిని తొలగించుటకై వారు నేషనల్‌గార్డునుండి ఆయుధముల తొలగింప ప్రయత్నించిరి. నేషనల్ గార్డు రిపబ్లికన్ పక్షమని వారి నమ్మకము. నగరమందలి ప్రజాస్వామిక పక్షమువారును, విప్లవకారు లును ఈ చర్యవల్ల ప్రతికూల పరిస్థితు లేర్పడుననియు, ప్రజాపీడకు మరల దారి తీయుననియు తలంచిరి. తిరుగుబాటువచ్చెను. మార్చి 1871 లో పారిస్ కమ్యూన్ * ప్రకటింపబడెను. ఇది ఒక విధమగు మునిసిపాలిటీ. మహా ఫ్రెంచి విప్లవము నిది మార్గదర్శిగా పెట్టుకొనెను. ఈ ఉద్యమమున అప్పటికే తలయెత్తిన సోషలిష్టు భావములు అస్పష్ట ముగా కనిపించుచుండెను. ఒక విధముగా చూచిన రష్యాలో రానున్న సోవియట్ల భావములనిది ముందుగానే ప్రదర్శించెను.

1871 లో పుట్టిన పారిస్ కమ్యూన్ అల్పకాలమే జీవించెను. రాజ పక్షవలంబులును, బూర్జువాలును, ప్రజాసామాన్యము చేసిన తిరుగు బాటు చూచి భయపడి, కమ్యూన్ అధికారముక్రిందనున్న పారిస్ భాగ మును ముట్టడించిరి. సమీపమందే, వార్‌సైలోను ఇతరచోట్లను నెలకొని యున్న జర్మన్ సైన్యము మాటాడకుండ దీనిని కనిపెట్టెను. జర్మనుల వల్ల చెరబట్టబడిన ఫ్రెంచి సైనికులు, తమకు విడుదల కలిగినతోడనే తిరిగి వచ్చి తమ ప్రాత అధికారుల పక్షమున కమ్యూన్‌కు వ్యతిరేక

* విప్లవసంఘము

ముగా పోరాడిరి. వారిపై దండయాత్ర సాగించి 1871 మే అంతమున ఒక వేసవినాడు వారిని ఓడించి, 30,000 మంది పురుషులను, స్త్రీలను పారిస్ వీధులలో కాల్చి చంపిరి. కమ్యూన్ పక్షమువారి ననేకులను బంధించిరి. పిమ్మట వారిని దయాదాక్షిణ్యములు లేకుండ కాల్చివేసిరి. ఈ విధముగా కమ్యూన్ అంతరించెను. ఆకాలమున యూరోపులో అధికముగా అలజడి నిది కలిగించెను. క్రూరముగా కమ్యూనును అణచి వేయుట వల్లనే ఈ అలజడి కలుగలేదు; తత్కాలమందలి ప్రభుత్వ విధానముపై చేయబడ్డ సోషలిష్టు తిరుగుబాటది యనియు అలజడి కలిగినది. బీదలు అనేక పర్యాయములు భాగ్యవంతులపై తిరుగబడిరి. కాని, ఏ విధానము తమ దారిద్రమునకు కారకమో దానిని మార్చవలెనని వారనుకోలేదు. కమ్యూన్–ప్రజాస్వామికమగు తిరుగుబాటు మాత్రమే కాదు. ఆర్థికమగు తిరుగుబాటుకూడ. కాన యూరోపులో సోషలిష్టు భావములు పెంపొందుటకిది యొక మార్గదర్శి అయ్యెను. ఫ్రాంసులో కమ్యూన్‌ను క్రూరముగా నణచివేయుటచేత సోషలిష్టు భావములు మరుగున పడెను. అవి తేరుకొనుట నెమ్మదిగా జరిగినది.

కమ్యూన్ అణచివేయబడినప్పటికిని ఫ్రాంసులో ఏకాధిపత్యము నిలుపుటకు మరల ప్రయత్నములు జరుగలేదు. కొంతకాలమైనతరువాత ప్రజాప్రభుత్వ తత్త్వవముతో నది సంతుష్టి చెందియుండెను. 1875 జనవరిలో క్రొత్తరాజ్యాంగ విధానముక్రింద మూడవ రిపబ్లికు ప్రకటింపబడెను. నాటినుండి ఈ రిపబ్లికు అమలులో నుండెను. నేడున్నదికూడ అదియే. నేడుకూడ ఏకాధిపత్యమునుగూర్చి ప్రసంగించు పురుషులు కొందరు ఫ్రాంసులోనున్నారు. కాని వారి సంఖ్య తక్కువ. రిపబ్లికును నడిపించుటకే ఫ్రాంసు రూఢి చేసికొన్నది. ఫ్రెంచి రిపబ్లికు బూర్జువా రిపబ్లికు. భాగ్యవంతులగు మధ్యతరగతి ప్రజలే దానిని నడుపుచుండిరి.

1870–71 సంవత్సరమున జరిగిన జర్మన్ యుద్ధమునుండి ఫ్రాంసు తేరుకొనెను. నష్టపరిహారమైన పెద్ద మొత్తమును చెల్లించెను.

కాని ప్రజల హృదయములలో, అవమానములు చేసినందుకు కోపము ప్రజ్వలించుచుండెను. వారు అభిమాన ధనులు. దీర్ఘ స్మృతికలవారు. ప్రతిక్రియ వారి మనస్సుల నావరించెను. ఆల్సేస్, లోరైను పోయి నందుకు వారికి మిక్కిలి కష్టముగానుండెను. ఓడిపోయిన ఆష్ట్రియా విషయమున బిస్మార్కు ఉదారభావముతో మెలగి తనవివేకమును వెల్ల డించుకొనెను. కాని ఫ్రాంసు విషయమున నాతడు తీసికొన్న క్రూర చర్యలో ఔదార్యములేదు. వివేకమునులేదు. అభిమాన ధనులగు శత్రుపు లను పరాభవించి, భయంకరమును, చిరస్థాయియు నగు శత్రుత్వము నాత డార్జించుకొనెను. సెడన్ యుద్ధానంతరము, సంగ్రామము ముగియక మునుపే, ప్రసిద్ధ సోషలిష్టుగా కారల్‌మార్క్సు ఒక ప్రకటనచేసెను. దానిలో భావినిట్లు సూచించెను. ఆల్సేసును జర్మనీ కలుపుకొనుట ఆరెండు దేశముల "నిరంతర శత్రుత్వమునకును దారితీయును. శాశ్వతశాంతికి దారితీయదు. తాత్కాలిక యుద్ధ విరమణమునకుమాత్రమే దారితీయును." ఈ విషయమందును, ఇంకా ఇతర విషయములందును అతడు నిజముగా భావి ఫలసూచకుడు.

జర్మనీలో బిస్మార్కు ఇప్పుడు ఇంపీరియల్ ఛాంసెల్లర్; సర్వ తంత్ర స్వతంత్రుడు. "రక్తము-ఇనుము" రాజనీతి తాత్కాలికముగా విజయము గన్నది. జర్మనీకది ఇష్టముగానుండెను. ఉదారభావములకు విలువలేదు. ప్రజాస్వామికమన్న బిస్మార్కుకు నమ్మకములేదు. కాన అధికారము ఏలిక హస్తగతము చేయుటకతడు ప్రయత్నించెను. జర్మన్ పరిశ్రమలు, కార్మికవర్గము పెరుగజొచ్చెను. వీరు బలముకూర్చుకొనుచు క్రొత్తసంస్కరణములనుకోరిరి. ఇట్లు నూతన సమస్యలు తలయెత్తెను. బిస్మార్కు రెండు విధములుగా ఈ సమస్యల నెదుర్కొనెను. కార్మిక పరిస్థితులను బాగుచేసెను. సోషలిజమును అణచివేసెను. సాంఘిక శాసనములను చేసి కార్మికులను తన పక్షమునకు త్రిప్పుకొన ప్రయత్నిం చెను. లేదా వారు అతివాదులుకాకుండ చేయ ప్రయత్నించెను. ఇట్టి శాసన

ములు చేయుటలో జర్మనీ పురోగామి అయ్యెను. ముసలివారికి ఈయవలసిన పింఛన్లు (ఉపకార వేతనము), భీమా, కార్మికులకు వైద్యసహాయము, కార్మికుల పరిస్థితులు బాగుచేయు ఇతర మార్గములు—వీనికి సంబంధించిన శాసనములు జర్మనీ అమలులోపెట్టెను. ఇంతకన్న ప్రాచీనమైన పరిశ్రమలు, కార్మికోద్యమము గలఇంగ్లాడు అప్పటికి ఇట్టి శాసనములు అట్టే చేయనేలేదు. జర్మనీకి సమర్థులగు నాయకులుండెరి. ఫెర్డినెండు లస్సాల్ శేముషీ దురంధరుడు. 19వ శతాబ్దిలో అంతటి వక్త లేడనిచెప్పుదురు. ద్వంద్వ యుద్ధము కారణముగా నతడు పిన్నవయస్సుననే చనిపోయెను. విల్‌హెల్మ్ లీబ్‌నెట్ (Liebknecht) ధైర్యసాహసములతో పోరాడు వాడు. విప్లవశూరుడు. అతడు గుండుదెబ్బకు చనిపోవలసినదే. కాని తప్పించుకొని చాలకాలము బ్రదికెను. అతని కొడుకు కారల్ స్వతంత్రమునకై పోరాటము సాగించుచునేయుండెను. కొద్ది సంవత్సరములకు పూర్వమే, 1918లో జర్మనీలో నూతన రిపబ్లికు స్థాపించునపుడు హత్య చేయబడెను. ఇంకొక నాయకుడు కారల్ మార్క్స్. అతనిని గురించి వేరొక జాబులో ముచ్చటింతును. కాని మార్క్స్ తన జీవితములో పెద్ద కాలము జర్మనీనుండి బహిష్కరింపబడి అన్యదేశములు పట్టవలసి వచ్చెను.

కార్మిక సంస్థలు వృద్ధి అయ్యెను. 1875 సంవత్సరములో అవి అన్నియు కలిసి సోషలిష్టు డెమోక్రాటిక్ పార్టీ అయ్యెను. సోషలిజం అభివృద్ధి చెందుట బిస్మార్కుకు ఇష్టముగాలేదు. చక్రవర్తిని చంపుటకు ఒక ప్రయత్నము జరుగగా బిస్మార్కు ఇదియే సందు చూచుకొని సోషలిష్టులను తీవ్రముగాదండించెను. 1878లో సోషలిష్టులకు వ్యతిరేకముగా చట్టములు చేయబడెను. సోషలిష్టు లెట్టి ఉద్యమము నందును పాల్గొనరాదని నిషేధించెను. సోషలిష్టుల నుద్దేశించి ఒక మార్షల్‌లా * అమలు జరుపబడెను. వేలాదిజనులు దేశమునుండి బహిష్కరింపబడిరి. లేదా

* సైనిక శాసనము.

ఖైదు చేయబడిరి. బహిష్కరింపబడిన పలువురు అమెరికాకు వెళ్లి అచ్చట సోషలిజం బీజముల నాటిరి. సోషలిష్టు డెమొక్రాటిక్ పార్టీ పెద్ద దెబ్బతినెను. కాని అది బ్రదికి మరల బలము పోసికొని వృద్ధి జెందెను. బిస్మార్కు భీతావహపాలనము దానిని చంపలేక పోయెను. విజయమువలన ప్రమాదమధికమాయెను. అది శక్తివంతమై పెద్ద సంస్థయై, గొప్ప ఆస్తిని సంపాదించి, వేతనములుకొను వేలాదికార్మికులు గలదై యుండెను. ఒక పురుషుడుగాని, ఒక సంస్థగాని భాగ్యవంతమైనచో విప్లవభావములు వారినుండి అంతరించును. జర్మనీలోని సోషలిష్టు డెమొక్రాటిక్ పార్టీకి ఈ అవస్థయే పట్టినది.

బిస్మార్కు రాజనీతి చాతుర్యము ఆమరణము నిలిచియుండెను. ఆనాటి అంతర్జాతీయ రాజకీయములలో అతడు ప్రముఖపాత్రవహించెను. నాడును, నేడునుకూడ ఈ రాజకీయములు—కుట్రలు, ప్రతి కుట్రలు, మోసము, బూకరింపుల విచిత్రసమ్మేళనము, అన్నియు రహస్యముగా, తెరవెనుకనే జరుగును. పగటియెండ తగిలిన నవి చిరకాలము బ్రదుక జాలవు. ఇప్పుడు, ఫ్రెంచివారు తనపై కసి తీర్చుకొందురని బిస్మార్కు భయపడ నారంభించెను. అందుకై అతడు ఆష్ట్రియా, ఇటలీలతో మైత్రి చేసికొనెను. దీనికి "ట్రిపిల్ యలయన్సు"(ముగ్గురి మైత్రి) అని పేరు. ఇట్లు ఇరుకక్షలవారును (జర్మనీ, ఫ్రాంసు) ఆయుధములను సమకూర్చు కొనుచుండిరి. కుట్రలు పన్నుచుండిరి. ఒకరి నొకరు కొరకొర చూచుకొనుచుండిరి.

1888లో ఒక పిన్నవాడు, విల్హెల్మ్ II అను పేరున జర్మనీకి కైజరు ఆయెను. తాను బలాఢ్యుడ నని అతడు గట్టిగా నమ్మియుండెను. కొద్ది కాలములోనే అతడు బిస్మార్కుతో జగడమాడెను. వార్ధక్యములో, ఐరన్ ఛాంసెల్లర్ బిస్మార్కు, తన పదవినుండి తొలగింపబడెను. అతడు క్రుద్ధుడయ్యెను. కళ్లు తుడుచుటకు అతనికి 'ప్రింస్' అనే బిరుద మీయబడెను. కాని అతడు విసుగుదలతో తన ఎస్టేటుకు వెడలిపోయెను.

రాజుల విషయమై అతనికున్న అభిమానము పటాపంచలైనది. ఒక స్నేహితునితో అతడిట్లనెను—"నేను ఉద్యోగమున ప్రవేశించినప్పుడు రాజ పక్షపాతము వహించియుంటిని. రాజులను గౌరవించుచుంటిని. కాని ఇప్పుడు తలుచుకొన్న విచారముకలుగును. ఆ పక్షపాతము, ఆ గౌరవము నానాటికి క్షీణించుచుండెను. నేను ముగ్గురు నగ్న రాజులను చూచితిని. ఆ దృశ్యము నాకు సంతోషావహముగాలేదు."

క్రుద్ధుడగు వృద్ధుడు ఇంకను అనేక సంవత్సరములు బ్రదికెను. 83వ ఏట, 1898 లో అతడు మరణించెను. కైజరతనిని పదవీచ్యుతుని చేసినను, అతడు మృతుడైనను, అతని ఛాయ జర్మనీ నావరించెను. అతని తరువాత వచ్చినవారిని అతని శక్తి ప్రేరేపుచుండెను. కాని వారు అతనివలె సమర్థులుకారు.

## 129

# కొందరు ప్రసిద్ధ రచయితలు

ఫిబ్రవరి 1, 1933

జర్మనీ తలయెత్తుటనుగురించి నిన్న నేను నీకు వ్రాయునప్పుడు, 19వ శతాబ్ది తొలిభాగమందున్న జర్మను అగ్రగణ్యునిగురించి ఏమియు చెప్పలేదు. ఇతడు గెథే అనువాడు. ప్రసిద్ధ రచయిత. కొద్ది మాసముల క్రితమే జర్మనీ యందంతటను, అతడు మరణించి నూరు సంవత్సరము లైనందున, ఉత్సవములు జరుపబడినవి. అప్పుడు నేననుకొంటిని. తత్కాలములో యూరోపునందున్న ప్రసిద్ధ రచయితలగూర్చి కొంత నీకు చెప్పవలెనని. ఈ విషయమునుగురించి నేను వ్రాయుట హాస్యాస్పదమే. అట్లు వ్రాసిన నా అజ్ఞానమును నేనే వెల్లడిచేసికొందును. ప్రసిద్ధ రచయితల పేళ్లుమాత్రము ఏకరువుపెట్టుట తెలివితక్కువ. వారినిగురించి కొంత వ్రాయుట కష్టసాధ్యము. ఇంగ్లీషు వాఙ్మయమునుగూర్చి నాకు తెలిసినది కొద్ది. ఇతర యూరోపియన్ వాఙ్మయములగూర్చిన నా విజ్ఞా

నము కొలది అనువాదములనుండి గ్రహించినదే. ఇక నేను చేయవలసిన దేమి ?

ఏదో కొంత వ్రాయవలెననే ఉద్దేశము నామనస్సును పీకుచున్నది. అది వదలుచ్చుకొనలేను. ఈ ఆనందభూమికి నీతోకూడ నేను చాల దూరము రాలేను. కాని, నీకు మార్గము చూపించుట అవసరమని నే నను కొంటిని. జన సమూహముయొక్క పైపైచర్యలు పరిశీలించుటవల్ల ఒక జాతి ఆత్మను తెలిసికొనుట సాధ్యముకాదు. కళా, వాఙ్మయములవల్లనే అది సాధ్యమగును. అవి మనలను శాంతము, స్వచ్ఛము అగు భావ ప్రపంచమునకు కొంపోవును. తాత్కాలిక రాగద్వేషములతో, ఈర్ష్యతో వానికి ప్రసక్తిలేదు. కాని నేడు చిత్రకారుడు, కవియు భావిఫలసూచకు లుగా చూడబడుటలేదు. వారికి నేడు గౌరవములేదు. వారికెన్నటికైనను గౌరవము రానున్నచో అది వారి మరణానంతరమే వచ్చుచున్నది.

కాన కొందరి పేళ్లు మాత్రమే నేనిప్పుడు నీకుచెప్పెదను. అందు కొన్ని నీకు తెలిసినవే కావచ్చును. శతాబ్ది తొలిభాగమును మాత్రమే ఇందుకై స్పృశింతును. ఇట్లు చేయుట నీకు రుచిపుట్టుటకు మాత్రమే. యూరోపియన్ దేశములు పెక్కింటిలో పందొమ్మిదవ శతాబ్దమున విలువగల రచన లనేకమున్నవని నీవు మరువవద్దు.

గెటీ 1749 లో పుట్టెను. కాన పదునెనిమిదవశతాబ్ది వాడనియే చెప్పవలెను. కాని అతడు 83 ఏళ్లు ముసలిపండు అగువరకు జీవించెను. పందొమ్మిదవ శతాబ్దిలో మూడుపాళ్లు అతడు చూచెను. యూరోపియన్ చరిత్రలో మిక్కిలి ఒడుదుడుకు కాలమున అతడు జీవించెను. తన దేశ మగు జర్మనీపై నెపోలియన్ సైన్యములు దండెత్తుట అతడుచూచెను. జీవితములో అతడు దుఃఖము లనుభవించెను. క్రమముగా జీవితకష్టముల ననుభవించుటకు తితిక్షగడించెను. అసంగత్వము నలవరుచుకొనెను. శాంతిని పొందెను. 60 సంవత్సరములు పైబడిన వయస్సులోనున్న అతనిని నెపోలియన్ మొదటిసారి చూచెను. ద్వారమువద్ద నతడు

నిలబడినప్పుడు అతని ముఖమందును, ఆకారమందును విశిష్టత కనిపించెను. వికలముకాని దృష్టిని, హుందాతో కూడిన ఆకారమును చూచి నెపోలియన్ "అడుగో పురుషుడు" అనెను. అతనికి అనేక విషయములు తెలియును. ఏదిచేసినను అది ప్రతిభావంతముగా నుండెను. అతడు తత్త్వశాస్త్రవేత్త, కవి, నాటకకర్త, శాస్త్రజ్ఞుడు. అనేక శాస్త్రములలో నతనికి అభిరుచి ఉండెను. ఇదియేగాదు. ఒక చిన్న జర్మన్ రాజువద్ద అతడొక మంత్రి ఉద్యోగములో నుండెను. గొప్ప రచయితగా అతడు మనకు పరిచయుడు. అతని సుప్రసిద్ధ గ్రంథము 'ఫాస్టు'. అతని దీర్ఘ జీవిత కాలమందే అతని కీర్తి దూరదేశములకు వ్యాపించెను. అతడు పరిశ్రమ చేసిన వాఙ్మయ భాగములో అతడు దేవాంశ సంభూతుడని స్వదేశస్థులు మెచ్చుకొనుచుండిరి.

గెటీకి ఒక సమకాలికు డుండెను. అతడు గెటీకన్న చిన్నవాడు. అతని పేరు షీలర్. అతడుకూడ కవియే. ఇంకను చిన్నవాడు హెన్‌రిచ్ హైన్. మరియొక గొప్ప కవి యితడు. ఇతని కవిత్వము మధురము. ఇతడు అందమగు లిరిక్కులను (గీతములు), పద్యములను వ్రాసెను. ఈ ముగ్గురును, గెటీ, షీలర్, హైన్—ప్రాచీన గ్రీసు సంస్కృతిలో మునకలు పెట్టినవారు.

తత్వశాస్త్రజ్ఞుల భూమియని జర్మనీకి చాలకాలమునుండి ప్రతీతి కలదు. నీకు ఎక్కువ అభిరుచి ఉండకపోవచ్చును. అయినను ఒకరిద్దరి పేర్లు పేర్కొందును. ఆ శాస్త్రమందభినివేశము గలవారు వారి గ్రంథములను పఠించవచ్చును. అవి క్లిష్టముగా, కష్టముగా నుండును. అయినప్పటికిని వీరును, ఇతర తత్వశాస్త్రజ్ఞులును భావజ్యోతిని వెలిగించియుండిరి. వారిద్వారా భావాభివృద్ధి ఎట్లుజరిగినదో మనము గమనించవచ్చును. అందువల్ల వారు మనకు ప్రీతి పరులును, బోధకులును. 18 వ శతాబ్దిలో ఇమ్మాన్యుయల్ కాంటు గొప్ప జర్మన్ తత్వశాస్త్రవేత్త. అతడు శతాబ్దాంతమువరకు 80 సంవత్సరములు జీవించెను. తత్వశాస్త్రవేత్త

లలో మరియొక గొప్ప పురుషుడు హేగెల్. ఇతడు కాంటును అనుసరించెను. కమ్యూనిజముకు జనకుడగు కారల్‌మార్క్సు భావపరిణామమునకు ఇతడు కారణము. తత్వశాస్త్రజ్ఞుల సంగతి ఇకచాలు.

పందొమ్మిదవ శతాబ్ది తొలి సంవత్సరములలో, ముఖ్యముగా ఇంగ్లాండులో, ఉత్తమ కవులనేకులుండిరి. ప్రసిద్ధ రష్యన్ జాతీయ కవి పుష్కిన్ ఈ శతాబ్దివాడే. పిన్నవయస్సుననే ఇతడు ద్వంద్వ యుద్ధమున మరణించెను. ఫ్రాంసులోకూడ అనేకులు కవులుండిరి. ఇద్దరి పేళ్లు మాత్రమే పేర్కొందును. ఒకడు విక్టరుహ్యూగో **(Victor Hugo).** ఇతడు 1802 లో జనించెను. గెటీ వలెనే 83 ఏండ్లు వయస్సు వచ్చువరకు జీవించెను. గెటీ వలెనే తన దేశము వారీతనిని వాఙ్మయమున దేవాంశ సంభూతుడని మెచ్చుకొనుచుండిరి. రచయితగా, రాజకీయవేత్తగా అతడు వివిధరంగముల పనిచేసెను. తొలుత నితడు రాజపక్షావలంబి. నిరంకుశత్వమున విశ్వాసమున్నవాడా యనిపించెను. క్రమక్రమముగా అతడు మారి 1848 లో రిపబ్లికన్ ఆయెను. లూయీ నెపోలియన్, స్వల్ప కాలమే నిలిచిన రెండవ రిపబ్లికుకు అధ్యక్షుడైనప్పుడు రిపబ్లికన్ భావములు పెట్టుకొన్నందుకు హ్యూగోను దేశమునుండి బహిష్కరించెను. 1871లో విక్టరుహ్యూగో పారిస్ కమ్యూన్‌పై అభిమానమును చూపెను. సాంప్రదాయత్వమను* దక్షిణ పక్షమునుండి క్రమముగా సోషలిజం అను వామపక్షమున కతడు వచ్చెను. వయస్సు వచ్చినకొలది, పలువురు సంప్రదాయపరులగుదురు. అభివృద్ధి నిరోధకులగుదురు. హ్యూగో ఇందుకు భిన్నముగా పరిణమించెను. కాని, రచయితగానే హ్యూగోతో మనకిప్పుడు ప్రసక్తి. అతడు గొప్ప కవి, నవలాకారుడు, నాటకకర్త.

నేను చెప్పదలచిన రెండవ పేరు హానొరి-డి-బాల్జాక్. ఇతడు విక్టరు హ్యూగో సమకాలికుడు. కాని భిన్న ప్రకృతి గలవాడు. బ్రహ్మాండ

---

* **Conservatism.**

మైన ఓపికతో అతడు నవలలు వ్రాసెను. అల్పవయస్సులోనే అతడు అనేక నవలలు రచించెను. అతని నవలలు ఒకదానితో ఒకటి సంబంధము కలవి. వానిలో తరుచు వచ్చు పాత్రలన్నియు సమానమే. తన కాలము నాటి ఫ్రెంచి జీవనము తన నవలలలో ప్రతిబింబింప జేయవలెనని అతని ఉద్దేశము. ఈ నవలా పరంపరకు అతడు లా కామిడీ హ్యూమేన్ అని పేరిడెను. అది శక్తికి మించిన ఉద్దేశము. అతడు తెరపిలేకుండ పని చేసినను తలపెట్టిన మహాత్కార్యము తుదముట్టలేదు.

పందొమ్మిదవ శతాబ్ది తొలి సంవత్సరములలో ముగ్గురు ఉపజ్ఞగల యువకవులు ఇంగ్లాండులో ఉదయించిరి. వారు సమకాలికులు. మూడు సంవత్సరముల తేడాతో వారు ముగ్గురును పిన్నవయస్సుననే మరణించిరి. ఈ ముగ్గురు—కీట్సు, షెల్లీ, బైరన్ అనువారు. కీట్సు దారిద్ర్యముతో, నిరుత్సాహముతో కొట్టుకొని, రోములో 1821 సంవత్సరమున 26 సంవత్సరముల వయస్సుననే చనిపోయెను. అప్పుడతని పేరెవరికిని తెలియదు. అయినను అతడు మిక్కిలి చక్కని కవిత్వమును వ్రాసెను. కీట్సు మధ్యతరగతికి చెందినవాడు. అతడు కవిత్వము చెప్పుటకు ధనలోపమే కారణమైనచో ఇక బీదవారి సంగతి ఏమి? వారు కవులు, రచయితలు అగుట దుర్ఘటముకదా! ఇందును గూర్చి నేడు కేంబ్రిడ్జిలో పనిచేయు ఆంగ్ల వాఙ్మయాచార్యుడు కొన్ని సంగత విషయములను చెప్పెను.

"మన కామన్‌వెల్తులో ఏదో దోషముండుటవల్ల బీదవాని కీ రోజులలో పైకివచ్చుట కెట్టి సావకాశము లేదు. గత 200 సంవత్సరములలో నట్టిసావకాశము కలుగలేదు. నమ్ము నా మాట. సుమారు 320 ప్రాథమిక పాఠశాలలను కనిపెట్టి చూచుచు సుమారు 10 సంవత్సరములు నేను గడపితిని. మనము ప్రజాప్రభుత్వమని పలుకవచ్చు. నిజమునకు ఇంగ్లాండులో బీదపిల్లవాడు, ఎథెన్సు బానిస పుత్రుని వలెనే, కట్టుబాట్లు త్రెంచుకొని భావ స్వాతంత్ర్యమును పొందు ఆశ ఎంతమాత్రమును లేదు. అట్టి భావ స్వాతంత్ర్యము నుండియే కదా గొప్ప రచనలు పుట్టుట."

కవిత్వము, చక్కని రచనలు, సంస్కృతి సామాన్యముగా భాగ్యవంతుల కాణాచియను మాట మనము మరతుము. పై వాక్యము లందుకే ఉదహరించితిని. బీదవాని గుడిసెలో కవిత్వ, సంస్కృతులు నివసించుటకు తావులేదు. కాలే కడుపులనవి వరించవు. కాన నేటి మన సంస్కృతి భాగ్యవంతులగు బూర్జువా హృదయములనే ప్రతిబింబించు చున్నది. వేరొక సాంఘిక పరిస్థితిలో, సంస్కృతి నభ్యసించుటకు తగిన సావకాశములును, విశ్రాంతియు చిక్కినప్పుడు, కార్మికుడు ప్రదర్శించు సంస్కృతి భిన్నముగా నుండును. నేడు సోవియట్ రష్యాలో అట్టి పరిణామమునే కనిపెట్టి చూచుచున్నారు.

గత కొద్ది తరములనుండియు ఇండియాలో గోచరించు సంస్కృతి లోపము చాలవరకు మన ప్రజల దారుణ దారిద్ర్యమువల్లనే కలుగుచున్న దని దీనినిబట్టి మనకు విశదమగుచున్నది. తినుటకు తిండిలేని ప్రజలతో సంస్కృతినిగురించి మాటాడుట హాస్యాస్పదము. ఈ దారిద్ర వ్యాధి ఇంతకన్న భాగ్యవంతులగు అల్పజనులనుకూడ బాధించుచున్నది. కాన నేడు ఇండియాలో ఈ తరగతులవారుకూడ దురదృష్టవశమున సంస్కృతి రహితులై యుండిరి. పరదేశ పరిపాలనవల్లను, సంఘములో వెనుకబడి యుండుటవల్లను ఎన్నివిధములగు కీళ్లు దాపురించుచున్నవో ! సామాన్య త్వము, దారిద్ర్యము ఆవరించిన నేమకూడ, గాంధి, రవీంద్రనాధ ఠాకూరులవంటి మహా పురుషులను, సంస్కృతి స్వరూపులను ఇండియా ప్రదర్శించగలిగినది.

చెప్పదలచిన విషయమును విడిచి అప్రస్తుత ప్రశంస చేయు చున్నాను.

షెల్లీ మంచిప్రేమపాత్రుడు. చిన్నతనమునుండియు ఉద్రేకపూరి తుడు. అన్ని విషయములందును స్వేచ్ఛ కావలెనని పోరాడువాడు. ఆక్స్ఫర్డు కాలేజీలో అతడు చదువుకొనుచున్న కాలమున "నాస్తికావ శ్యకత" అనువిషయముపై వ్యాసము వ్రాసినందుకు అతనిని బహిష్క

రించిరి. అతడు (కీట్సుకూడ) జీవించిన కొద్దికాలమును, కవియనువాడు జీవించుననుకొనెడి పద్ధతిని జీవించెను; భావనలో జీవించెను; గాలిలో జీవించెను; ప్రపంచ కష్టముల గణించక జీవించెను. కీట్సు మరణించిన ఒక సంవత్సరమునకాతడు ఇటలీతీరము కడ నీటిలో పడి మరణించెను. అతని ప్రసిద్ధ కవిత్వమును గూర్చి నేను నీకు వ్రాయనవసరములేదు. నీవే దానిని తెలిసికొనగలవు. అయినను చిన్న కావ్యమొక్కటి నీకు రుచి చూపుచున్నాను. అది అతని ఉత్తమ కావ్యములలో నొక్కటియని చెప్ప వీలులేదు. కాని నేటి నాగరికతలో బీదకార్మికుని దురవస్థనది ప్రస్ఫుటము చేయును. వెనుకటి కాలమున బానిసలుండిన దురవస్థలోనే అతడు పడియున్నాడు. ఇది వ్రాసి 100 సంవత్సరములు దాటినది. అయినను నేటి పరిస్థితుల నది నిరూపించుచున్నది. దాని పేరు 'మాస్క్ ఆఫ్ అనార్కీ.'

స్వేచ్ఛ అనగా ఏమిటి? బానిసత్వమన నేమో మీరు బాగా చెప్ప గలరు. ఎందువల్లనంటే మీరు కేకవేసిన అది "ఓ" అని పలుకును గనుక.

కాలు చేతులలో జవ, సత్వములు నిలుచుటకు పూట పూటకు కష్టించి సరిపోయిన జీతమును సంపాదించుచు మిమ్ము పీడించు నిరంకుశుని లాభముకొరకు చెరసాలలోపలె బ్రతుకుట.

— ఇదియే బానిసత్వము.

పర్యవసానము-మీరు వారి చాకిరీకే పుట్టితిరి. నేయుటకు, దున్నుటకు, పోరుటకు, దోకుటకు మీకు ఇష్టమున్నను, లేకున్నను వారిని రక్షించుటకు, వారిని పోషించుటకు పుట్టితిరి,

— ఇదియే బానిసత్వము.

శుష్కించిన తల్లులతో, బలహీనులైన మీ పిల్లలను చూచు చుండుట,

శీతాకాలమున శీతల వాయువులు వీచుచుండగా—

—నేను మాటాడుచుండగనే—వారు మరణించుట,

— ఇదియే బానిసత్వము.

తన కన్నులముందు వెక్కసముగా తిని, పరున్న, బలిసినకుక్కలకు భాగ్యవంతుడు నిర్లక్ష్యముగా విసిరివైచు తిండి వంటి తిండి దొరకక మీరు ఆకలితో బాధపడుచుండుట,

— ఇదియే బానిసత్వము.

మీ మనస్సులలోకూడ మీరు బానిసలై యుండుట, మీ ఇష్టము చొప్పున మీరు చరించకుండుట, ఇతరుల చేతులలో కీలుబొమ్మలగుట,

— ఇదియే బానిసత్వము.

తుదకు హీనస్వరముతో వ్యర్థముగా మీరు ఫిర్యాదు చేసితిరా—
నిరంకుశునిమంద మీ మీదను, మీ భార్యలమీదను సవారిచేయుట,
మంచుకణములవలె రక్తము పచ్చగడ్డిపై పడి పారుట,

— ఇదియే బానిసత్వము.

బైరన్‌కూడ స్వేచ్ఛను ప్రశంస చేయుచు కవిత్వము చెప్పెను. కాని అది జాతీయ స్వాతంత్ర్యము. షెల్లీ కావ్యమందు వర్ణించిన ఆర్థిక స్వాతంత్ర్యముకాదు. టర్కీనుండి విడుదలయగుటకు గ్రీకులు పోరాడిన జాతీయ స్వాతంత్ర్య సమరమున నతడు మరణించెను. షెల్లీ మరణించిన మరి రెండేండ్ల కాతడు చనిపోయెను. మానవుడుగా బైరన్ నాకు నచ్చలేదు. కాని అతడనిన నా కభిమానము. నేను చదువుకొన్న హారో పాఠశాలలోను, ట్రినిటీ కాలేజీలోను అతడుకూడ చదివి యుండెను. కీట్సు, షెల్లీలవలెగాక పడుచుతనమందే అతనిని కీర్తివరించెను. లండన్ సంఘ మాతని అడుగులకు మడుగులొత్తినది. కాని తరువాత నతనిని విస్మరించినది.

ఈ కాలమున మరి ఇద్దరు ప్రసిద్ధకవులుండిరి. పై యువత్రయము కంటె నెక్కుడు కాలము వీరు జీవించిరి. 1771 మొదలు 1850 వరకు ఎనుబది సంవత్సరములు జీవించిన వర్డ్సు వర్తు ఉత్తమ ఆంగ్లకవులలో నొక్కడుగా పరిగణింపబడెను. ప్రకృతియన్న నాతనికి కడుప్రీతి. అతని కవిత్వమంతయు ప్రకృతి కవిత్వమే. రెండవకవి కూల్‌రిడ్జి. అతడు వ్రాసినకొలది కావ్యములు చక్కనివి.

పందొమ్మిదవ శతాబ్ది తొలిభాగమున ముగ్గురు ప్రసిద్ధ నవలా కారు లుండిరి. వారిలో పెద్దవాడు వాల్టర్‌స్కాట్. అతడు వ్రాసిన వేవర్లీనవలలు చాల ప్రసిద్ధి నందెను. నీవందు కొన్ని చదివియుందువు. నా బాల్యదశలో వానిని నేను మెచ్చుకొంటినని జ్ఞాపకము. అయితే వయస్సు పెరుగుటతో నభిరుచులు మారుచుండును. ఇప్పుడు నేను వానిని చదివిన నాకు తప్పక విసుగుపుట్టును. తేకరే,. డికెన్సు అనువారు మరిద్దరు నవలాకారులు. వారిద్దరును స్కాట్‌కన్న మిన్నలని నాయూహ. వారిద్దరు నీ స్నేహితులని భావింతును. తేకరే 1811 లో కలకత్తాలో పుట్టెను. 5, 6 సంవత్సరములచ్చటనే గడపెను. అతని పుస్తకములు కొన్నింటిలో ఇండియన్ నవాబుల యథార్థ వర్ణనముకలదు. ఇండియన్ నవాబులనగా—ఇండియాలో నివసించి, అమిత ధనము సంపాదించి, లావెక్కి మదించి, ఇంగ్లాండుకు తిరిగివెళ్లి భోగము లనుభవించు ఇంగ్లీషువారు.

19వ శతాబ్ది తొలిభాగమందున్న రచయితలగూర్చి నేను వ్రాయ వలచిన దింతే. విషయమా, పెద్దది; నేను వ్రాసినవృత్తాంతమా బహు స్వల్పము. అందు పరిశ్రమ చేసిన విద్వాంసుడు దీనినిగూర్చి మనోహర ముగా వ్రాయగలడు. ఆనాటి సంగీతమునుగూర్చియు, కళనుగూర్చియు కూడ విపులముగా వ్రాయును. ఇందుకై జ్ఞానము, చెప్పగల శక్తి ఉండ వలెను. అవి నా కందవు. కాన నేలనువిడిచి సాముచేయను.

గెటీ వ్రాసిన ఫాస్టునుండి కొన్ని పద్యము లుదహరించి ఈ జాబు

ముగింతును. ఇది జర్మన్ నుండి తర్జుమా *

అయ్యో, అయ్యో!
నీవు ప్రపంచమును కొట్టితివి,
భూమిపై పడగొట్టితివి,
అది భిన్నమైనది, కూలినది,
ఎక్కడికో విసరివేయబడినది
దైవాఘాతముచే చితుకకొట్టబడ

తునకలైన ప్రపంచమును,
మేము తీసికొనిపోదుము,
పోయిన మనోహరత్వమునుగూర్చి
పోయిన సౌందర్యమునుగూర్చి
మేము, అక్కటా! పాటలు పాడుదుము.

మరల నిర్మింపుము,
భూమి కడుపునపుట్టిన ఓ మహనీయుడా!
మరల నిర్మింపుము
అంతకన్న విశిష్టముగా
నీ హృదయములో ఉన్నతముగా నిర్మింపుము!
మరల నీ జీవితమును ప్రారంభింపుము:
మరల పందెము కట్టుము!
ఉచ్చైస్స్వరముతో స్వచ్ఛముగా
మనోహర తరమగు గీతము
అంతకన్న మిన్నగా ధ్వనించుగాక!

---

* తెలుగు తర్జుమా, ఇంగ్లీషు తర్జుమా నుండి.

## 130

# డార్విన్: శాస్త్రవిజయము

ఫిబ్రవరి 3, 1933

కపులనుండి శాస్త్రజ్ఞులకడకు పోదము. కపులు నిష్ప్రయోజకు లని నేటికిని జనులు భావించుచుందురని నా భయము. శాస్త్రజ్ఞు లన్ననో, నేటి ఇంద్రజాలికులు. వారికి పలుకుబడియు, గౌరవమును కలవు. 19వ శతాబ్దికి పూర్వమందిట్లు లేదు. వెనుకటి శతాబ్దులలో శాస్త్రజ్ఞులు యూరోపులో ప్రాణములు చేతబట్టుకొనియుండిరి. ఒక్కొక్కప్పుడు వారు దహనము చేయబడుచుండిరి. రోములో జొర్డానో బ్రూనోను చర్చి ఎట్లు దహనము చేసినదో నీకు చెప్పియున్నాను. కొన్ని సంవత్సరము లైన పిమ్మట, 17 వ శతాబ్దిని, సూర్యునిచుట్టును భూమి తిరుగుచున్న దని చెప్పుటచేత గలీలియో దహనము కావలసినదేగాని తప్పించుకొనెను. అతడు క్షమాపణ చెప్పుకొని, తాను చెప్పినమాట ఉపసంహరించుకొని, ఇట్లు మతద్రోహమునకైన దహన దండనమునుండి తప్పించుకొనెను. ఈ విధముగా యూరోపులోని చర్చి, శాస్త్రమున కడ్డుతగులుచు నూతన భావముల నణచివేయుటకు ప్రయత్నించుచుండెను. యూరోపునందును, ఇతర ప్రదేశములలోను కట్టుబాట్లతో బద్ధమైన మతమునకు హేతురహిత సిద్ధాంతము లనేకములుండును. సంశయము లేకుండ దాని అనుయాయులా సిద్ధాంతముల నంగీకరించినట్లు లెక్క. శాస్త్రదృక్పథము భిన్నము. హేతురహిత సిద్ధాంతము లది అంగీకరించదు. అట్టి సిద్ధాంతములు దాని కుండరాదు. అతార్కికాభిప్రాయము లందుండవు. ప్రయోగములు తరుచు చేయుచు నది సత్యము నన్వేషించి పొందును. ఇట్టి దృక్పథము, మత దృక్పథముకన్న వేరుకదా? అందువల్లనే శాస్త్ర, మతములకు రెంటికిని తరచు సంఘర్షనము కలుగుట.

అన్నియుగములందును భిన్నపురుషులచే అనేక ప్రయోగములు

చేయబడినట్లు నే నూహింతును. ప్రాచీన భారత దేశమున రసాయన శాస్త్రము, శస్త్రవిద్య అభివృద్ధి నందినట్లు చెప్పబడినది. ఎన్నో ప్రయోగములు చేసియుండినగాని ఇవి సాధ్యపడవు. ప్రాచీనగ్రీకులుకూడ కొంత వరకు ప్రయోగములు సాగించిరి. చీనాదేశస్థులనుగూర్చి, నేను, అద్భుతావహమగు వృత్తాంతమును ఈ మధ్య చదివి యుంటిని. 1500 సంవత్సరముల క్రితమున్న చీనా రచయితల గ్రంథములనుండి కొన్ని అంశములెత్తి వ్రాయబడినవి. వారికి పరిణామవాద సిద్ధాంతము తెలియుననియు, శరీరమున రక్త ప్రసరణమునుగురించి తెలియుననియు, చీనా శస్త్ర వైద్యులు శస్త్రము చేయునప్పుడు స్మృతి తప్పించు మందు లిచ్చెడివారనియు అందు వ్రాయబడి యున్నది. ఆ కాలము నాటి విషయములు మనకంతగా తెలియవు కాబట్టి ఇదమిత్థమని ఎట్టి నిర్ణయమును చేయలేము. ప్రాచీన నాగరికు లీ పద్ధతుల కనుగొనిరికదా? తరువాత వానినేల మరచిరి? అంతకన్న ముందుకు వారేల పోలేదు? లేదా ఇట్టి శాస్త్రాభివృద్ధికి వారు తగిన ప్రాముఖ్య మీయలేదా? అనేక ప్రశ్న లిట్టివి యుప్పతిల్లును. కాని వానికి సమాధానము చెప్పుటకు మనకు సామగ్రిలేదు.

ప్రయోగములు చేయుటయందు ప్రీతి కలవారు అరబ్బులు. మధ్యయుగములనాటియూరోపు వారి ననుసరించెను. కాని వారి ప్రయోగక్రమము యావత్తు సరియైన శాస్త్రమర్యాద ననుసరించి పోలేదు. వారు నిరంతరము "పరసువేదికై" ప్రయత్నించు చుండిరి. సామాన్య లోహములను, బంగారుగా మార్చగల శక్తి దానికున్నదట. లోహముల బంగారముగా మార్చు రహస్యమును కనుగొనుటకై రసాయన సంబంధమగు చిక్కు ప్రయోగముల చేయుచు వారు జీవితకాల మంతయు గడుపు చుండిరి. దీనినే రసవాద విద్య యందురు. అమరత్వమును ప్రసాదింపగల అమృతమును పొందుటకు శ్రద్ధతో వా రన్వేషించిరి. కట్టు కథలలో తప్ప వారు పరసువేదినిగాని, అమృతమునుగాని బడసినట్లు నిదర్శనములు లేవు. ధనమో, శక్తియో, దీర్ఘాయుర్దాయమో పొందు ఆశతో

ఒక విధమగు ఇంద్రజాలము నభ్యసించుటకు వారజ్ఞానవశమున చేసిన పనులే యివి. శాస్త్ర సంప్రదాయమునకిది సందర్భించదు. ఇంద్రజాలము తోను, మంత్రవిద్య మున్నగువానితోను శాస్త్రమునకు సంబంధములేదు.

నిజమగు శాస్త్రపద్ధతి యూరోపులో క్రమక్రమముగా వృద్ధి పొందినది. శాస్త్ర చరిత్రలో చెప్పుకోదగ్గ అనుత్తమ శాస్త్రజ్ఞులలో ఒకడు ఐజక్ న్యూటన్ అను ఇంగ్లీషువాడు. అతడు 1642 నుండి, 1727వరకు నుండెను. గురుత్వాకర్షణ సిద్ధాంతమును న్యూటన్ కనిపెట్టెను-అనగా వస్తువులు భూమిపై పడుటకు కారణము. దీనితోను, కనిపెట్టబడిన ఇతర సిద్ధాంతముల సహాయముతోను సూర్యగ్రహచారముల కారణము చెప్పగలిగెను. పెద్ద, చిన్న విషయములకు కారణము లీ సిద్ధాంతములు చూపుచున్నట్లుండెను. అతనిని ఘనముగ గౌరవించిరి.

శాస్త్రదృష్టి పెంపొందుచు చర్చియొక్క హేతురహిత సిద్ధాంత వృష్టిని త్రొక్కివేయుచుండెను. శాస్త్రము నణచివేయుటకుగాని, శాస్త్రజ్ఞులను దహించివేయుటకుగాని ఇకముందు వీలులేదు. ముఖ్యముగా ఇంగ్లాండు, ఫ్రాంసులలోను, తరువాత జర్మనీ, అమెరికాలలోను శాస్త్రజ్ఞులనేకులు ఓపికతో పనిచేసిరి. ప్రయోగములు చేసిరి. యదార్థవిషయముల గ్రహించిరి. విజ్ఞానమును పెంచిరి. శాస్త్రవిజ్ఞానము పెరుగజొచ్చెను. జ్ఞాపకమున్నదా—18 వ శతాబ్ది, యూరోపులో విద్యావంతులలో హేతువాదము వ్యాపించిన శతాబ్దియని. వాల్టేర్, రూసోల శతాబ్ది యిది. అనేక విధములగు విషయములపై వ్రాసి ప్రజల హృదయములలో ఉద్రేకము పుట్టించిన సమర్థులగు పెక్కు ఫ్రెంచి శాస్త్రజ్ఞుల శతాబ్దియిది. మహా ఫ్రెంచి విప్లవము నీ శతాబ్ది-గర్భమున ధరించి పెంచుచుండెను. హేతువాదమునకును, శాస్త్రదృక్పథమునకును సమన్వయము కుదిరినది. ఈ రెండును కలిసి చర్చియొక్క హేతురహిత దృక్పథమును ప్రతిఘటించినవి.

మిగిలిన విషయములతోపాటు 19 వ శతాబ్ది, శాస్త్ర శతాబ్దియని

చెప్పియుంటిని. పారిశ్రామిక విప్లవము, యాంత్రిక విప్లవము రవానాలో ఉపయోగించు ఆశ్చర్యకరమగు మార్పులు-ఇవియన్నియు విజ్ఞానశాస్త్రము వల్లనే కలిగినవి. రూపమునందిన పెక్కు ఫ్యాక్టరీలవల్ల ఉత్పత్తి పద్ధతులు మారినవి. రైల్వేలు, ఆవిరి నావలు వచ్చుటచే ప్రపంచము సంకుచితమైనది. ఎలెక్ట్రిక్ టెలిగ్రాపు వీసిని మించిన అద్భుతము. విశాలమగు సామ్రాజ్యమునుండి ఇంగ్లాండులోనికి ధనము వర్షించెను. ఇందువల్ల ప్రాతనమ్మకములు సడలిపోజొచ్చెను. మతముయొక్క పట్టు నానాటికి తగ్గెను. మతసిద్ధాంతములకన్న, ఆర్థిక సంబంధముల గూర్చి అధికముగా ప్రజలు ఆలోచించిరి. ఇందుకు ఫ్యాక్టరీ జీవనము కారణము. నేలపై పనిచేయు కర్షకుల జీవనముతో పోల్చి చూచుకొనుటచే నిట్లు వచ్చినది.

శతాబ్ది మధ్యభాగమున, 1859 లో ఇంగ్లాండులో ఒక గ్రంథము ప్రకటింపబడెను. మత శాస్త్రదృక్పథములకు సంఘర్షణ దానివల్ల కలిగినది. ఈ పుస్తకముపేరు "ఆరిజన్ ఆఫ్‌స్పీషీస్" (అంతర్జాతుల ఉత్పత్తి). దీనిని వ్రాసినది ఛార్లెస్ డార్విన్. డార్విన్ మరీ గొప్ప శాస్త్రజ్ఞులలో ఒకడు కాడు. అతడు చెప్పినదానిలో మరీ క్రొత్త విషయమేమియులేదు. భూగర్భ శాస్త్రజ్ఞులు, ప్రకృతి శాస్త్రజ్ఞులు డార్విన్‌కు ముందునుండియు పనిచేయుచుండిరి. గొప్ప సామగ్రిని కూడబెట్టియుంచిరి. అయినప్పటికిని డార్విన్ గ్రంథము శక ప్రారంభక ప్రసిద్ధిగన్నది. ప్రజల మనస్సులనది యాకర్షించినది. సాంఘిక దృక్పథమును మార్చుటకు తోడ్పడినది. మరియొక్క శాస్త్ర గ్రంథ మెద్దియు ఇట్టిపని చేయలేకపోయెను. దానివల్ల ప్రజల మనస్సులలో భూకంపము కలిగెను. డార్విన్ ప్రసిద్ధుడాయెను.

ప్రకృతి శాస్త్రజ్ఞుడగు డార్విన్ దక్షిణ అమెరికాలోను, పసిఫిక్ ప్రాంతమందును తిరిగెను. అమితమగు వస్తువులను సంగ్రహించెను. తన సిద్ధాంతమున కనుకూలమగు ప్రమాణ విషయములను గ్రహించెను. ఈ సామగ్రి సహాయముతో నతడు, జంతువులలో ప్రతి అంతర్జాతీయ

సర్గికవరణము (Natural Selection) వల్లనే మారి వృద్ధి నందుచున్న దని నిరూపించెను. మనుష్యునితోసహా ప్రతి అంతర్జాతి జంతువును భగవంతునిచే ప్రత్యేకముగా సృజింపబడెననియు, నాటినుండి ప్రత్యేకముగా నున్నవనియు—అనగా ఒక అంతర్జాతి, వేరొక అంతర్జాతి కాజాలదనియు—ఆనాడు పలువురు తలచుచుండిరి. ప్రత్యక్ష ప్రమాణము లనేకము చూపి, అంతర్జాతులు ఒకదానినుండి ఇంకొకదానికి మారుచున్న వనియు, ఇదియే సామాన్యముగా జరుగు అభివృద్ధి క్రమమనియు దార్విన్ నిరూపించెను. ఈ మార్పులకు కారణము సర్గికవరణము. ఒక అంతర్జాతిలో భిన్న భిన్నలక్షణము, అది దానికి లాభకరముగా నున్నచో, లేదా యితర జీవులకన్న నెక్కువకాలము బ్రదికియుండగలుగుటకది తోడ్పడినచో—ఈ భిన్నలక్షణము క్రమ క్రమముగా శాశ్వతమగును. భేదించిన ఇట్టి అంతర్జాతి చిరకాలము జీవించుట సంభవము. కొంత కాలమైనపిమ్మట భేదించిన ఈ అంతర్జాతి బహు సంఖ్యాకమై మిగలిన వానిని తుడిచిపెట్టివేయును. ఈ విధముగా మార్పులు, భేదములు ఒక దాని తర్వాత నొకటి ప్రవేశించి కొంతకాలమునకు క్రొత్త అంతర్జాతు లనేకము పుట్టును. సర్గిక వరణమువల్లను, బలవంతులే బ్రదికియుండుట వల్లను ఈ కార్యము జరుగును. ఇది జంతువులకు, వృక్షములకేకాదు మనుష్యనకుకూడ సమన్వయించును. ఈ సిద్ధాంతమునుబట్టి నేడు మనకు కనిపించు వృక్షజంతు అంతర్జాతులకు ఒకే మూల పురుషుడుండుట సంభవించ వచ్చును.

కొలది సంవత్సరములైన పిమ్మట దార్విన్ మరియొక గ్రంథమును ప్రకటించెను. దానిపేరు "ది డిసెంట్ ఆఫ్ మాన్" (మానవుని అవతరణము). ఇందు తన సిద్ధాంతము నతడు మానవునకు ప్రవర్తింప చేసెను. పరిణామ సిద్ధాంతమును, సర్గికవరణమును నేడు పలువు రంగీకరించుచున్నారు. సరిగా డార్వినను, అతని అనుయాయులును చెప్పినట్లు కాకున్నను, ప్రశస్తమగు జంతువులను దాటించి మంచి జంతువు

లను పుట్టించుటకును, మంచి మొక్కలు పండ్లు, పూవులు కలిగించు టకును సర్గికవరణ సూత్రమును నేడు మానవుడు తరుచుగా అవలం బించుచున్నాడు. నేడు బహుమతులు పొందిన పెక్కు జంతువులు, చెట్లు క్రొత్త అంతర్జాతులే. ఇవి అసహజముగ సృష్టింపబడినవి. కొద్ది కాలము లోనే మానవు డిట్టి మార్పులను చేయగలిగిన, క్రొత్త అంతర్జాతుల పుట్టించగలిగిన-కోట్ల కొలది సంవత్సరములలో ప్రకృతి చేయలేని దేమున్నది? లండనులోనున్న దక్షిణ కెంసింగ్‌టన్ నేచురల్ హిస్టరీ మ్యూజియం దర్శించినచో వృక్షములును, జంతువులును ప్రకృతి కను గుణముగ నెట్లు నిరంతరము మారుచున్నవో విశదమగును.

ఇప్పుడు మనకీ విషయమంతయు నిర్వివాద విషయముగా కని పించును. 70 సంవత్సరములకు పూర్వమిట్లుకాదు. నాడు యూరోపులో పలువురు ప్రపంచసృష్టినిగురించి బైబిలు చెప్పిన వృత్తాంతమునే విశ్వ సించియుండిరి. క్రీస్తుకు 4004 సంవత్సరములకు పూర్వము సృష్టి జరిగిన దనియు, ప్రతివృక్షమును, జంతువును ప్రత్యేకముగా సృష్టింపబడిన వనియు, చివరకు మానవుడు సృష్టింపబడెననియు అందలి వృత్తాంతము. జలప్రళయము వచ్చినట్లును, అప్పుడు ఏ అంతర్జాతియు అంతరించకుండు టకై "నోవా" నావలో జంతువులు జంటలుగా ఉంచబడినట్లును వారు నమ్ముదురు. డార్విన్ సిద్ధాంతములో నిట్టివిషయము లిముడవు. డార్వినుం, భూగర్భ శాస్త్రజ్ఞులునూ భూగోళముయొక్కవయస్సు కోట్ల సంవత్సరము లలో చెప్పుదురు. స్వల్పమగు 6000 సంవత్సరము లనరు. కాన స్త్రీ. పురుషుల మనస్సులలో బ్రహ్మాండమగు అలజడి పుట్టెను. పాపము. వారికేమి చేయుటకును తోచలేదు. ఒకదానిని నమ్మమని వారి ప్రాత విశ్వాసము ప్రబోధించుచున్నది. వారి హేతువు అన్యథా బోధించుచున్నది. హేతు రహితమత సిద్ధాంతములయందు ప్రజలు విశ్వాస ముంచినపుడు, ఆ సిద్ధాంతములకు దెబ్బతగిలినచో వారు నిర్విణ్ణులగుదురు. అసహాయ స్థితియం దుందురు. నిలబడుటకు వారికి స్థిర ప్రదేశముండదు. అయితే

యదార్థమును దర్శింపజేయు దెబ్బకూడ లాభకరమైనదే.

ఇంగ్లాండులోను, యూరోపులో ఇతర భాగములందును శాస్త్రమునకును, మతమునకును వాదములు పెద్దగా ప్రబలినవి. సంఘర్షణము సంభవించెను. ఫలిత మెట్టిది కలిగెనో సంశయింప పనిలేదు. పరిశ్రమలతో, యాంత్రిక రవానాతో నిండిన నూతన ప్రపంచము శాస్త్రముపై ఆధారపడియుండెను. కాని శాస్త్రమును కాదనరాదు. అంతటను శాస్త్రమునకే విజయము ఎదుర్కొనుచుండెను. "సర్గికవరణము", "బలవంతులకే బ్రతుకు" అను పదములు సామాన్య జనుల ప్రతిదిన సంభాషణ లందు వచ్చుచుండెను. ఆ మాటల కర్థము పూర్తిగా వారికి తెలియదు. డార్విన్ తన "మానవుని అవతరణము" అను గ్రంథములో, మానవునకును, తోకలేని ఒకజాతి కోతికిని మూలపురుషు డొక్కడే యుండవచ్చునని సూచించెను. పరిణామ మార్గమున వేర్వేరు అవస్థలను ప్రదర్శించి, దృష్టాంతములు చూపుటకు సాధ్యపడలేదు. దీని నుండియే ప్రజలయందు "మిస్సింగ్ లింక్" (లోపించిన కొక్కెము) * అనే పరిహాసవాక్యము బయలు వెడలినది. వింతయేమనగా: పాలకవర్గము డార్విన్ సిద్ధాంతమునకు, తమ కనుకూలముగా వక్రార్థమునుచెప్పి, వారి ఘనతకు వేరొక నిదర్శన మీ సిద్ధాంతమిచ్చినదని దృఢముగా నమ్మియుండిరి. జీవితసమరమున చివరవరకు నిలుచుటకు తామే బలవంతులు గాన అర్హులని నమ్మిరి. సార్గికవరణము కారణముగా వారు ప్రథమశ్రేణికివచ్చి, పాలకవర్గముగా నుండిరట. ఒక తెగవారు, వేరొక తెగపై అధికారము చెలాయించుట

---

* ఇప్పుడు మనము మానవులను, తోకలేని కోతులను, చూచుచున్నాము. ఈ యిద్దరిని కలుపు కొక్కెమువంటి మూలపురుషుడు కాని, తత్సమీప వస్తులు కాని కనబడుటలేదు. లోపించిన కొక్కెముకై ఇంకను శాస్త్రజ్ఞులు వెదుకు చున్నారు. ఈ లోపించిన కొక్కెములో మానవ, వానర లక్షణములు రెండును ఉండును గనుక వికృతరూపము గలవారిని, లోపించిన కొక్కెములని పరిహాసము చేయుదురు.

కును, ఒకజాతి వేరొకజాతిని పాలించుటకును ఇది సాకుగా కల్పింప బడినది. సామ్రాజ్య తత్వమునకీ సిద్ధాంత మండయైనది. తెల్లజాతుల ఆధిక్యమునకును ఇది అండయైనది. అహంకారముతో, అధికారము చెలాయించి ఎంత క్రూరముగా సంచరించిన అంత గొప్పగా మానవ శ్రేణిలో వారికి ఔన్నత్యము చిక్కునని పడమటి దేశములలో పలువురు తలచిరి. ఇది ఇంపైన ధర్మ ప్రవచన మనిపించుకొనదు. కాని ఆసియా, ఆఫ్రికా ఖండములలోని సామ్రాజ్యతత్వవాదులగు పడమటి దేశస్థుల ప్రవర్తనకు కొంతవరకు కారణమది చూపించును.

ఇతర శాస్త్రజ్ఞులచే, తరువాత డార్విన్ సిద్ధాంతములు విమర్శింప బడినవి. కాని అతని సామాన్యసూత్రములింకను నిలిచియున్నవి. అతని సిద్ధాంతముల నంగీకరించుటచే కలుగు ఫలితములలో నొకటి—లోక మభివృద్ధి చెందుచున్నదని ప్రజలు విశ్వసింతురు. అనగా మానవుడును, సంఘమును, ప్రపంచ మంతయును నాడు నాటికి వృద్ధి చెందుచున్న వనియు, దోషరహితమగు సంపూర్ణ స్థితినంద పురోగమించుచున్న వనియు విశ్వసింతురు. డార్విన్ సిద్ధాంతమువల్లనే అభివృద్ధి చెందుట యను భావము పుట్టినదని తలంపరాదు. క్రొత్త విషయములను కనిపెట్టు చున్న శాస్త్రధోరణియు, పారిశ్రామిక విప్లవకాలమందును తదనంతరము నను సంభవించిన మార్పులును ప్రజలమనస్సులకు దోహదప్రాయముగా నుండెను. డార్విన్ సిద్ధాంతము దానిని బలపరచెను. ఒక విజయము తరువాత వేరొక విజయమును సాధించుచు మానవ పరిపూర్ణత్వమను గమ్యస్థానమును (అది ఏమైనను) అందుకొనుటకు తాము పోవుచున్నట్లు ప్రజ లూహింప దొడగిరి. ఇట్టి యభివృద్ధిభావము సరిక్రొత్తయైనది. భూతకాలమున యూరోపులోగాని, ఆసియాలోగాని ప్రాచీన నాగరికతలు వెలిసిన దేశములలోగాని ఇట్టి భావన ఉన్నట్లు తోచదు. యూరోపులో, పారిశ్రామిక విప్లవ కాలమువరకును గతకాల ముత్తమ కాలమని భావించుచుండిరి. గ్రీసు, రోము దేశములలో విలసిల్లిన ప్రాచీన వైభవ

కాలము, తరువాతవచ్చిన కాలముకంటె చక్కనిదనియు, వృద్ధిచెంది యుండెననియు, సంస్కృతి క్షాయిష్టమనియు భావింపబడుచుండెను. నానాటికి జాతి చెడుచున్నదనియు, చెప్పుకొనదగిన మార్పేమియు రాలేదనియు ప్రజలు తలచుచుండిరి.

గతించిన సత్యయుగాంతమునుండి ప్రపంచము క్షీణించుచున్నదని ఇండియాలో ఇట్టి అభిప్రాయమేకద్దు. భారతదేశ పురాణములు కాలమును, భూగర్భ శాస్త్రజ్ఞులవలెనే బ్రహ్మాండమగు సంఖ్యలతో కొలుచుచున్నవి. కాలము సత్యయుగముతో ప్రారంభమయి నేటి అధర్మ విలయమగు కలికాలము వరకు వచ్చును.

మానవాభివృద్ధియను భావన నేటికాలపు భావనయని చూచితిమి. ఉన్నంతలో గత చరిత్ర జ్ఞానము ఇట్టి భావమును విశ్వసింపజేయు చున్నది. కాని మనజ్ఞానమింకను చాల సంకుచితమైనది. సంపూర్ణజ్ఞానము మనకు కలిగినప్పుడు మనదృక్పథము మారవచ్చును. ఈ అభివృద్ధిని గూర్చి 19వ శతాబ్ది రెండవభాగ కాలమున నున్నంత ఉత్సాహము నేడు సైతము లేదు. గత ప్రపంచయుద్ధములో జరిగినట్లుగా ఒకరినొకరు బ్రహ్మాండముగా నాశనము చేసికొనుట కీయభివృద్ధి దారితీసినయెడల— ఇట్టి అభివృద్ధిలో ఏదో దోషముండి తీరవలెను. ఇంకొక విషయము గమనించదగియున్నది. "అన్నివిధముల తగినవారే జీవించియుందు" రను డార్విన్ సూత్రార్థము "అన్నివిధములనుంచి వారే జీవించుయుందు" రని చెప్ప వీలులేదు. ఇవియన్నియు విద్యావంతు లాలోచింపదగిన యూహలు. సంఘము మారదనియు, క్షీణించుననియు విరివిగా ప్రాచీన కాలమున నమ్ముచుండిరి. ఈ యభిప్రాయమును 19వ శతాబ్దినాటి శాస్త్రము త్రోసిపుచ్చినది. దాని స్థానమున సంఘము మారు స్వభావము కలది, శక్తివంతమైనది అను అభిప్రాయము వచ్చెను. అంతేకాదు. అభివృద్ధియను భావముకూడా వచ్చెను. నిజమున కీ కాలమున పోల్చుకో లేనంతగా సంఘము మారెను.

అంతర్జాతుల యుత్పత్తిని గూర్చి డార్విన్ చేసిన సిద్ధాంతమును చెప్పు సందర్భమున, 2500 సంవత్సరములకు పూర్వము ఈ విషయమై ఒక చీనా ధర్మశాస్త్రవేత్త ఏమివ్రాసెనో తెలిసికొనుట ముచ్చటగా నుండును. అతనిపేరు చోంచే. అతడు క్రీస్తు పుట్టుటకు పూర్వము 6 వ శతాబ్దిని, అనగా సుమారు బుద్ధుని కాలమున ఇట్లు వ్రాసెను—

"ఒకే అంతర్జాతినుండి జీవులన్నియు ఉత్పత్తియైనవి. ఈ ఒక్క అంతర్జాతియు క్రమక్రమముగా, నిరంతరముగా అనేక మార్పులనుచెంది భిన్న స్వరూపములుగల జీవులుగా మారెను. ఇట్టి జీవులు ఒక్కమారుగా భిన్న రూపములను పొందలేదు సరిగదా తరముల తరువాత తరములు గడచుచుండగా ఇట్టి భిన్న లక్షణముల నవి పొందెను.

డార్విన్ సిద్ధాంతమునకిది సమీపముగానున్నది. చీనా జీవశాస్త్రజ్ఞులు ఈ విషయమును కనిపెట్టుట మిక్కిలి ఆశ్చర్యకరము. ఈ సత్యమును మరల కనుగొనుటకు లోకమునకు 2500 సంవత్సరములు పట్టినది.

19 వ శతాబ్ది గడచినకొలది మార్పులు త్వరితగతి వచ్చుచుండెను. అద్భుతములమీద అద్భుతములను శాస్త్రము ప్రదర్శించెను. క్రొత్త వస్తువులను కనుగొనుట, క్రొత్త నిర్మాణములుచేయుట అంతములేకుండ జరుగుచుండెను. ప్రజలు దిగ్భ్రాంతులగుచుండిరి. టెలిగ్రాఫు, టెలిఫోను, మోటారుకారు, విమానము మున్నగునవి పెక్కులు ప్రజల జీవితములలో గొప్ప మార్పును తెచ్చిపెట్టెను. సుదూరస్థ ఖగోళముల ప్రమాణముల తెలిసికొనుటకును, అదృశ్యమగు అణువులను, ఇంకను చిన్నవగు వాని అంతర్భాగములను తెలిసికొనుటకును మానవుడు సాహసించెను. ఇందుచే మానవునిభారక్లేశము తగ్గెను. కోట్లాది ప్రజలకు జీవితము సుఖాస్పదమయ్యెను. శాస్త్రము కారణముగా ప్రపంచమందలి జనసంఖ్య అమితముగా పెరిగెను. ముఖ్యముగా పారిశ్రామిక దేశములలో నిది తటస్థించెను. వీనితోపాటు శాస్త్రము మిక్కిలి సమగ్రమగు మారణ

సాధనములను తెచ్చిపెట్టెను. కాని, ఇది శాస్త్రముయొక్క తప్పుకాదు. శాస్త్రసహాయముతో మానవుడు అధికముగా ప్రకృతిని తనవశము చేసికొనెను. కాని, తానెంత శక్తివంతుడైనను తన్ను తన వశములోనుంచుకొనుట కతనికి తెలియుటలేదు. కాన మానవుడు తరుచు దుర్మార్గముగా ప్రవర్తించి శాస్త్రమిచ్చిన ఫలములను దుర్వ్యయముచేసెను. కాని విజయవంతముగా శాస్త్రము ముందుకు పోవుచునేయుండెను. గడచిన వేలకొలది సంవత్సరములలో జరుగని మార్పు 150 సంవత్సరములలో ప్రపంచమున జరిగెను. ఏదిక్కుచూచినను, మానవుని ఏ జీవిత పథము చూచినను శాస్త్రము ప్రపంచమును పూర్తిగా మార్చివేసినదని తెలిసికొందుము.

నేడుకూడ శాస్త్రగతి సాగుచునేయున్నది. అది పరుగులు తీయుచున్నట్లున్నది. దానికి విశ్రాంతిలేదు. ఒక రైల్వేను కట్టిరనుకొందుము. పనిచేయ ప్రారంభించుసరికి అది ప్రాతబడును. క్రొత్త నమోనావచ్చును. ఒక యంత్రమును కొని దానిని అమర్చిరను కొందము. ఒకటి రెండు సంవత్సరములలో అట్టి రకములే, అంతకన్నా బాగుగా పనిచేయు మంచి యంత్రములు సృష్టింపబడును. ఈ విధముగా ఈ ఉన్మత్త గతి పోవుచుండును. మనకాలములో నీటియావిరి స్థానమును విద్యుచ్ఛక్తి ఆక్రమించుచుండుటచే 150 సంవత్సరములకు పూర్వము సంభవించిన పారిశ్రామిక విప్లవమువంటి గొప్ప విప్లవము దీనివల్ల వచ్చుచున్నది.

శాస్త్రముయొక్క శాఖలన్నింటియందును శాస్త్రజ్ఞులు, ప్రవీణులు ఎందరో నిరంతరము పనిచేయుచున్నారు. వారిలో నేడు శ్రేష్ఠుడైయున్నవాడు ఆల్బర్ట్ ఐన్‌స్టీన్. ఇతడు న్యూటన్ కనుగొనిన ప్రసిద్ధ సిద్ధాంతమును కొంత సవరించెను.

శాస్త్రమందు నేటి కాలమున కలిగిన గొప్ప యభివృద్ధిని, శాస్త్రసిద్ధాంతములందు చేసిన అనేక సవరణలను, చేర్చిన అనేక నూత్న విషయములను చూచి శాస్త్రజ్ఞులే ఆశ్చర్య చకితులగుచున్నారు. వెనుకటి

సంతృప్తి, గర్వము వారినుండి తొలగిపోవుచున్నవి. వారి సిద్ధాంతము లను రూఢిగా చెప్పుటకు సంశయించుచున్నారు. భవిష్యద్విషయముల గూర్చి చెప్పుటకు వెనుదీయుచున్నారు.

ఇది 20 వ శతాబ్దిలో మనకాలములో వచ్చిన మనః ప్రవృత్తి. 19వ శతాబ్దిలో శాస్త్రజ్ఞులు పూర్తి విశ్వాసముతో నుండిరి. అసంఖ్యాకమగు విజయముల చూచినారు. గర్వించుచుండిరి. ప్రజలను వంచించుచుండిరి. ప్రజలీ శాస్త్రమునకు, దేవునకువలె తలలు వంచుచుండిరి.

# 131

# ప్రజాస్వామికముయొక్క పురోగమనము

ఫిబ్రవరి 10, 1933

వెనుకటి జాబులో, 19 వ శతాబ్దిలో విజ్ఞాన శాస్త్రాభివృద్ధినిగూర్చి ఇంచుక నీకు చెప్పుటకు యత్నించితిని. ఈ శతాబ్దిలో ప్రజాస్వామిక భావ మెట్లభివృద్ధి జెందినదియు తెలిసికొందము.

18 వ శతాబ్దిని ఫ్రాంసులో భావ సంఘర్షణనుగూర్చి నీకు చెప్పి యుంటిని జ్ఞాపకమున్నదా ? ఆనాడు గొప్ప రచయిత అనియు, తత్వ శాస్త్రజ్ఞుడనియు పేరుగాంచిన వాల్టేరును గురించియు, మత సంఘములకు సంబంధించిన ప్రాతభావముల ననేకము ధిక్కరించి సాహసముతో క్రొత్త సిద్ధాంతములను లేవనెత్తిను ఫ్రాంసులోని ఇతర ప్రముఖుల గురించియు నీకు చెప్పియుంటిని. ఆ కాలమున నట్టి రాజకీయాభిప్రాయ ములు ఫ్రాంసులో మాత్రమే ప్రత్యేకముగా నుండెను. జర్మనీలో తత్వ శాస్త్రజ్ఞులుండిరి. కాని ఆ శాస్త్రమునకు సంబంధించిన దుర్భాహ్యా విషయములనేవారు చర్చించుచుండిరి. ఇంగ్లాండులో వర్తకవ్యాపారములు వృద్ధిలోనుండెను. పరిస్థితులు ప్రోత్సహించిన తప్ప తత్వశాస్త్రమన్న పలువుర కిష్టములేకుండెను. 18 వ శతాబ్ది రెండవ భాగమున, చెప్పుకో దగిన గ్రంథమొకటిమాత్రము ఇంగ్లాండులో వెలువడెను. దీనిపేరు

'వెల్తు ఆఫ్ నేషన్స్' (జాతుల భాగ్యము). దాని కర్త ఆడమ్ స్మిత్. అది రాజకీయ శాస్త్రమని చెప్ప వీలులేదు. అది రాజకీయ అర్థశాస్త్రము (1) నకు సంబంధించిన గ్రంథము. ఈ శాస్త్రము ఆనాటి యితర శాస్త్రములవలెనే మతముతోను, నీతి శాస్త్రము (2) తోను కలిసియుండుటచే గందరగోళముగా నుండెను. ఆడమ్ స్మిత్ శాస్త్రమర్యాదననుసరించి ఈ శాస్త్రమును వ్రాసెను. నీతిశాస్త్ర విషయముల నిందు మిళితము చేయలేదు. అర్థశాస్త్ర విషయములకు సమన్వయించు సహజ సూత్రముల నాతడు కనుగొనుటకు ప్రయత్నించెను. అర్థశాస్త్రమన నేమో నీకు తెలిసియుండవచ్చును. ప్రజలయొక్కగాని, దేశము మొత్తముయొక్కగాని ఆదాయవ్యయముల నడుపుకొను విధములను గూర్చియు, వారు ఉత్పత్తి చేయునట్టియు, వ్యయము చేయునట్టియు, పదార్థముల గూర్చియు, వారి అన్యోన్య సంబంధముల గూర్చియు, ఇతరదేశములతోగాని, జాతులతోగాని వారి సంబంధమునుగూర్చియు అది చెప్పును. ఆడమ్ స్మిత్ నమ్మకమేమనగా—క్లిష్టమగు ఈ కార్యములన్నియు నిర్దిష్ట సహజ సూత్రముల ననుసరించి జరుగుచున్నవని. ఆ సూత్రముల నతడు తన గ్రంథమున నిరూపించెను. పరిశ్రమాభివృద్ధికి సంపూర్ణ స్వాతంత్ర్య ముండవలెననియు నతడు విశ్వసించెను. ఇట్లున్నయెడల సహజ సూత్రములు సరళముగా నడచును. యథేష్ట ప్రవర్తక సిద్ధాంతమునకిది ప్రారంభము. దీనినిగూర్చి కొంత ఇదివరలో చెప్పియుంటిని. అప్పుడు ఫ్రాంసులో మొలకలెత్తుచున్న నూతన ప్రజాస్వామిక భావములతో నీ గ్రంథమునకు ప్రసక్తి లేదు. ప్రజలయొక్కయు, జాతులయొక్కయు యోగక్షేమములకు సంబంధించిన ప్రముఖసమస్యలలో నొక్కసమస్యనుగూర్చి శాస్త్రమర్యాద ననుసరించి వ్రాయుట చూడ ప్రజలు నూతన మార్గముల త్రొక్కుచున్నారని స్పష్టమగును. అంతకుముందు ప్రాత మత దృక్పథముతోనే సమస్త విషయములను విచారించుచుండిరి. దానికి భిన్నముగా ఇప్పుడు

(1) Political Economy (2) Ethics.

జరిగినది. రాజకీయార్థశాస్త్రపితయను పేరు ఆడమ్ స్మిత్‌కు వచ్చినది. 19 వ శతాబ్దిలో అనేక ఇంగ్లీషు ఆర్థశాస్త్రజ్ఞుల కాతడు ప్రేరకుడయ్యెను.

నూతన శాస్త్రమగు అర్థశాస్త్రము ఆచార్యులకును, బాగుగా చదువు కొన్న కొద్దిమందికిని మాత్రమే తెలిసియుండెను. ఇదియిట్లుండ ప్రజా స్వామిక నూత్నభావములు వ్యాప్తి నందుచుండెను. అమెరికన్, ఫ్రెంచి విప్లవములు కారణముగా వానికి ప్రసిద్ధియు, ప్రచారమును జరిగెను. అమెరికనుల స్వాతంత్ర్య ప్రకటనము నందలి, ఫ్రెంచివారి స్వత్వ ప్రకటనము నందలి మనోహరమగు చక్కని పదములు, సమాసములు ప్రజల హృదయములందు గాఢ సంచలనము కలిగించెను. పీడితులై పదార్థమునకై పాటుపడు లక్షలాది జనుల కామాటలు ఉత్సాహ జనకములై యుండెను. విమోచన సందేశములుగా నుండెను. రెండు ప్రకటనలును—స్వేచ్ఛ, సమత్వము, సుఖముపొందుటకు ప్రతివానికిని ఉన్న హక్కు-అను విషయములనుగూర్చి ప్రసంగించెను. అమూల్యమగు నిట్టి హక్కులను సగర్వముతో ప్రకటించుటచే ప్రజలకా హక్కులు హస్త గతము కాలేదు. ఈ ప్రకటనలు చేసి 150 సంవత్సరములు కడచినవి. నేడైనను ఆ హక్కులను స్వల్పసంఖ్యాకులు సైతమనుభవించుచున్నట్లు లేదు. కాని మానవస్వత్వములకు సంబంధించిన ఈ ప్రకటనలు అసామాన్యములు, ప్రాణదాయకములు.

యూరోపులోను, ఇతర ప్రదేశములందును, క్రైస్తవ మందును, ఇతర మతములందును-పాపము, దైన్యము మానవులందరును తప్పని సరిగా అనుభవించవలసియుండుననుప్రాతభావ మొకటి యుండెను. లోకమందలి దారిద్ర్య, దైన్యములకు శాశ్వత గౌరవస్థానములు మత మిచ్చినట్లు తోచుచున్నది. మతముచేయు వాగ్దానములు, చూపు పారి తోషికములు అన్నియు ఏదో పరలోకములో పొందదగినవే. ఈలోకమున మనము, మన కష్టములను సహనముతో ననుభవింపవలెననియు, మూల ముట్టు మార్పుల నేవియు కోరరాదనియు అది మనకుచేయు ఉపదేశము.

దానము, అనగా బీదవారికి కొన్ని అన్నపుమెతుకులు విదుపుట, ప్రోత్స హింపబడెనేకాని, దారిద్ర్యమును నాశనము చేయవలెనను ఉద్దేశము కాని, దారిద్ర్యమునకు కారణమైన సంఘసరణి మార్చవలెనను ఉద్దేశము కాని లేదు. చర్చియొక్కయు, సంఘముయొక్కయు అధికార తత్వ వృక్పథము, స్వేచ్ఛాసమత్వభావములను సహించకుండెను.

మానవు లందరును సమానులేయని ప్రజాస్వామికము చెప్పలేదు. అది అట్లు చెప్పనేరదు. ఎందువల్లననగా-భిన్నమానవులలో భిన్నలక్షణ ములు గోచరమగుట స్పష్టము. భిన్న శారీరక లక్షణములుండుటవల్ల కొందరు మిగత వారికన్న బలాఢ్యులున్నారు. భిన్న మానసికలక్షణము లుండుటవల్ల కొందరు మిగతవారికన్న సమర్థులు, మేధావులు ఉన్నారు. భిన్ననైతిక లక్షణములుండుటవల్ల కొందరు పరార్థ ప్రాపకులును, మరి కొందరు స్వార్థపరులును. ఇట్టి భిన్నలక్షణము లనేకమునకు బహుశా వేర్వేరు పెంపకములు, వేర్వేరు చదువులు, లేదా విద్యాలోపము కారణమై యుండవచ్చును. సమాన సామర్థ్యముకల ఇద్దరు బాలికలనుగాని, బాలురను గాని తీసికొని ఒకరికి సద్విద్య నేర్పి రెండవవారికి విద్య నేర్పకున్నచో— కొన్ని సంవత్సరములైన పిమ్మట ఇద్దరిలో ఎంతో తేడా కానవచ్చును. లేదా ఒకరికి ఆరోగ్యకరమైన ఆహారమిచ్చి రెండవవారికి చాలీచాలని చెడ్డ ఆహారమును పెట్టినచో మొదటివారు సరిగా పెరుగుదురు. రెండవవారు దుర్బలులై, రోగగ్రస్తులై, పెరుగుదల లేకయుందురు. కాన పెంపకము, పరిసరములు, శిక్షణ, విద్య—వీనివల్ల పరిస్థితులు మారును. ఒకేవిధ మగు శిక్షణమును, అవకాశములను అందరికిని ఇయ్యగలిగినచో ఇప్పు డున్న తేడాలు వారి వారిలో కనిపించవని తోచును. బహుశా అట్లు జరుగ వచ్చును. కాని ప్రజాస్వామికము మానవులందరు సమానులు కారని ఒప్పుకొన్నది. అయినను ప్రతి ఒకరిని రాజకీయముగా, సాంఘికముగా, సమాన విలువకలవారినిగా చూడవలెనని అది చెప్పినది. ఈ ప్రజా స్వామిక సూత్రమును సంపూర్ణముగా మన మంగీకరించినచో విప్లవాత్మక

మగు పర్యవసానములలోనికి మనము దిగవలసి వచ్చును. ఇప్పుడు మన మీ విషయముల చర్చించనక్కరలేదు. ఈ సూత్రము నంగీకరించిన పక్షమున పరిపాలనా సభకు, లేదా పార్లమెంటుకు ప్రతినిధి నెన్నుకొనుటకు ప్రతివానికిని "వోటు" ఉండవలెను. రాజకీయాధికార చిహ్నమే వోటు. ప్రతివానికిని వోటున్నయెడల, అట్టివానికి రాజకీయాధికారమున సమానభాగము ఉండునని ఎంచబడినది. కాబట్టి 19 వ శతాబ్దిలో ప్రజాస్వామికము ప్రధానముగా వాంఛించిన విషయము ఎన్నిక హక్కును విరివి చేయవలసినదనియే. యువజనులకు, అనగా వయస్సు వచ్చిన వారందరికి ఎన్నిక హక్కు ఉండవలెను. చాలకాలమువరకు స్త్రీలను వోటు చేయనిచ్చెడివారుకారు. ముఖ్యముగా బ్రిటన్‌లో, ఈ మధ్యకాలములో స్త్రీలీ హక్కుకై తీవ్రముగా ఆందోళనచేసిరి. అభివృద్ధిచెందిన దేశములనేకములో నేడు పురుషులకును, స్త్రీలకునుకూడ యువజన ఎన్నికహక్కు కలదు.

కాని, చిత్రమేమనగా, పలువురకీ ఎన్నికహక్కు సంక్రమించిన పిమ్మట, దానివల్ల ఎట్టి ప్రయోజనమును సిద్ధించలేదని వారు కనుగొనిరి. వోటు చేయు హక్కు ఉన్నప్పటికిని దేశమున వారికి అధికారము చిక్కలేదు. ఒకవేళ చిక్కిన అది బహు స్వల్పము. ఆకలిగొన్నవానికి వోటువల్ల ప్రయోజనమేమియు లేదు. తమ లాభముకొరకు ఆకలిగా ఉన్నారుగదా అని అట్టివారిచే తమ కిష్టమువచ్చిన పనులను చేయించుకొనుచు నుండువారే నిజమగు అధికారము కలవారు. ఇట్లు వోటు ప్రసాదించునన్న రాజకీయాధికారము హుళక్కి అని తేలినది. ఆర్థికాధికారముకూడ లేకపోయినది. వోటు ననుసరించి సమత్వము వెంట వచ్చునను ప్రజాస్వామికవాదుల తొలి స్వప్నములు నిరర్థకములయ్యెను.

అయితే ఇది తరువాత కాలమున గ్రహింపబడిన విషయము. తొలిరోజులలో—18 వ శతాబ్ది అంతము, 19 వ శతాబ్ది ప్రారంభము—ప్రజాస్వామిక వాదుల ఉత్సాహము మిన్నుముట్టుచుండెను. ప్రజాస్వామి

కము వల్ల ప్రతి పౌరునకు స్వేచ్ఛసమత్వములు చేజిక్కుననియు, ప్రజల క్షేమముకొరకే ప్రభుత్వము పాటుపడుననియు భావించిరి. 18 వ శతాబ్దిలో పాలించిన రాజులయొక్కయు, ప్రభుత్వములయొక్కయు, నిరంకుశత్వమును, తమ సంపూర్ణాధికారమును వారు దుర్వ్యయము చేసిన పద్ధతిని ప్రజలు గర్హించిరి. అందుచే తమ ప్రకటనలలో ప్రజలు వ్యక్తుల స్వత్వములను వెల్లడి చేసికొనవలసి వచ్చినది. బహుశా అమెరికన్, ఫ్రెంచి ప్రకటనలలో ప్రజల స్వత్వములగూర్చి వ్రాసిన వాక్యములు కొంతవరకు దోషదూషితములనియే తోచును. సంశ్లిష్ట సంఘములోని ప్రజలను విడదీసి వారికి పూర్ణ స్వేచ్ఛనిచ్చుట అంతసులభ విషయముకాదు. అట్టివ్యక్తి ప్రయోజనములకు, సంఘము ప్రయోజనములకును సంఘర్షణ రావచ్చును. వచ్చునుకూడ. ఏమైనను, ఎక్కువగా వ్యక్తి స్వాతంత్ర్య ముండవలెనని ప్రజాస్వామికము నిరూపించెను.

18 వ శతాబ్దిలో ఇంగ్లాండు రాజకీయ భావములలో వెనుకబడి యుండెను. అమెరికన్, ఫ్రెంచి విప్లవములవల్ల దానికి సంచలనము కలిగెను. నూతనముగా వచ్చుచున్న ప్రజాస్వామిక భావముల చూచి యది సాంఘికవిప్లవము వచ్చునేమోయని భయపడెను. అధికారవర్గములు సంకుచితభావము లవలంబించిరి. అయినను విద్యావంతులలో నీ క్రొత్త భావములు వ్యాపించెను. ఈ కాలమున టామస్‌పైన్ అను ఇంగ్లీషువాడొకడుండెను. స్వాతంత్ర్య సమరకాలమున నతడు అమెరికాలో నుండి, అమెరికనులకు సాయముచేసెను. సంపూర్ణ స్వాతంత్ర్య భావమును అమెరికనులకు బోధించి, ఒప్పించుటలో అతనికి కొంతచేయి కలదని చెప్పుదురు. ఇంగ్లాండు తిరిగివచ్చిన పిమ్మట అతడొక గ్రంథమును వ్రాసెను. దానిపేరు "ది రైట్స్ ఆఫ్ మాన్" (మానవ స్వత్వములు). అప్పుడే ప్రారంభమైన ఫ్రెంచి విప్లవము నా గ్రంథము సమర్థించెను. ఆ గ్రంథమున నాతడు ఏకాధిపత్యమును తిరస్కరించి, ప్రజాస్వామిక పక్షమును వాదించెను. ఈ కారణమున బ్రిటిషు ప్రభుత్వ మాతనిని

బహిష్కరించెను. అతడు ఫ్రాంసుకు పారిపోవలసి వచ్చెను. త్వరలోనే అతడు పారిస్‌లో జాతీయ సభకు (National Convention) సభ్యుడయ్యెను. కాని 1793లో జాకొబినిలు అతనిని, లూయి XVI మరణ దండనమునకు వ్యతిరేకించెనను కారణమున, జెయిలో బంధించిరి. పారిస్ చెరసాలలో అతడు వేరొక గ్రంథమును వ్రాసెను. దానిపేరు "ది ఏజ్ ఆఫ్ రీజన్" (హేతువాదయుగము). ఆ గ్రంథమున మత దృక్పథము నాతడు ఖండించెను. రాబెస్పేయర్ మరణానంతర మతనికి చెరనుండి విముక్తి కలిగెను. ఇంగ్లీషుకోర్టుల అధికారము వ్యాపించనిచోట అతడుండుటచే అతని గ్రంథమును ప్రకటించిన ఇంగ్లీషు ప్రకటనకర్తను, ఆ గ్రంథమును ప్రకటించినందుకు చెరసాలలో పెట్టిరి. బీదవారు ఉన్నదానితో తృప్తి పడియుండునట్లు చేయుటకు మతము అవసరము కాన, అట్టి గ్రంథము సంఘమునకు ప్రమాదకరమని భావింపబడెను. పైన్ గ్రంథమును ప్రకటించిన పలువురు ప్రకటనకర్తలు, స్త్రీలుసహా చెరకు బంపబడిరి. కవియైన షెల్లీ, జడ్జీకి తన అసమ్మతిని తెలుపుచు జాబు వ్రాసెను. ఇది ఆమోదకరమగు విషయము.

యూరోపులో, 19 వ శతాబ్ది మొదటిభాగమునందంతట వ్యాపించిన ప్రజాస్వామిక భావములకు మూలకారణము ఫ్రెంచి విప్లవము. పరిస్థితులు త్వరత్వరగా మారుచున్నను విప్లవభావములు మాత్రము అట్లే నిలిచియుండెను. రాజులకును, నిరంకుశ ప్రభుత్వమునకును వ్యతిరేకముగా బుద్ధిమంతులు చేయు ప్రతిఘటన రూపమే ఈ ప్రజాస్వామిక భావములు. పారిశ్రామిక పరివర్తనము జరుగుటకు పూర్వమందున్న పరిస్థితులపై ఈ ప్రజాస్వామిక భావములు ఆధారపడియుండెను. కాని నూతన పరిశ్రమ-ఆవిరి, బృహద్యంత్రములు-ప్రాత పద్ధతులను పూర్తిగా తారుమారు చేయుచుండెను. అయినను విచిత్రమేమనగా 19 వ శతాబ్ది తొలిభాగములోనున్న ర్యాడికలులు, ప్రజాస్వామికవాదులు ఈ మార్పుల పట్ల ఔదాశన్యము వహించి విప్లవమునకు మానవ స్వాతంత్ర్యప్రకటనకు

సంబంధించిన రుచిర శబ్దములతో సంభాషించుకొనుచు పోవుచుండిరి. వారి దృష్టిలో బహుశా ఈ మార్పులు పూర్తిగా భౌతికమునకు సంబంధించినవే. ఇవి ప్రజాస్వామికముయొక్క ఉన్నత ఆధ్యాత్మిక, నైతిక రాజకీయాశయములను సాధించునవి కావు. కాని భౌతిక విషయములు ఉపేక్షాభావమును సహించవు. ప్రాత అభిప్రాయములను వదలిపెట్టుటకును, నూతనాభిప్రాయముల నంగీకరించుటకును ప్రజలకెంతో కష్టముగానుండును. వారు కన్నులను, మనస్సులను మూసికొందురు. చూడ నిరాకరింతురు. వారికి హానికరమైనను ప్రాత అభిప్రాయముల నిలుపుకొనుటకు వారు పోరాడుదురు. వారు ఏమైనను చేతురుగాని, నూతన భావముల నంగీకరించి, నూతన పరిస్థితుల కలవాటుపడరు. సంప్రదాయ పరత్వశక్తి అమోఘమైనది. అభివృద్ధి చెందినవారమని భావించుకొను ర్యాడికలులు సైతము తరుచు ఖండింపబడిన నూతన భావముల కంటిపెట్టుకొనియుండి, మారుచున్న పరిస్థితుల నవలోకింప నిరాకరింతురు. ఇట్టి సందర్భములలో చాలినంత అభివృద్ధి కలుగలేదన్న ఆశ్చర్యమేమియు లేదు. తరుచు నిజ పరిస్థితులకును, ప్రజలభావములకును విశేషాంతరముండును. దీనికి ఫలితము విప్లవసందర్భములు కలుగుట.

అనేక దశాబ్దములవరకును ఫ్రెంచి విప్లవ సంప్రదాయములను, భావములను ఆచరణలో పెట్టుటయే ప్రజాస్వామికము చేసినపని. నూతన పరిస్థితుల కనుగుణముగా మారనందున శతాబ్దాంతమున ప్రజాస్వామికము దుర్బలమయ్యెను. 20 వ శతాబ్దిని ప్రజలు దానిని నిరాకరించిరి. నేడు ఇండియాలో పేరుపొందిన రాజకీయవేత్తలు పలువురు ఇంకను ఫ్రెంచి విప్లవమును గూర్చియు, మానవ స్వత్వముల గూర్చియు ప్రసంగించుచున్నారు. ఈ మధ్య ఎన్నో విషయములు జరిగెనను సంగతి వారు గమనింపరు.

తొలినాటి ప్రజాస్వామికవాదులు హేతువాద సిద్ధాంతములచే నాకర్షింపబడిరి. వారు వాక్స్వాతంత్ర్యమును, భావస్వాతంత్రమును కోరిరి. కాని

హేతురహిత మతముతోను, మత శాస్త్రము (1) తోను వానికి సమన్వయము కుదురదు. కాన ప్రజాస్వామికము విజ్ఞానశాస్త్రముతో చేతులు కలిపి మతశాస్త్రమునకు సంబంధించిన హేతురహిత సిద్ధాంతములపట్టును సడలించుటకు ప్రయత్నించెను. బైబిలు గ్రంథమును సమీక్షించ ప్రజలు సాహసించిరి. గ్రుడ్డిగా, నిస్సందేహముగా అంగీకరించదగ్గది కాదనియు, అది సామాన్య గ్రంథమే అనియు వారి భావము. ఈ బైబిలు విమర్శను "మహా విమర్శ" (2) అనిరి. విమర్శకులు తేల్చిన పర్యవసానమేమనగా ?—వేర్వేరు కాలములలో, వేర్వేరు పురుషులచేత వ్రాయబడిన పత్రముల సముదాయమే బైబిలు అని. నూతన మతమును స్థాపించుట జీసస్ ఉద్దేశము కాదనియు వారభిప్రాయపడిరి. ఈ విమర్శచే ప్రాత నమ్మకము లనేకములు చలించెను.

ప్రాత మతపునాదులు శాస్త్రమువల్లను, ప్రజాస్వామిక భావముల వల్లను దుర్బలమగుచుండగా, ప్రాత మతస్థానము నాక్రమించుటకు ఒక తత్వశాస్త్రమును ప్రతిపాదించుటకు ప్రయత్నములు చేయబడినవి. 1768 నుండి, 1852 వరకు జీవించిన ఫ్రెంచి తత్వశాస్త్రజ్ఞుడు అగస్టె కాంట్ అనువా డట్టి ప్రయత్నమొకటి చేసెను. ప్రాతమత శాస్త్రమును, హేతురహిత సిద్ధాంతముల ప్రతిపాదించిన మతములను ప్రాత పడినవని అతడు తలచెను. ఏదో ఒక విధమగు మతము సంఘమున కవసరమని అతని నమ్మకము. కాన అతడు 'మానవకోటికి మతము' * అను మతమును ప్రతిపాదించి దానికి "పాజిటివిజమ్" అని పేరు పెట్టెను. ప్రేమ, క్రమత్వము, అభివృద్ధులపై నీ మత మాధారపడవలెనని ఉద్దేశము. అస్వాభావిక విషయములందుండవు. దానికి శాస్త్ర మాధారము. 19 వ శతాబ్దిలో పుట్టిన సుమారు అన్ని భావముల వెనుక వలెనే దీనివెనుక కూడ మానవజాతి అభివృద్ధి అను భావముమిడియుండెను. కొందరు

(1) Theology. (2) Higher criticism.

* Religion of humanity.

మేధావులుమాత్రమే కాంట్ మతముపై విశ్వాసముంచిరి. కాని యూరోపియన్ దేశములలో ఆలోచనల నిది యెక్కువగా పురిగొల్పెను. సాంఘిక శాస్త్రములు చదువుటకు ప్రారంభము నతడు చేసెనని చెప్పవచ్చును. మానవ సంఘమునుగూర్చియు, సంస్కృతిని గూర్చియు సాంఘిక శాస్త్రము చెప్పును.

కాంట్‌కు సమకాలికుడును, అతనికంటె పెక్కు సంవత్సరములెక్కువ జీవించినవాడును, తత్వశాస్త్రజ్ఞుడును, అర్థశాస్త్రజ్ఞుడును అగు ఇంగ్లీషుదేశస్థుడు జాన్ స్టూఅర్టు మిల్ అను పేరుగలవాడొకడుండెను (1806-1873). కాంట్ బోధనలును, అతని ఆర్థికభావములును, మిల్‌ను ఆకర్షించెను. ఆడమ్ స్మిత్ బోధనల ననుసరించి పెరిగినట్టియు, ఇంగ్లాండులో అమలులోనున్నట్టియు రాజకీయార్థ శాస్త్రమును మిల్ క్రొత్త మార్గమున నడిపించుటకు ప్రయత్నించెను. ఆర్థికవిషయములలోనికి సామ్యపద్ధతి (1)కి సంబంధించిన సూత్రముల నాతడు జొప్పించెను. కాని అతనికి "ప్రధాన ప్రయోజనవాది"గా ప్రసిద్ధివచ్చెను. 'ప్రయోజనవాదము' (2) ఒక క్రొత్త సిద్ధాంతము. ఇంగ్లాండులో ఇంతకుపూర్వమే ప్రతిపాదింపబడెనది. దానిని మిల్ ప్రసిద్ధముచేసెను.దానిపేరు సూచించుచున్నట్లు, ప్రయోజనమే దాని ప్రధాన తత్వము. ప్రయోజనవాదుల మూలసూత్ర మేమనగా—"అధికసంఖ్యాకులకు అధికసౌఖ్యము" కలిగించుట. మంచి, చెడ్డల నిర్ణయించుటకిదే నికషము. ప్రజల సౌఖ్యమును పెంపొందింపజేయు కార్యములే మంచివని చెప్పబడును. అసౌఖ్యమును పెంపొందింప జేయు కార్యములు చెడ్డవి. ఈ దృక్పథముతో సంఘమును, ప్రభుత్వమును నిర్మించవలెను—అధిక సంఖ్యాకుల కధిక సౌఖ్యము కలిగించుట ఈ దృక్పథము. ప్రతివానికి సమానహక్కులుండవలెనని ప్రతిపాదించిన ప్రజాస్వామిక సిద్ధాంతముతో దీనికి సాదృశ్యమంతగా లేదు. అధిక సంఖ్యాకుల కధికసౌఖ్యమున్నప్పుడు అల్పసంఖ్యాకులకు

(1) Socialism. (2) Utilitarianism.

అసౌఖ్యముగాని, వారు త్యాగము చేయుటగాని సంభవించవలెను. ఈ భేదమును నీకు చూపుచున్నానేకాని దాని నిచ్చట మనము చర్చించ నవసరములేదు. ఇట్లు ప్రజాస్వామికమనగా అధిక సంఖ్యాకుల స్వత్వము లని తేలినది.

ప్రజాస్వామికవాద భావమగు వ్యక్తి స్వాతంత్రమును జాన్ స్టూఆర్ట్ మిల్ దృఢముగా ఆమోదించెను. అతడు 'అన్ లిబర్టి' (స్వేచ్ఛపై) అను గ్రంథమును వ్రాసెను. అది ప్రసిద్ధి నందెను. ఆ గ్రంథమునుండి కొన్ని వాక్యములిట ఉదహరింతును. వాక్స్వాతంత్ర్యమును, భావప్రకటన స్వాతంత్ర్యమును ఆమోదించు వాక్యములివి—

> "కాని భావప్రకటనమును అణచివేయుట యను చెడుగుకు ఫలితము ఏమనగా—అది మానవజాతిని దొంగిలించినట్లగును; వచ్చు తరము వారిని, నేటి తరమువారిని దొంగిలించినట్లగును; అట్టి భావములు పెట్టుకొన్న వారినికంటె అధికముగా భావములకు వ్యతిరేకులను దొంగిలించినట్లగును. ఆ భావము సరియైనదైనచో దోషమును విడిచి సత్యమును గ్రహించు అవకాశము వారికి లేకుండ చేసినట్లగును. ఆ భావము దోష భూయిష్టమైనచో —తమకున్న సత్యభావ మీ దోషభావము నెదురుకొన్నప్పుడు తమ సత్యమును వారు స్వచ్ఛముగా చూడగల్గుదురు. వారి మనస్సులందది దాగుగా పట్టును. ఇదియును గొప్ప మేలే. మనము అణచివేయ ప్రయత్నించు భావము దోషయుక్తమని మనము గట్టిగా చెప్పలేము. చెప్పగలిగియున్న ప్పటికిని దాని నణచివేయుట చెడుగే."

హేతురహిత మతసిద్ధాంతములతోను, నిరంకుశ ప్రభుత్వముతోను ఇట్టి భావమును సమన్వయింపలేము. తత్వశాస్త్రజ్ఞులును, సత్యాన్వేషకులును ఇట్టి మనః ప్రవృత్తి కలిగియుందురు.

భావములెట్లు అభివృద్ధి చెందుచున్నవో చూపుటకును, భావ ప్రపంచమున ప్రసిద్ధ ఘట్టములుగా నుండుననియు, పడమటి యూరోపులో 19 వ శతాబ్దిని తలయెత్తిన కొందరు తత్వ శాస్త్రజ్ఞుల ప్రసిద్ధ నామముల కొన్నింటిని పేర్కొంటిని. కాని వీరి ఆదేశములును, తొలి

ప్రజాస్వామికవాదుల సిద్ధాంతములను సామాన్యముగా బుద్ధిమంతులగు వారినే ఆకర్షించెను. వారిలోనే అవి నిలిచెను. బుద్ధిమంతులద్వారా ఇతరులకు కొంతవరకివి సంక్రమించెను. ప్రజాసామాన్యముపై వాని ప్రత్యక్ష ప్రభావము అల్పము. అయినను ఈ ప్రజాస్వామిక భావముల పరోక్ష ప్రభావము అధికముగానే యుండెను. వోటును కోరుట మున్నగు కొన్ని విషయములలో ఈ ప్రత్యక్షప్రభావము సైతము అధికముగానే యుండెను.

19 వ శతాబ్ది గడచిపోవుచుండగా ఇతర ఉద్యమములు, భావములు తలయెత్తెను—కార్మికవర్గోద్యమమును, సామ్యవాదమును. నాటి ప్రజాస్వామికాభిప్రాయముల పైనివి వాని ప్రభావమును చూపెను. వానిని బట్టి తాము మారెను. సామ్యవాదము—ప్రజాస్వామిక వాదమునకు ప్రత్యామ్నాయముగా వచ్చినదని కొందరు తలచిరి. మరికొందరు దానిలో ఉండదగ్గ భాగమే ఇది యని తలచిరి. స్వేచ్ఛ, సమత్వభావములును, సౌఖ్యము నందుటకు ప్రతి మానవునకును సమానహక్కు కలదను భావమును, ప్రజాస్వామికవాదుల కున్నట్లు మనము చూచితిమి. కాని సౌఖ్యము, మూలస్వత్వము అనుటవల్లనే సౌఖ్యము చేకూరదని వారు త్వరలోనే గ్రహించిరి. ఇతర విషయము లెట్లున్నను కొంతవరకైన శరీర స్వాస్థ్య మవసరము. తిండిలేక బాధపడుచున్నవాడు సౌఖ్యముగా ఉండజాలడు. దీనినిబట్టి ప్రజలలో ధనము చక్కగా పంచిపెట్టబడి యున్న యెడల సౌఖ్యము రావచ్చునని వారూహింపదొడగిరి. దీనిని బట్టి వచ్చునది సామ్యవాదము. తరువాతి జాబులో దానినిగురించి వ్రాసెదను.

19 వ శతాబ్ది తొలి భాగములో, ఇతర ప్రభుత్వములకు లోబడి యున్న జాతులుగాని, ప్రజలుగాని స్వాతంత్ర్యమునకై పోరాడునపుడు—ప్రజాస్వామికమును, జాతీయతయును చేతులు కలుపుచుండెను. ఇట్టి ప్రజాస్వామిక దేశభక్తికి ఇటలీలోని మాజనీ నిదర్శనము. ఈ శతాబ్దిలో

తరువాతి కాలమున జాతీయత ప్రజాస్వామిక లక్షణములను గోల్పోయెను. అధికారతత్వము నవలంబించెను. రాజ్యము దైవమాయెను. ప్రతివాడును దానిని పూజించవలెను.

నూతన పరిశ్రమకు నాయకులు ఇంగ్లీషువర్తకులు. ఉన్నత ప్రజాస్వామిక సిద్ధాంతములన్నను, స్వాతంత్ర్యమునందుటకు ప్రజలకు గల హక్కులన్నను వారికంత ఆదరములేదు. కాని ప్రజలకు స్వాతంత్ర్యమధికముగా నుండుట వాణిజ్యమునకు మంచిదని వారు కనుగొనిరి. కార్మికుల జీవనమానమును వృద్ధిచేసి, కొంత స్వేచ్ఛ తమ కున్నదను భ్రమను వారిలో కల్పించి, వారిచేత పనులు చక్కగా చేయించుకొనిరి. పరిశ్రమలు సమర్థముగా జరుగుటకు ప్రజలలో విద్యవ్యాపించుట అవసరము. వీని ఉపయుక్తతలను గ్రహించి వర్తకులును, పారిశ్రామికులును ఈ మేళ్ళను ప్రజల కనుగ్రహించుటకు సమ్మతించిరి. ఈ శతాబ్ది రెండవ భాగమున ఒక విధముగా విద్య, ఇంగ్లాండులోను, పడమటి యూరోపులోను శీఘ్రముగా ప్రజాసామాన్యములో వ్యాపించెను.

## 132

# సామ్యవాద ఆగమనము

ఫిబ్రవరి 13, 1933

ప్రజాస్వామికముయొక్క పురోగమనమునుగూర్చి నీకు వ్రాసియుంటిని. ఎంతో పోరాడిన పిమ్మటగాని, అట్టి యభివృద్ధి చేకూరలేదని జ్ఞాపకముంచుకొనుము. ఉన్న పరిస్థితులు తమ కనుకూలముగా నున్నప్పుడు ఎవ్వరును మార్పు కోరరు సరిగదా మార్పురాకుండా శాయశక్తుల ప్రతిఘటింతురు. కాని అట్టి మార్పు వచ్చినప్పుడే అభివృద్ధిగాని, ప్రజల పరిస్థితులు చక్కబడుటగాని సంభవించును. ఒక సంస్థగాని, పాలనాక్రమముగాని, అంతకన్న మంచివి వచ్చినప్పుడు తొలగిపోవలెను. అట్టి అభివృద్ధిని వాంఛించువారు తప్పనిసరిగా ప్రాతసంస్థనుగాని,

ప్రాత ఆచారములనుగాని ప్రతిఘటించవలసియుండును. ఈ విధముగా నిరంతరము వర్తమాన పరిస్థితుల నెదుర్కొనుట, అట్టి పరిస్థితులవల్ల లాభము పొందువారితో పోరాడుట వారుచేయవలసి యుండును. పడమటి యూరోపులోని పాలకవర్గములవారు అడుగడుగునకు అభివృద్ధిని నిరోధించుచుండిరి. కాదన్న తీవ్రమగు విప్లవము సంభవించవచ్చుననప్పుడే ఇంగ్లాండు పట్టువదలుచుండెను. పరిశ్రమాభివృద్ధికి కొంత ప్రజాస్వామికము ఉపయుక్తమను భావము వణిక్కులలో ప్రవేశించుటచే అభివృద్ధి సాధ్యమయ్యెనని చెప్పియుంటిని.

19 వ శతాబ్ది మొదటి భాగమున ప్రజాస్వామిక భావములు ఎక్కువగా బుద్ధిమంతులలోనే యున్నవని మరల నీకు జ్ఞాపకము చేయుచున్నాను. పరిశ్రమలు పెరుగుటతో ప్రజాసామాన్యమందు దృఢ పరివర్తనము కలిగెను. వారు పొలములు వదలి ఫ్యాక్టరీలకు పోవలసి వచ్చెను. తరుచు బొగ్గుగనుల సమీపమున అంద వికారమగు అనారోగ్యకరమగు ఫ్యాక్టరీ పట్టణములలో గుంపులు గుంపులుగా నివసించి, పారిశ్రామిక కార్మికవర్గము తలయెత్తి పెరుగుచుండెను. ఈ కార్మికులు త్వరత్వరగా మారిపోవుచుండిరి. నూతన మనః ప్రవృత్తి వారికి గలుగుచుండెను. తిండిలేక ఫ్యాక్టరీల నాశ్రయించవచ్చిన వ్యవసాయదారులు, చేతిపనులు చేసికొనువారు నేడు పూర్తిగా మారిపోయిరి. ఫ్యాక్టరీల నెలకొల్పుటలో ముందంజ వేసినది ఇంగ్లాండే కాబట్టి పారిశ్రామిక, కార్మికవర్గ వృద్ధికికూడ ఇంగ్లాండే కారణమయ్యెను. ఫ్యాక్టరీలలో పరిస్థితులు కడు శోచనీయముగా నుండెను. కార్మికుల ఇండ్లును, గుడిసెలును అంతకన్న పాడుగానుండెను. వారు దైన్యస్థితి ననుభవించుచుండిరి. చిన్న పిల్లలును, స్త్రీలును నమ్మశక్యము కానన్ని గంటలు పనిచేయుచుండిరి. శాసనములద్వారా ఈ ఫ్యాక్టరీలను, ఇండ్లను బాగుచేయుటకు చేసిన ప్రయత్నములను ఫ్యాక్టరీ యజమానులు గట్టిగా ప్రతిఘటించుచుండిరి. తమ ఆస్తిపై తమకున్న హక్కుల విషయమై దొరతనము

కలుగజేసికొనుట సిగ్గుచేటని వారు చెప్పుచుండిరి. సొంత ఇండ్లను పరిశుద్ధముగా నుంచుకోవలెనని ప్రభుత్వము బలవంతము చేయగా అది కూడ పై కారణమువల్ల కూడదని చెప్పుచుండిరి.

పాప మీ ఇంగ్లీషు కార్మికులు తగిన తిండిలేకయు, అమితముగ కష్టపడియు మరణించుచుండిరి. నెపోలియన్ యుద్ధములైన తర్వాత దేశము అలసిపోయెను. ఆర్థికమాంద్య మేర్పడెను. ఇందులో అధికముగా బాధపడువారు కార్మికులే అయిరి. తమ్ము రక్షించుకొనుటకును, మంచి పరిస్థితులకై పోరాడుటకును, కార్మికులు సంఘముగా నేర్పడవలెనని తలచిరి. వెనుకటి రోజులలో చేతిపనులు చేయువారికిని, శిల్పులకును శ్రేణు (Guilds) లుండెను. వాని ఇవి పేరు. ఈ శ్రేణులను, ఫ్యాక్టరీ కార్మికులు జ్ఞాపకము చేసికొనిరి. కాబట్టి ఇప్పుడు కార్మిక సంఘముల నెలకొల్ప తలచిరి. కాని వారినట్లు ప్రభుత్వము చేయనీయలేదు. బ్రిటిషు పాలకవర్గమువారు ఫ్రెంచి విప్లవమును చూచి భీతావహులై కొన్ని శాసనములు చేసిరి. వానికి 'కాంబినేషన్ ఆక్ట్సు' అని పేరు. వానినిబట్టి కార్మికులు తమ కష్ట నిష్ఠురములను చర్చించుకొనుటకు సమావేశము సైతము కాకూడదు. ఇప్పుడు ఇండియాలోవలెనే అప్పుడు ఇంగ్లాండులో, "శాంతి భద్రతల" పేరున అధికారులు తమ పనులు నెరపుకొనుచు, తమ జేబులు నింపుకొనుచుండిరి.

కార్మికులు సమావేశము కాకూడదని చేసిన శాసనములు కార్మికుల పరిస్థితులను చక్కబరచలేదు సరిగదా వారికి కోపంవచ్చెను. వారు తెగించిరి. వారు రహస్య సంఘముల నేర్పరచుకొనిరి. రహస్యము వెల్లడి చేయకుండుటకై వారు శపథములు తీసికొనిరి. మారుమూల స్థలములలో, అర్ధరాత్రులందు వారు సమావేశమగుచుండిరి. ద్రోహము వల్లగాని, ఇతర కారణములవల్లగాని వారి రహస్యము వెల్లడియైనచో వారిపై కుట్ర కేసులు పెట్టి దారుణముగా ప్రభుత్వము శిక్షించుచుండెను. ఒక్కొక్కప్పుడు కోపముతో కార్మికులు యంత్రముల తగులబెట్టు

చుండిరి. ఫ్యాక్టరీలకు నిప్పంటించుచుండిరి. తమ యజమానులను సైతము చంపుచుండిరి. చివరకు 1825 లో కార్మికసంఘములపై ఆంక్ష కొంత తొలగింపబడినది. కార్మికసంఘముల (Trade Unions) స్థాపన ప్రారంభమయ్యెను. బాగుగా జీతము సంపాదించు, పనితనము గల కార్మికు లీ కార్మిక సంఘముల నెలకొల్పిరి. పనితనములేని బహు సంఖ్యాకులగు ఇతర కార్మికులు చిరకాలముపాటు సంఘములుగా నేర్పడ లేదు. కార్మికోద్యమము ఇట్లు కార్మిక సంఘములరూపమును ధరించెను. కార్మికుల పరిస్థితులను, ఉమ్మడిగా బేరమాడి బాగుపరుచుకొనుట కివి స్థాపించబడెను. కార్మికుల చేతిలోని అమోఘమగు ఆయుధమొక్కటే- అది సమ్మెచేయు హక్కు-అనగా పనిమాని ఫ్యాక్టరీని స్తంభింప జేయుట. ఇది గొప్ప ఆయుధమనుటకు సందేహములేదు. కాని, వారి యజమానుల చేతులలో ఇంతకన్న ప్రబలమగు ఆయుధమున్నది. అది లొంగుబాటుకు వచ్చువరకు వారికి తిండిలేకుండజేయు శక్తి. ఈ విధముగా కార్మికవర్గము పోరాటము, కార్మికులుచేయు అమిత త్యాగముతో, కొద్ది లాభములతో సాగుచుండెను. వారికి వోటైనను లేకపోవుటచేత వారికి ప్రత్యక్షముగా పార్లమెంటుపై పలుకుబడిలేదు. ఎంతో నిరోధముతో ప్రవేశపెట్టబడిన 1832 సంవత్సరమునాటి రిఫారం బిల్లు భాగ్యవంతులగు మధ్యతరగతుల ప్రజలకుమాత్రమే వోటు నిచ్చెను. కార్మికులకే కాదు, క్రింది మధ్య తరగతి ప్రజలకును ఇంకను వోటులేదు.

ఆ కాలమున మాంఛెస్టర్ ఫ్యాక్టరీ యజమానులలో ఉదార పురుషుడొకడుండెను. అతడు భూత దయాపరుడు. కార్మికుల దురవస్థ కాతడెంతో నొచ్చుకొనెను. ఇతనిపేరు రాబర్టు ఓవెన్. తన ఫ్యాక్టరీలలో అతడెన్నో సంస్కరణలను చేసెను. కార్మికుల పరిస్థితులను బాగుచేసెను. కార్మికుల నింతకన్న చక్కగా, దయతో చూడవలెనని తనతోటి యజమానులతో వాదించుచు, తన అభిప్రాయము వారంగీకరించునట్లు చేయుటకు ఆందోళన జరిపెను. కొంతవరకు అతని ప్రయత్నముల

వల్లనే బ్రిటిషు పార్లమెంటు స్వార్థపరులగు యజమానుల దురాశనుండి కార్మికులను రక్షించుటకు మొదటి శాసనమును జారీచేసెను. ఇదియే 1819 వ ఫ్యాక్టరీ ఆక్టు. తొమ్మిది సంవత్సరముల ఈడుగల చిన్న పిల్లలను, రోజుకు 12 గంటలకు మించి పనిచేయించరాదని ఈ శాసనము నిషేధించెను. కార్మికు లెట్టి దుర్భర పరిస్థితులలో పని చేసెడివారో పై నిబంధనమునుబట్టి నీకు కొంత తెలియవచ్చును.

రాబర్ట్ ఓవెన్ 1830 ప్రాంతమున "సామ్యవాదము" (Socialism) అనుమాట తొలిసారి ప్రయోగించెనట. భాగ్యవంతులను, బీదవారికి సమ మట్టమునకు తీసికొని రావలెననియు, ఉన్నధనమును-సుమారు సమానముగా అందరికిని పంచిపెట్టవలెననియు చెప్పు భావము క్రొత్తదికాదు. వెనుకటి కాలమున నెందరో దీనిని అంగీకరించిరి. ఒక ప్రజాశాఖగాని, గ్రామముకాని భూమిని, ఇతర ఆస్తిని ఉమ్మడిగా పెట్టుకొని ఉండు ఒక విధమగు కమ్యూనిజమ్ తొలిరోజులలో ఉండెను. దీనిని ఆదిమ కమ్యూనిజం అందురు. ఇండియాలోను, అనేక ఇతర దేశములలోను ఇది ఉండెను. ప్రజలను సమానముగా చేయవలెనను అస్పష్టవాంఛ వేరు; నూతన సామ్యవాదము వేరు. ఇది అంతకన్న స్పష్టమైనది. ఉత్పత్తిని చేయు నూతన ఫ్యాక్టరీ పద్ధతికి సమన్వయించుట దీని తొలి ఉద్దేశము. పారిశ్రామిక పద్ధతికి పుట్టిన బిడ్డయని చెప్పవచ్చును. కార్మికుల పరపతి సంఘములుండ వలెననియు, ఫ్యాక్టరీలలో వారికి వాటా ఉండవలెననియు ఓవెన్ అభిప్రాయము. అతడు మాదిరి ఫ్యాక్టరీలను, నివాసములను, ఇంగ్లాండులోను, అమెరికాలోను స్థాపించెను. అవియు కృతకృత్యు డయ్యెననియే చెప్పవలెను. కాని తోటి యజమానులనుగాని, ప్రభుత్వమును గాని అతడు మార్చలేకపోయెను. అయినను ఆ కాలమున అతనికి పలుకుబడి అధికముగా నుండెను. అతనివల్లనే సామ్యవాదమను మాట వ్యవహారములోనికి వచ్చెను. లక్షలాది జనుల నీ మాట ఆకర్షించెను.

పెట్టుబడిదారుల పరిశ్రమలు పెరిగిపోవుచుండెను. వారు విజయ

ములను సాధించుచుండిరి. కార్మికుల సమస్య దానితోపాటు వృద్ధినందు చుండెను. పెట్టుబడిదారి పద్ధతివల్ల నాడు నాటికి ఉత్పత్తి పెరుగు చుండెను. అందువల్ల అతి వేగముతో జనసంఖ్య పెరుగుచుండెను. ఇందుకు కారణము అధిక సంఖ్యాకులకు తిండి దొరుకుటయే. పెద్దగా వర్తకములు నిర్మింపబడినవి. వాని వివిధశాఖలకు అన్యోన్య సహకార ముండెను. చిన్నవర్తకములు పోటీకి తాళలేక కూలిపోయెను. ఇంగ్లాండు లోనికి ధనము ధారగా ప్రవహింపజొచ్చెను. కాని ఇందు చాలాభాగము ఫ్యాక్టరీలు, రైల్వేలు మున్నగువానిని ప్రారంభించుట కుపయోగపడెను. సమ్మెలు కట్టి కార్మికులు మంచి పరిస్థితులు పొందుటకై ప్రయత్నించిరి. కాని ఏమాత్రము లాభములేకుండెను. పిమ్మట 1840 ప్రాంతమందున్న చార్టిస్టు ఉద్యమములో చేరిరి. ఈ ఉద్యమము విప్లవ సంవత్సరమగు 1848 లో అంతరించెను.

ధనికతత్వము సాధించిన విజయముల చూడ ప్రజలకు కన్ను చెదిరిపోయినది. కాని ధనిక తత్వము ప్రవేశపెట్టిన విద్రోహకరమగు పోటీలు, దేశము ధనవంతమగుచున్నను కార్మికులు బాధపడుచుండుట చూచి ర్యాడికల్‌లు, భూతదయాపరులు సహించకుండిరి. ఇంగ్లాండు, జర్మనీ, ఫ్రాంసులలో వీరు దీనికి ప్రత్యామ్నాయము లనేకములు విచారించిరి. అనేక పరిష్కారములు సూచింపబడెను. వీని నన్నిటిని ఒక చోట చేర్చి సోషలిజమ్ (సామ్యవాదము) లేదా కలెక్టివిజమ్, లేదా సోషల్ డెమోక్రసీ అని పేరిడిరి. ఈ పదములన్నింటికిని సుమారు ఒకే అర్థము. ఈ కష్టములకు కారణము పరిశ్రమల యాజమాన్యమును, వానిపై అధికారమును వ్యక్తుల వశమందుండుటయే యని. ఈ సంస్కర్తలలో సామాన్యాంగీకారము కుదిరెను. దీనికి బదులు ప్రభుత్వ మీ పరిశ్రమ లను వశము చేసికొనినచో, లేదా ప్రధాన ఉత్పత్తి సాధనములగు భూమిని, ముఖ్యపరిశ్రమలను స్వాధీనము చేసికొన్నచో అప్పుడు కార్మికుడు ఇతరుల లాభముకొరకు పాటుపడుట ఉండదు. ఇట్లు అస్పష్ట

ముగా ధనిక పద్ధతికి బదులు వేరొక పద్ధతిని ప్రజలు అన్వేషించిరి. కాని ధనికపద్ధతి అంతరించు సూచనలు లేవు. నానాటికి అది బలము పోసికొనుచుండెను.

ఈ సామ్యవాద భావములు మేధావులు ప్రారంభించిరి. రాబర్టు ఓవెన్ మాత్రము ఫ్యాక్టరీ యజమాని. ఎక్కువ కూలిని, మంచి పరిస్థితులను కోరుచు కొంతకాలముపాటు కార్మికుల కార్మికసంఘోద్యమము వివిధ పద్ధతులపై నభివృద్ధి నందెను. పై భావముల ప్రభావము వారిపై నుండెను. సామ్యవాదవృద్ధి కీ యుద్యమము ఎక్కువగా తోడ్పడెను. యూరోపులో పారిశ్రామిక దేశములు మూడు. అవి ఇంగ్లాండు, ఫ్రాంసు, జర్మనీ. ఆయా దేశములందలి కార్మిక వర్గముయొక్క బలమును, గుణమును బట్టి సామ్యవాద మా మూడు దేశములలోను వృద్ధినందెను. మొత్తముమీద ఇంగ్లీషు సామ్యవాదము సంప్రదాయబద్ధమై యుండెను. మెల్లగా పరిణామపద్ధతుల ప్రకారము సామ్యవాదము వృద్ధికావలెనని దాని ఊహ. యూరోపులోని సామ్యవాదము అభివృద్ధి ద్యోతకమై యుండెను. అమెరికాలో పరిస్థితులు భిన్నముగా నుండెను. దేశమా పెద్దది. కూలిచేయు జనము తక్కువ. కాన చాలకాలమువరకు చెప్పుకోదగ్గ కార్మిక వర్గోద్యమము అచ్చట తలయెత్తలేదు.

ఈ శతాబ్ది మధ్యకాలము మొదలు ఒక తరమువరకు బ్రిటిష్ పరిశ్రమ లోకమును ముంచెత్తెను. పరిశ్రమవల్ల వచ్చిన లాభములవల్లను, ఇండియా మున్నగు పాలిత దేశములను స్వార్థోపయోగమునకై పీడించుట వల్లను ధనము ఆ దేశములోనికి ప్రవహించెను. ఈ పెద్ద ధన మొత్తములో ఒక భాగము కార్మికులకుకూడ సంక్రమించుటచే వారి జీవన మానములు అపూర్వముగా పెరిగెను. ఐశ్వర్య విప్లవములకు పోలిక లేదు. బ్రిటిష్ కార్మికుల పూర్వ విప్లవభావములు అంతరించెను. బ్రిటిష్ సామ్యవాదము సైతము మిగతవానికన్న మిక్కిలి మితముగానుండెను. దీనికి ఫాబియానిజం (Fabianism) అని పేరు. ఈ పేరు ఒక రోమన్

సేనానినిబట్టి వచ్చినది. అతడు శత్రువుతో ప్రత్యక్షముగా యుద్ధము చేయక, వారిని క్రమక్రమముగా అలసిపోవునట్లు చేసెడివాడు. 1867లో బ్రిటిష్ ఎన్నికహక్కు మరికొంత విశాలము చేయబడెను. నగర కార్మికులకు కొందరికి వోటు హక్కు వచ్చెను. కార్మిక సంఘములు భాగ్యవంతములై చక్కగా ప్రవర్తించుచుండెను. అందుచే కార్మికుల వోటు బ్రిటిష్ లిబరల్ పార్టీకి ఈయబడెను.

ఐశ్వర్యముతో ఇంగ్లాండు సంతుష్టి చెందియుండగా యూరోపు ఖండమున ఒక నూతన సిద్ధాంతము పుట్టినది. ప్రజ లుత్సాహముతో దానిని సమర్థించిరి. దీనిపేరు అనార్కిజం(అరాజక తత్వము). తెలియనివారు ఈ మాటను చూచి భయపడుదురు. అనార్కిజం అనగా సాధ్యమైనంతవరకు కేంద్రప్రభుత్వము లేకుండ, వ్యక్తిస్వాతంత్ర్య మధికముగా నుండు సంఘము. అనార్కిస్టుల ఆదర్శము చాల ఉన్నతమైనది. "జనతా రాజ్యమను *ఆదర్శముపై విశ్వాసముండవలెను. పరస్పర మేచ్ఛ, ఐకమత్యము, ఇతరుల హక్కులపట్ల సహజ గౌరవము—అను వానిపై ఈ జనతారాజ్య మాధారపడియుండును." ప్రభుత్వము బలాత్కారముగా ఏపనిని చేయించరాదు. "ఎంతమాత్రము పాలన చేయని పరిపాలనమే ఉత్తమ పరిపాలనము; ప్రజలందుకు సంసిద్ధులై యున్నచో అట్టి ప్రభుత్వమే వారికి వచ్చును" అని అమెరికన్ తోరో చెప్పెను.

ఇది చక్కని ఆదర్శమువలెనే తోచుచున్నది—సర్వులకును పూర్ణస్వేచ్ఛ, ప్రతి మనుష్యుడు ఇతరుల గౌరవించుట, అంతటా స్వార్థరాహిత్యము, ఐచ్ఛిక సహకారము—కాని నేటి ప్రపంచము స్వార్థభూయిష్టము, హింసాయుతము అగుటచే దానిని పొందలేదు. నిరంకుశ పరిపాలనముక్రింద పడి ప్రజలు చిరకాలము క్రుగ్గియుండిరి గాన దానికి ప్రతిక్రియగా కేంద్రప్రభుత్వ ముండరాదనియు, అసలు పరిపాలనమే ఉండరాదనియు అనార్కిస్టులు కోరిరి. ప్రభుత్వములు ప్రజలను క్రూర

---

* Commonwealth.

ముగా అణచివేసినవి కాబట్టి ప్రభుత్వములు అసలేవద్దు. కొన్ని రకముల సామ్యవాదము వచ్చినను ఉత్పత్తి సాధనముల నన్నింటిపై పెత్తనము ప్రభుత్వమున కుండును గాన నది నిరంకుశము కావచ్చుననియు అనార్కిస్టులు తలచిరి. అనార్కిస్టులను ఒక విధముగా సోషలిస్టులని చెప్ప వచ్చును. స్థానికివ్యక్తి స్వాతంత్ర్యముల విషయమై వారికి పట్టుదల హెచ్చు. సామ్యవాదులు పలుపురన్నో అనార్కిస్టుల భావములు దూరాదర్శముగా నంగీకరించుటకు సంసిద్ధులై యుండిరి. కాని కొంత కాలముపాటు సోషలిజంక్రింద బలముగు కేంద్ర పరిపాలన అవసరమని వారు భావించిరి. ఇట్లు సోషలిజం, అనార్కిజంలకు భేద మెచ్చుగా నున్నప్పటికిని వాని వాని ఛాయలు అనేకము సమానముగానుండెను.

నేటి పరిశ్రమ కార్మికవర్గము తలయెత్తుటకు కారణమైనది. కార్మిక వర్గము కట్టుదిట్టమగు నిర్మాణముకలది. దాని స్వభావమునుబట్టి చూచిన అనార్కిజం నిర్మాణమున కొదుగు సంస్థ కానేరదు. కార్మిక సంఘములు, మున్నగునవి పుట్టి వృద్ధిబొందుచున్న పారిశ్రామిక దేశములో అనార్కిస్టు భావములు వ్యాపించుటకు సావకాశములేదు. కాన ఇంగ్లాండులోగాని, జర్మనీలోగాని చెప్పుకోదగినంతమంది అనార్కిస్టులులేరు. కాని పరిశ్రమ లలో వెనుకబడిన యూరోపులోని దక్షిణ, తూర్పు భాగములు ఇట్టిభావ ముల వ్యాప్తికి అనుకూలముగా నుండెను. నేటి పరిశ్రమలు తూర్పు, దక్షిణ భాగములకు వ్యాపించుటచే అనార్కిజం నానాటికి క్షీణించెను. నేడది మృతప్రాయమే. కాని స్పెయిన్‌వంటి పారిశ్రామికము గాని దేశమునందు కొంతపట్టుకు అది నిలిచియున్నది.

అనార్కిజం చక్కని ఆదర్శము కావచ్చును. కాని అది అసం తుష్టులకు, ఆదర్శము పేరుచెప్పి లాభముకొట్ట ప్రయత్నించు స్వార్థపరు లకు ఆశ్రయమిచ్చెను. దానివల్ల ఒకవిధమగు హింసకూడ చెలరేగెను. అనార్కిజం పేరుచెప్పిన హింసాకాండమని అందరును అసహ్యించు కొనుట కిదియే కారణము. వారి ఇష్టముచొప్పున పెద్దగా సంఘమున

మార్పులు తేలేక కొందరు అనార్కిస్టులు క్రొత్తవిధముగా ప్రచారము చేయ నిశ్చయించిరి. ఇదియే "కార్యముద్వారా ప్రచారము". ధైర్య శాలులు మార్గదర్శకులై యుండుట, క్రూర ప్రభుత్వమును ధైర్యకృత్య ములతో నిరోధించుట, ఆత్మార్పణము చేసికొనుట-అనేకచోట్ల ఈ అభిప్రాయములతో తిరుగుబాట్లు లేచినవి. అందు పాల్గొన్నవారు తమకు జయము దక్కునని అప్పుడు ఆశించలేదు. ఈ క్రొత్త ప్రచారమును సాగించుటకై వారు తమ ప్రాణములను ఒడ్డిరి. ఈ తిరుగుబాట్లు అణచి వేయబడినవి. అప్పుడు అనార్కిస్టు వ్యక్తులు కొందరు క్రూరత్వముల లోనికి దిగిరి. బాంబులు విసరిరి. రాజులను, ఉన్నతోద్యోగులను తుపా కితో కాల్చి చంపిరి. ఈ తెలివితక్కువ హింస, పెరిగిపోవుచున్న నిరాశ, దుర్బలత్వములకు చిహ్నము. క్రమక్రమముగా 19వ శతాబ్ది అంతము నకు అనార్కిజం ఉద్యమము మాసిపోయెను. అనార్కిస్టు నాయకులు పలువురు, బాంబులను విసురుట, "ప్రత్యక్ష కార్యముద్వారా ప్రచారము చేయుట" అను విషయములను అంగీకరించలేదు. వానిని గర్హించిరి.

ప్రసిద్ధులగు కొందరు అనార్కిస్టుల పేరులు చెప్పుదును. అనా ర్కిస్టు నాయకులలో పలువురు సాధుస్వభావముకలవారు; ఆదర్శపరులు. జీవితమును వారు గడపురీతి చూచిన మనము మెచ్చుకొందుము. అనా ర్కిస్టు నాయకులలో తొలినాయకు డొక ఫ్రెంచి దేశస్థుడు. అతనిపేరు పియేర్ ప్రూడోన్. అతడు 1809 నుండి 1865 వరకు జీవించెను. అతని కన్న కొద్దిగా చిన్నవాడు, ఒక రోషన్ కులీనుడు, మైకేల్ బకునిన్ అనువాడు, ముఖ్యముగా దక్షిణమున యూరోపియన్ కార్మికనాయకుడై ప్రసిద్ధిగనెను. మార్క్సుతో అతనికి వివాదము సంభవింపగా అతనిని, అతని అనుచరులను తాను స్థాపించిన అంతర్జాతీయ సంఘమునుండి మార్క్సు తరిమివేసెను. మన కాలమునకు సమీపమందున్న మూడవ నాయకుడు, రాజకుమారుడు, రష్యను దేశస్థుడు అయిన పీటర్ క్రొపాట్ కిన్. అతడు అనార్కిజం మీదను, ఇతర విషయములమీదను కొన్ని

చక్కని గ్రంథములను వ్రాసెను. నేను చెప్పదలచుకొన్న నాల్గవ పేరు, తుదిపేరు, ఒక ఇటాలియన్‌ది. పేరు ఎన్‌రికో మాలటెస్టా. వయస్సు 80 సంవత్సరము పైబడి. 19 వ శతాబ్దిలోని గొప్ప అనార్కిస్టులలో మిగిలిన ఆఖరివా డితడే.

మాలటెస్టానుగూర్చి చక్కని కథ యొకటికలదు. ఇటలీలో ఒక లాకోర్టులో అతనిపై నేరముమోపి, విచారణ చేయుచుండిరి. గవర్న మెంటు ప్రాసిక్యూటరు, అచ్చటి కార్మికులలో మాలటెస్టా పలుకుబడి అధికమనియు, అందువల్ల వారి శీలములే మారిపోయినవనియు వాదించెను. అందుచే నేరములే తగ్గిపోవుచున్నవనియు, నేరములు తగ్గిన కోర్టులకు చేయుటకు పనియుండదనియు వాదించెను. కాన మాలటెస్టాను జైలుకు పంపవలెను. 6 మాసముల శిక్షవేసి అతనిని జైలుకుపంపిరి.

దురదృష్ట వశమున అనార్కిజంకు హింస నధికముగా ముడి పెట్టుచుండిరి. అదియొక్క ఆదర్శమనియు, తత్వమనియు, పెద్దమనుష్యులనేకులు దాని నామోదించిరనియు ప్రజలు మరచిపోయిరి. దోషభూయిష్టమైన ఈ మన లోకమునకు అట్టి ఆదర్శము మిగుల దూరముగానున్నది. నేటి మన నాగరికత మిక్కిలి క్లిష్టముగా నుండుటచే అది విధించు చిన్న మందులు దీనికి సరిపోవు.

# 133

# కారల్ మార్క్సు:
# కార్మిక సంఘముల వృద్ధి

ఫిబ్రవరి 14, 1933

19 వ శతాబ్ది మధ్యభాగమున యూరోపియన్ కార్మిక సామ్యవాద ప్రపంచములో ఒక ప్రఖ్యాత నూతన పురుషుడు పొడగట్టెను. అతనిపేరు కారల్‌మార్క్సు. ఈ జాబులలో అతని పే రిదివరలోవచ్చినది.

అతడు జర్మన్ జ్యూ. 1818 లో పుట్టెను. అతడు న్యాయశాస్త్రమును, చరిత్రను, తత్వశాస్త్రమును అభ్యసించెను. ఒక వార్తా పత్రిక నాతడు ప్రకటించుటవల్ల జర్మన్ అధికారులతో నతనికి విరోధము కలిగెను. అతడు పారిస్ వెళ్లి క్రొత్తవారితో పరిచయము సంపాదించెను. సామ్య వాదము, అనార్కిజంల మీద వ్రాసిన క్రొత్త పుస్తకములను చదివెను. సామ్యవాద భావము లతనికి నచ్చినవి. ఇచ్చట అతడింకొక జర్మన్‌ను కలిసికొనెను. అతనిపేరు ఫ్రెడెరిక్ ఎన్‌జల్సు. ఇంగ్లాండులో నివాస మేర్పరుచుకొని, వృద్ధినందుచున్న ప్రత్తి పరిశ్రమలో చేరి, ఫ్యాక్టరీ యజమానిమై ఎంజల్సు భాగ్యవంతుడాయెను. అప్పుడున్న సాంఘిక పరిస్థితులను చూచి ఎంజల్సు సంతుష్టిలేక వగచుచుండెను. తనచుట్టును కానవచ్చుచున్న దారిద్రమును, స్వార్థోపయోగమును (Exploitation) తొలగించుట కతడుపాయములు వెదకదొడగెను. రాబర్టు ఓవెన్ అభిప్రాయములు, సంస్కరణ ప్రయత్నములు అతనికి నచ్చుటచే అతడు ఓవెన్ అనుయాయి అయ్యెను. పారిస్‌లో కారల్ మార్క్సును మొదటి సారి కలిసికొన్నప్పుడు అతని భావములు మార్పుచెందెను. నాటినుండి మార్క్సు, ఎంజల్సు దగ్గిర స్నేహితులై, ఒకే భావములతో, ఒకే ఉద్యమమునకై త్రికరణశుద్ధిగా పనిజేయదొడగిరి. వారించుమించు సమాన వయస్కులు. గాఢమైన అన్యోన్య సహకారము వారికుండుటచే వారు ప్రకటించిన అనేక గ్రంథములు వారిరువురు కలిసి వ్రాసినవే.

ఆనాటి ఫ్రెంచి దొరతనము —లూయి ఫిలుప్సు కాలమది—పారిస్ నుండి కారల్ మార్క్సును బహిష్కరించెను. అతడు లండనుకు వెళ్లి చిరకాలము జీవించెను. బ్రిటిష్ మ్యూజియంలోని పుస్తకముల నాతడు ఎడతెరపిలేకుండ చదివెను. అమితముగా పరిశ్రమ చేసి అతడు తన సిద్ధాంతములను నిర్దుష్టముగా చేసికొని గ్రంథములు వ్రాసెను. ప్రపంచముతో సంబంధము లేకుండ, సిద్ధాంతములు కల్పించునట్టి ఆచార్యుడు, తత్వశాస్త్రజ్ఞుడు మాత్రమే కాడతడు. సామ్యవాదోద్యమము యొక్క

అస్పష్ట సిద్ధాంతముల నాతడు స్పష్టముచేసి, విపులీకరించుటయేగాక స్పష్టమగు భావములను, లక్ష్యములను సామ్యవాదుల ముందుపెట్టెను. అంతేకాదు, అతడు కార్మికోద్యమ స్థాపనకు ప్రముఖపాత్ర వహించి పనిచేసెను. యూరోపులోని విప్లవ సంవత్సరమగు 1848 లో జరిగిన సంఘటనలు అతని మనస్సును కలచివేసెను. ఆ సంవత్సరముననే ఎంజల్సు అతడు కలిసి ఒక ప్రకటనచేసిరి. అది మిక్కిలి ప్రసిద్ధిగన్నది. దానిపేరు కమ్యూనిస్టు ప్రకటన (Communist Manifesto). ఫ్రెంచి విప్లవమునకును, తరువాత 1830 లోను, 1848 లోను జరిగిన తిరుగు బాటులకును కారణములైన భావములను వారందు చర్చించిరి. అప్పుడున్న పరిస్థితుల నాభావములు సరిగా వెల్లడించుటలేదనియు, ఆ భావముల కా పరిస్థితులతో పొందుకుదురుటలేదనియు వారు నిరూపించిరి. ఆ నాడు వ్యాప్తిలోనున్న ప్రజాస్వామికవాదుల స్వేచ్ఛ, సమానత్వము, భ్రాతృత్వ ములను వారు విమర్శించిరి. వానివల్ల ప్రజల కీషన్మాత్రము లాభములేదని చూపిరి. బూర్జువా దొరతనమునకు వేసినముసుగు లవియని చెప్పిరి. పిమ్మట వారు సంక్షేపముగా తమ సామ్యవాద సిద్ధాంతమును విపుల ముగా చూపుచు, కార్మికుల నుద్దేశించి ఈ క్రింది సందేశము పలికి, ప్రకటనను వారు ముగించిరి—"ప్రపంచమందలి కార్మికులారా! ఏకము కండు. మీకు మీ సంకెళ్లు తప్ప మరి పోవున దేదియు లేదు. మీకు సంక్ర మించున దీ ప్రపంచము."

ఈ సందేశము కార్యోపక్రమమునకు పిలుపు. వార్తా పత్రికల లోను, కరపత్రములలోను ఎడతెరపి లేకుండ ప్రచారము చేయుచు, కార్మికసంఘములనేకము స్థాపించుటకు ప్రయత్నించుచు మార్క్సు తరు వాత పనిచేసెను. యూరోపులో ఒక గొప్ప ప్రమాదస్థితి రానున్నదని అతనికి తోచినట్లున్నది. కాన కార్మికులందరును అప్పటికి సంసిద్ధులై యున్నచో దానివల్ల లాభమును పొందవచ్చుననియు అతడు భావించెను. అతని సామ్యవాద సిద్ధాంతము ప్రకారము ధనికవర్గ పద్ధతిలో అట్టి

ప్రమాదస్థితి తప్పక వచ్చితీరును. 1854 సంవత్సరమున ఒక న్యూయార్క్ వార్తాపత్రికలో మార్క్స్ ఇట్లు వ్రాసెను—

> "అయినను యూరోపులో ఆరవ శక్తి, (Power) ఉన్న సంగతి మనము మరచిపోరాదు. 'అయిదు అగ్రరాజ్యము'లని చెప్పుకొను వాని నన్నింటిమీదను ఒక్కొక్కప్పుడు అది తన అధికారమును చెలాయించి, వానిని భీతావహులను చేయును. ఈ శక్తిపేరే విప్లవము. ఇది చాల కాలము మరుగులోనుండెను. ప్రమాదస్థితులు సంభవింప నుండుటచేతను, ప్రజలు క్షుధార్తులగుటచేతను ఇప్పుడిది మరల యుద్ధరంగమున కురుక సిద్ధముగానుండెను. ఒక సైగచాలును. జ్వలించు కవచముతో, కరధృత ఖడ్గముతో, ఒలింపియన్ ఫాలమునుండి యుద్భవించిన మినెర్వావలె బలవత్తమమగు ఆరవ యూరోపియన్ శక్తి ముందుకు దూకగలదు. సమీప కాలమున రానున్న యూరోపియన్ సంగ్రామము ఈ సైగ చేయగలదు."

యూరోపులో సమీపకాలమున విప్లవమురానున్నదని మార్క్స్ చెప్పిన జోస్యము తప్పిపోయెను. ఇది వ్రాసి అరవై సంవత్సరములు గడచిపోయిన పిమ్మట ప్రపంచ సంగ్రామము తటస్థించినప్పుడు యూరోపులో ఒక భాగమున విప్లవము సంభవించినది. 1871 లో చేసిన ప్రయత్నము, పారిస్ కమ్యూన్ అను పేరుగలది, క్రూరముగా అణచి వేయబడినట్లు మనము చూచితిముగదా!

1864 సంవత్సరమున లండనులో మార్క్స్ అనేక రకముల మనుష్యులను సమావేశ పరచగలిగెను. వారిలో అనేకులు ఏదో తాము సామ్యవాదులమని చెప్పుకొనిరి. ఒక పక్షమున చూచిన వారిలో ప్రజాస్వామిక వాదులుండిరి; దేశభక్తులుండిరి. పరపాలనమందున్న అనేక యూరోపియన్ దేశములనుండి వచ్చినవారీ దేశభక్తులు. స్వదేశ స్వాతంత్ర్యమే వారికి ముఖ్యముగా కావలసినది. సామ్యవాదము చిర కాలమునకుగాని లాభించదని వారి నమ్మకము. రెండవపక్షము చూచిన వెంటనే యుద్ధమునకు తలపడవలెననెడి అనార్కిస్టులు. మార్క్స్‌తో

పాటు ప్రముఖుడగు మరియొక నాయకుడు బాకునిన్. ఇతడు అనార్కిస్టు నాయకుడు. సైబీరియాలో చిరకాలము చెరలోనుండి మూడు సంవత్సరములకు క్రితమే అతడు తప్పించుకొని వచ్చెను. పారిశ్రామికముగా వెనుకబడి అభివృద్ధిలేని దక్షిణ యూరోపునందలి లాటిన్ దేశములైన ఇటలీ, స్పెయినులనుండి వచ్చినవారే అతని అనుచరులు. వారు బుద్ధి కుశలులేగాని, ఉద్యోగములేనివారు. నాటి సంఘరచనలో స్థానములేని చిల్లర విప్లవకారులును అందుండిరి. మార్క్సు అనుచరులు పారిశ్రామిక దేశములనుండి, ముఖ్యముగా జర్మనీనుండి, వచ్చిరి. అచ్చట కార్మికుల పరిస్థితులు బాగుగానుండెను. ఈ విధముగా వృద్ధియగుచున్న, క్రమ పద్ధతిలోనున్న, ఇతరులకంటె మంచిస్థితిలో నున్న కార్మిక వర్గమునకు మార్క్సు ప్రతినిధి అయ్యెను. బాకునిన్ అన్ననో, బీదవారికి, క్రమ పద్ధతి లేనివారికి, బుద్ధిమంతులకు, అసంతుష్టులకు ప్రతినిధి అయ్యెను. త్వరలోనే కార్యరంగమున దూకుటకు రానున్న తరుణ మేతెంచువరకు ఓపికతో నిర్మాణ కార్యము సాగించవలెననియు, కార్మికులకు తన సిద్ధాంతముల బోధించవలెననియు మార్క్సు అభిప్రాయము. బాకునిన్, అతని అనుచరులును వెంటనే కార్యరంగమునకు దూకవలెనని తొందర పడుచుండిరి. మొత్తముమీద మార్క్సు అభిప్రాయమే నెగ్గెను. "అంతర్జాతీయ కార్మిక సంఘ"మొకటి స్థాపింపబడెను. కార్మికుల "ఇంటర్ నేషనల్సు"అని చెప్పబడువానిలో ఇది మొదటిది.

మూడేండ్లయిన పిమ్మట, 1867 లో, మార్క్సు వ్రాసిన గొప్ప పుస్తకము 'డాస్ కాపిటల్' లేదా 'కాపిటల్' అను పేరుగలది జర్మన్ భాషలో ప్రకటింపబడెను. లండనులో బహు సంవత్సరముల కాలమాతడు పడ్డ శ్రమకు ఫలితమిది. ఈ గ్రంథమున నతడు నాటి అర్థశాస్త్రసిద్ధాంతములను పృథక్కరించి, విమర్శించి, తన సామ్యవాద సిద్ధాంతమును విపులముగా తెలియజెప్పెను. అది శుద్ధ శాస్త్ర గ్రంథము. అస్పష్టతను, ఆదర్శత్వమును విడనాడి అతడు చరిత్ర, అర్థశాస్త్రముల అభి

వృద్ధిని గూర్చి నిష్పక్షపాతముగను, శాస్త్రపద్ధతి కనుగుణముగను చర్చించెను. బృహద్యంత్రమునకు సంబంధించిన పారిశ్రామిక నాగరికత అభివృద్ధిని ముఖ్యముగా నతడు చర్చించెను పరిణామవాదమునుగూర్చియు, చరిత్రను గూర్చియు, మానవసంఘములో వర్గములకు తటస్థించు వివాదములను గూర్చియు అతడు కొన్ని ముఖ్యమగు అభిప్రాయములకు వచ్చెను. విస్పష్టముగా, సుసంబద్ధముగా చర్చింపబడిన మార్క్సునూతన సామ్యవాద సిద్ధాంతమున కందువలననే "శాస్త్రీయ సామ్యవాద"మను పేరువచ్చెను. అంతవరకును వ్యాప్తిలోనున్న సామ్యవాదము అస్పష్టము, ఆదర్శప్రాయముగానుండెను. మార్క్స్ వ్రాసిన 'కాపిటల్' చదువుటకు సులభగ్రంథముకాదు; కులాసాగా చదువు గ్రంథ మెంతమాత్రమును కాదు. అయినప్పటికిని—బహు సంఖ్యాకుల ఆలోచనా పద్ధతిని మార్చినట్టియు, వారి భావప్రపంచమును మార్చినట్టియు, తద్విధముగా మానవాభివృద్ధికి తోడ్పడినట్టియు స్వల్ప గ్రంథములలో నొక్కటిగా నెన్నుకోదగ్గ దీ 'కాపిటల్.'

1871లో పారిస్ కమ్యూన్ దురంతరము సంభవించెను. బహుళా తెలిసి చేసిన సామ్యవాదుల మొదటి తిరుగుబాటు ఇదియే. యూరోపియన్ ప్రభుత్వములు దీనినిచూచి భయపడిరి. కార్మికోద్యమము పట్ల క్రూరముగా ప్రవర్తింపసాగిరి. మరుసటి సంవత్సరము, మార్క్స్ స్థాపించిన కార్మికుల ఇంటర్ నేషనల్ సభ సమావేశమయ్యెను. దీని కార్యస్థానమును న్యూయార్కుకు మార్క్స్ మార్చెను. బాకునిన్ అనుచరులగు అనార్కిస్టులను వదల్చుకొనుటకును, పారిస్‌కమ్యూన్‌వల్ల కుపితులైన యూరోపియన్ ప్రభుత్వములక్రింద ఉండుటకంటె సురక్షితమగు స్థలమునకు వెళ్లుట మంచిదనియును బహుశా మార్క్స్ భావించియుండును. కాని ప్రధాన కేంద్రముల కంతదూరముగా ఇంటర్ నేషనల్ పని చేయుట పొసగదు. దాని బలమంతయు యూరోపులోనే ఉండెను. యూరోపులో సైతము కార్మికోద్యమము కష్టస్థితిలో నుండెను. ఇట్లు

మొదటి ఇంటర్ నేషనల్ క్రమక్రమముగా అంతరించెను.

మార్క్సు తత్వము లేదా మార్క్సు సామ్యవాదము యూరోపియన్ సామ్యవాదులలో, ముఖ్యముగా జర్మనీ, ఆస్ట్రియాలలో, వ్యాపించెను. అచ్చట దానిని "సాంఘిక ప్రజాస్వామిక"మందురు. ఇంగ్లాండును మాత్ర మది ఆకర్షించలేదు. ఐశ్వర్యవంతమై ఉండుటచే నా దేశము అభివృద్ధి సూచకమగు సాంఘిక తత్వమును పరిగణించలేదు. బ్రిటిష్ రకము సామ్యవాదమును "ఫాబియన్ సంఘము" నిరూపించెను. మూడ కాలమున రాదగు మార్పునుగూర్చి చెప్పు దాని కార్యక్రమము బహు మందముగానుండెను. ఫాబియనులకు కార్మికులతో ఎట్టి సంబంధము లేదు. వారు ముందు చూపుగల లిబరల్ బుద్ధిశాలులు. తొలి ఫాబియను లలో నొకడు జార్జి బెర్నార్డుషా. మరియొక ప్రసిద్ధ ఫాబియన్ అగు సిడ్నీవెబ్ చెప్పిన ఈ ప్రసిద్ధ వాక్యమునుబట్టి వారి ఆశయము మనకు బోధ పడును—ఆ వాక్యమిది—"క్రమ పరిణామ మనిర్వార్యము".

ఫ్రాంసులో కమ్యూన్ అనంతరము మరల తేరుకొని సామ్య వాదము చురుకుగా పనిచేయుటకు పన్నెండు సంవత్సరముల కాలము పట్టినది. కాని అది ఇప్పుడు నూతనస్వరూపము ధరించెను. అనార్కిజం, సామ్యవాదముల మేళనమున నది తయారయ్యెను. దీనికి "సిండికాలిజం" అని పేరు. సిండికేట్ అనగా ఫ్రెంచి భాషలో కార్మికసంఘమని అర్థము. సామ్యవాదుల సిద్ధాంతము ప్రకారము, సంఘమున కంతకును ప్రతినిధిగా నున్న ప్రభుత్వమే ఉత్పత్తి సాధనములకు, అనగా భూమికి, ఫ్యాక్టరీలు మున్నగువానికి, యాజమాన్యము వహించి వానిని నడపవలెను. ఈ సామ్యవాద కార్యక్రమము ఎంతవరకు పోవచ్చునన్న విషయములో కొంత భేదాభిప్రాయముండెను. వ్యక్తులకు చెందిన ఉపకరణములు, గృహయంత్రములు మున్నగు అనేక వస్తువులను సామ్యవాద కార్య క్రమములో చేర్చుట హాస్యాస్పదము. కాని సామ్యవాదు లంగీకరించిన విషయమిది—ఇతరుల పనిని పురస్కరించుకొని వ్యక్తులు సొంత లాభ

ములు సంపాదించుట కనువైన దేనినైనను సామ్యవాద కార్యక్రమములో చేర్చవలెను. అనగా అది ప్రభుత్వముయొక్క ఆస్థి కావలెను. సిండికా లిస్టులన్ననో, అనార్కిస్టులవలెనే ప్రభుత్వమన్న వారికి కిట్టదు. ప్రభుత్వాధి కారమును సంకుచితపరచవలెనని వారు ప్రయత్నించిరి. ప్రతి పరి శ్రమయు అందు పనిచేయు కార్మికుల, అనగా సిండికేట్ వశమందుండ వలెనని వారు కోరిరి. ఇందలి అభిప్రాయమేమనగా, వివిధ సిండికేటు సంఘములు జనరల్ కవున్సిల్‌కు తమ ప్రతినిధుల నెన్నుకొందురని. దేశవ్యవహారముల నన్నింటిని ఈ కవున్సిల్ చూచుచుండును. సామాన్య విషయములన్నింటికి అది పార్లమెంటువలె పనిచేయును. కాని పరిశ్ర మకు సంబంధించిన విషయములో కలుగజేసికొనుటకు దాని కధికారము లేదు. ఈ పరిస్థితులు తెచ్చిపెట్టుటకు సిండికాలిస్టులు జనరల్‌సమ్మె చేయవలసియుండునని చెప్పిరి. అనగా దేశముయొక్క వ్యవహారము లను స్తంభింపజేసి, తా మాశించిన ఫలమును గ్రహించవలెననిరి. మార్క్స్ అనుచరులు సిండికాలిజం నెంతమాత్రము అంగీకరించలేదు. చిత్ర మేమనగా మార్క్స్ మరణానంతరము అతడు తమవాడేనని సిండికా లిస్టులు తలచిరి.

సరిగా 50 ఏండ్ల క్రితము, 1883 లో, కారల్ మార్క్స్ చని పోయెను. అప్పటికి ఇంగ్లాండులోను, జర్మనీలోను, ఇతర పారిశ్రామిక దేశములలోను ప్రబలమగు కార్మికసంఘములు పెరిగినవి. బ్రిటిష్ పరి శ్రమ ఉచ్ఛదశ ననుభవించి, నానాటికి పెరుగుచున్న జర్మనీ అమెరికాల పోటీలవల్ల క్షీణించుచుండెను. అమెరికాకు ప్రకృతి కల్పించిన సదుపా యము లనేకముండుటచే త్వరలో పారిశ్రామికముగా నది అభివృద్ధి చెందెను. దుర్బలము, అధికార రహితము అగు పార్లమెంటు ఉన్నను జర్మనీ రాజకీయముగా నిరంకుశ ప్రభుత్వముక్రింద నుండెను. పారి శ్రామికముగా వృద్ధిలో నుండెను. ఇది వింత మేళనము. బిస్మార్కు క్రింద నున్న జర్మను ప్రభుత్వము, తరువాతకూడ, అనేకవిధములుగా పరి

శ్రమలకు సహాయము చేయుచు, వారి స్థితిగతులను బాగుపరచు సంఘ సంస్కారము చేయుచు కార్మికులను తనపక్షమునకు త్రిప్పుకొనుటకు ప్రయత్నించెను. ఈ విధముగానే ఇంగ్లీషు లిబరల్‌పార్టీవారుకూడ సంఘ సంస్కారములు కొన్ని చేసిరి. పనిచేయు గంటలకాలమును తగ్గించి కొంతవరకు కార్మికుల అవస్థను చక్కబరచిరి. ఐశ్వర్య మున్నంతకాల మీ పద్ధతి పనిచేసినది. ఇంగ్లీషు కార్మికులు మితవాదులై, వినమ్రులై, విశ్వాసముతో లిబరలులకు తమ వోటు నిచ్చిరి. కాని 1880 ప్రాంత మున ఇతర దేశముల పోటీవల్ల దీర్ఘకాల మనుభవించిన ఐశ్వర్య మంతరించెను. పరిశ్రమలు ఇంగ్లాండులో మందమయ్యెను. కార్మికుల భృతి పడిపోయెను. కాన మరల కార్మికులకు ప్రబోధము కలిగెను. విప్లవ బుద్ధి తలయెత్తెను. ఇంగ్లాండులో అనేకులు మార్క్సు సిద్ధాంతముపై దృష్టి బరపిరి.

1889 లో కార్మికుల ఇంటర్ నేషనల్ స్థాపించుటకు వేరొక యత్నము చేయబడెను. అనేక కార్మిక సంఘములు, లేబరు పార్టీలు ఇప్పుడు భాగ్యవంతముగా, బలముగా నుండెను. వేతనము తీసికొని ఉద్యోగస్థులు పలువురందు పనిచేయుచుండిరి. 1889 లో స్థాపించిన ఈ ఇంటర్ నేషనల్‌కు (దీనినే లేబర్ మరియు కార్మిక ఇంటర్‌నేషనల్ అందురని అనుకొందును) రెండవ ఇంటర్ నేషనల్ అనిపేరు. అది 25 సంవత్సరములు పనిచేసెను. పిమ్మట మహా సంగ్రామము తటస్థించగా అది లోప భూయిష్టమని ఋజువైనది. ఈ ఇంటర్ నేషనల్‌లో అనేకులు సభ్యులుండిరి. వీరే తరువాత ఇతరదేశములలో పెద్ద ఉద్యోగములందు ప్రవేశించిరి. కార్మికోద్యమము అండను కొందరు తమ ఉన్నతికై పాటుపడి పిమ్మట దానిని వదలిపెట్టిరి. ప్రధానామాత్యులు, ప్రెసిడెంటులు మున్నగుపదవులను వారు సంపాదించుకొనిరి. ప్రయోజకులైరి. వారికి సహాయము చేసినట్టియు, వారియందు విశ్వాసముగలట్టియు లక్షలాది కార్మికులను విడిచిపెట్టిరి. కార్మికులు ఉన్నతావుననే ఉంచి

పోయిరి. ఈ నాయకులు, మార్క్సు పేరుచెప్పి శపథము తీసికొన్న వారే, తీవ్రవాదులైన సిండికాలిస్టులే, పార్లమెంటులలో ప్రవేశించిరి. లేదా కార్మిక సంఘనాయకులై పెద్ద జీతములు సంపాదించుకొనుచుండిరి. సుఖమునిచ్చు తమ ఉద్యోగములను వదలి తీవ్రోద్యమములలో పాల్గొను టకు వారి కంతకంతకు కష్టమనిపించెను. కాన వారు చల్లబడిరి. నిరాశచే తెగించి కార్మిక సమూహములు తిరుగబడినప్పుడు వారిని అణచివేయు టకు వీరు ప్రయత్నించిరి. జర్మనీలోని, "సాంఘిక ప్రజాస్వామిక వాదులు" యుద్ధానంతరము రిపబ్లికుకు ప్రెసిడెంటును, ఛాన్సెలర్‌ను అయిరి. ఫ్రాంసులో, తీవ్ర సిండికాలిస్టు అయిన బ్రియాండ్, జనరల్ సమ్మెనుగూర్చి ప్రచారము చేసినవాడు, పదకొండుమారులు ప్రధానా మాత్యుడయ్యెను. తన ప్రాతకార్మికసమ్మె నాత డణచివేసెను. ఇంగ్లాం డులో, తన్నంతవానినిగా జేసిన తన లేబరు పార్టీకి విడాకులిచ్చి, రామ్సే మాక్డొనాల్డు ప్రధానామాత్యుడయ్యెను. ఇట్లే స్వీడన్‌లో, డెన్మార్కులో, బెల్జియంలో, ఆస్ట్రియాలో జరిగెను. నేడు పడమటి యూరోపు నియంతల తోను, అధికారులతోను కిటకిట లాడుచుండెను. వీరందరును వయ స్సులో నున్నప్పుడు సామ్యవాదులే. వయస్సు గడపగా గడవగా వారు మెత్తబడిపోయిరి. ఉద్యమముపట్ల తాము చూపిన పూర్వోత్సాహమును విస్మరించిరి. వెనుక తమ సహచరులైయున్న వారిమీదనే కత్తికట్టిరి. ఇటలీ నియంతయగు ముస్సోలినీ ఒకప్పుడు సామ్యవాదియే. పోలెండు నియంతయగు పిల్‌సూడ్‌స్కి కూడ అంతే.

లేబరు ఉద్యమమును, స్వాతంత్ర్యమునకై పోరాడు దాదాపు ప్రతి జాతీయోద్యమమును, నాయకులును, ప్రఖ్యాత పురుషులును ఇట్లు జారిపోవుటచే తరుచు దెబ్బతిన్నవి. కొంతకాలమైన పిమ్మట విజయము చేకూరనందుకు వారికి విసుగుపుట్టెను. ఉద్యమమునకై ప్రాణత్యాగము చేసినప్పుడు పట్టి గౌరవము ఎన్నాళ్లు వారిని ఆకర్షించగలదు? వారు చల్ల బడుదురు. వారి ఉత్సాహాగ్ని మందగించును. కొందరు అత్యాశాపరులు

గాని, ధర్మభీతిలేనివారుగాని ఎదిరిపక్షమును చేరుదురు.చేరి, ఇంతవరకు తా నెదిరించినట్టియు, పోరాడినట్టియు వారితో సంధి చేసికొందురు, తాము చేయదలచుకొన్న కార్యమును చేయుటకు తమ అంతరాత్మలను సమాధానపెట్టుట సులభమే. ఇట్టి జారుబాట్లవల్ల ఉద్యమము దెబ్బ తినును. దాని గతి మందగించును. కార్మికుల నెదుర్కొనువారును, ప్రజలను అణచిపెట్టువారును ఈ సంగతి బాగుగా నెరుగుదురు. లంచ ములు పెట్టియు, మంచిమాటలాడియు వారిని తమవైపుకు త్రిప్పుకొను టకు ప్రయత్నింతురు. కాని మంచి మాటలవల్లగాని, వ్యక్తుల కున్నతో ద్యోగము లిచ్చుటవల్లగాని కార్మికులకు మేలుకలుగదు. స్వేచ్ఛ బడయు టకై పోరాడు పీడిత జాతికిని మేలుకలుగదు. కాన సభ్యులు జారిపోయి నను, విఘ్నములు తటస్థించినను నిర్దిష్టఫలము చేకూరువరకు ఉద్యమము అనివార్యముగా సాగిపోవుచునే యుండెను.

1889 లో ప్రారంభమైన రెండవ ఇంటర్ నేషనల్ సభ్యుల సంఖ్య వృద్ధిఅయ్యెను. దాని గౌరవము పెరిగెను. కొన్ని సంవత్సరము లైన పిమ్మట వారు మాలటెస్టా క్రిందనున్న అనార్కిస్టులను, పార్ల మెంటులకు వోటునీయనన్నందుకు, బహిష్కరించిరి. ఇంటర్ నేషనల్ సామ్యవాదులు, సాటి కామ్రేడులతో సహవాసముకన్న పార్లమెంటులే మేలనిరి. యూరోపులో యుద్ధము వచ్చినట్లయితే సామ్యవాదుల కర్తవ్య మును గురించి వారు పెద్ద ప్రకటనలుచేసిరి. సామ్యవాదులు జాతుల యొక్క సరిహద్దులను గమనించమని చెప్పిరి. మామూలు అర్థము ప్రకారము వారు జాతీయవాదులుకారు. వారు యుద్ధమును ప్రతిఘటింతు మని చెప్పిరి. కాని 1914 లో యుద్ధమే తటస్థించినప్పుడు రెండవ ఇంటర్ నేషనల్ కట్టడమంతయు విచ్ఛిన్నమైపోయెను. అన్నిదేశము లందున్న సామ్యవాదులును, లేబరు పార్టీవారును, క్రొపాట్‌కిన్ వంటి అనార్కిస్టులును, పిచ్చిజాతీయవాదులై ఇతరులవలెనే తామును పర దేశములను దూషింపసాగిరి. కొద్దిమందిమాత్రము నిరోధించిరి. తత్ఫల

ముగా వారు అనేక విధములుగా, చిరకాలము కారాగారావాసముచేయుచు, అధికముగా కష్టపడిరి.

యుద్ధానంతరము లెనిన్ 1919 లో మాస్కోలో ఒక క్రొత్త ఇంటర్ నేషనల్ ప్రారంభించెను. ఇది శుద్ధ కమ్యూనిస్టు సంస్థ. నికరముగు కమ్యూనిస్టులే అందు చేరవచ్చును. ఇది ఇప్పుడున్నది. దీనినే మూడవ ఇంటర్ నేషనల్ అందురు. యుద్ధానంతరము రెండవ ఇంటర్ నేషనల్ యొక్క శకలములు క్రమక్రమముగా ప్రోగుబడజొచ్చెను. ఇందు కొందరు మాస్కో మూడవ ఇంటర్ నేషనల్‌తో చెలిమిచేసిరి. కాని పలువురకు మాస్కోఅన్న కిట్టదు. దాని సిద్ధాంతమన్న కిట్టదు. దానిని సమీపించుటకే వారు నిరాకరించిరి. రెండవ ఇంటర్ నేషల్‌ను వారు పునరుజ్జీవింపజేసిరి. ఇదియును ఇప్పుడున్నది. అనగా ఇప్పుడు ఇంటర్ నేషనల్ కార్మిక సంఘములు రెండున్నవి. వానిని సంక్షేపముగా రెండవ, మూడవ ఇంటర్ నేషనలులు అందురు. వింత యేమనగా ఈ రెండును మార్క్స్ తత్వమునే ఆశ్రయించినవి. కాని వారు చేయు మార్క్స్ తత్వవ్యాఖ్యలు వేరు. అయినను వారు, తమకు సమాన శత్రువైన ధనిక తత్వమును ద్వేషించుటకంటె ఎక్కువగా ఒకరినొకరు ద్వేషించుకొందురు.

ప్రపంచమందలి ట్రేడు యూనియనులు, కార్మిక జనుల సంస్థలు అన్నియు ఈ ఇంటర్ నేషనలులలో చేరలేదు. పెక్కు సంస్థలు ఏ ఇంటర్ నేషనలుకును చెందినవికావు. అమెరికాలోని ట్రేడుయూనియనులు వేరొక తరహాకు చెందినవి. అవి మిక్కిలి సాంప్రదాయకములు (Conservative). ఇండియన్ ట్రేడుయూనియనులుకూడా ఏ ఇంటర్ నేషనలుకు చెందినవి కావు.

ఇంటర్ నేషనల్ పాట నీకు వచ్చుననుకొందును. ప్రపంచమందంతట అంగీకృతమైన కార్మిక సామ్యవాదుల పాట అది.

134

# మార్క్సు తత్వము

ఫిబ్రవరి 16, 1933

యూరోపియన్ సామ్యవాద ప్రపంచములో గొప్ప సంచలనము కలిగించిన మార్క్సు అభిప్రాయములను కొంతవరకు వెనుకటిజాబులో చెప్పదలచితిని. కాని ఆ జాబు పెరుగుటచే నీ విషయము ఉండిపోవలసి వచ్చినది. ఈ విషయమున నేను పండితుడనుకాను. కాన దీనినిగురించి వ్రాయుటసులభముకాదు. ఈ విషయమై పండితులలోనే భిన్నాభిప్రాయము లున్నవి. మార్క్సు తత్వముయొక్క ప్రధానలక్షణములను మాత్రమే ఇందు పేర్కొందును. క్లిష్టభాగములను వదలివేయుదును. దీనినిబట్టి నీకు ఈ విషయము సమగ్రముగా తెలియకపోవచ్చును. ఈ జాబులలో దేనినిగురించియు నేను సమగ్రముగా చెప్పదలచు కొనలేదు.

నేనిదివరలో నీకు చెప్పినట్లు సామ్యవాదము పలు రకములుగా నున్నది. అయినను ఒక్కవిషయమున అన్నిరకముల వారికిని సామాన్య ముగా అంగీకారము కుదిరినది. భూమి, గనులు, ఫ్యాక్టరీలు మున్నగు ఉత్పత్తి సాధనములను, రైల్వేలు మున్నగు రవానా సాధనములను, బాంకులు, బాంకులువంటి సంస్థలను ప్రభుత్వము తనవశము నందుంచు కొని నడిపించవలెను. ఇందలి ప్రధానాభిప్రాయ మేమనగా—ఈ పద్ధతులను గాని, ఈ సంస్థలనుగాని, ఇతరుల కష్టమునుగాని, వ్యక్తులు తమ లాభ మునకై స్వార్థోపయోగము చేసికోరాదని. నేడిందు పెక్కుసంస్థలు వ్యక్తుల వశమందున్నవి. వారి స్వార్థోపయోగమునకై వానిని నడుపు చున్నారు. ఫలితమేమనగా కొందరు భాగ్యవంతులగుచున్నారు. సంఘ మన్ననో ఎక్కువగా నష్టపడుచున్నది. ప్రజాసామాన్యము దరిద్రులు గానే నిలిచిపోయిరి. అంతేకాదు. నష్టమునకైనను సిద్ధపడి తమలో తాము తీవ్రముగు పోటీలుపడి రీ ఉత్పత్తి సాధనముల యజమానులును,

వానిని నడిపించువారును తమ శక్తి, సామర్థ్యములను వినియోగించి పోరాడుచున్నారు. ఇట్టి పోరాటములకు బదులు ఉత్పత్తిని వివేకముతో ఏర్పాటు చేయుటవల్లను, రవానాను బాగా ఆలోచించి సక్రమమార్గమున పెట్టుటవల్లను అనవసరమగు పోటీలు లేకుండపోవును. నష్టముండదు. వివిధ వర్గములమధ్యను, వివిధ వ్యక్తులమధ్యను ఉండు ధనవిషయక మగు హెచ్చుతగ్గులు అంతరించును. కాబట్టి ఉత్పత్తియు, రవానాద్వారా పంపకమును, ఇతర ముఖ్య కార్యములును చాలవరకు ప్రభుత్వము వశమందుండవలెను–అనగా యావత్ ప్రజల వశమందుండవలెను. సామ్యవాదముయొక్క మూలసిద్ధాంత మిది.

సామ్యవాదమునుబట్టి ఎట్టి ప్రభుత్వముండవలె ననునది వేరొక విషయము. అది ముఖ్యవిషయమైనను ప్రస్తుతము దానినిగురించి విచా రింప నవసరములేదు.

సామ్యవా దాదర్శమును గూర్చి అంగీకారము కలిగిన పిమ్మట ఆలోచించదగ్గ విషయము–దానిని సాధించుట ఎట్లని ? ఈ విషయమున సామ్యవాదులలో భిన్నాభిప్రాయములు కలవు. భిన్న మార్గములనుచూపు సామ్యవాద సమూహము లనేకమున్నవి. వారిని రెండువర్గములుగా, స్థూలముగా, విభజించవచ్చును–(1) క్రమపరిణామమును కోరువారు. వీరు క్రమక్రమముగా, పార్లమెంటులద్వారా పనిచేయుచు, ముందుకు పోవలెనందురు. బ్రిటిష్ లేబరుపార్టీవారును, ఫాబియనులును అట్టివారు. (2) విప్లవము కోరువారు. పార్లమెంటులద్వారా ఫలముల పొందగల మను నమ్మకము వీరికి లేదు. వీరు ముఖ్యముగా మార్క్సు మతావ లంబులు.

మొదటి పక్షమునకు చెందిన క్రమపరిణామవాదుల సంఖ్య నేడు చాల తగ్గిపోయినది. ఇంగ్లాండులోనున్నవారు సైతము దుర్బలులగు చున్నారు. వీరికిని-లిబరలులకును, వీరికిని-అసామ్యవాదులకును మధ్య నున్న భేదము సన్నగిల్లుచున్నది. కాన నేడు మార్క్సు మతము

సామాన్య సామ్యవాదమతముగా అంగీకరింపవచ్చును. మార్క్సు మతావలంబులలోకూడ యూరోపులో రెండు ప్రధాన విభాగములున్నవి. ఒక పక్షము రష్యన్ కమ్యూనిస్టులు. రెండవపక్షము జర్మనీ, ఆస్ట్రియా మున్నగు దేశములలోని సాంఘిక ప్రజాస్వామికవాదులు. ఈ ఉభయ పక్షములకును సామరస్యములేదు. ప్రపంచ సంగ్రామ కాలముననుా, తరువాతను తమ ఆశయముల కనుగుణముగా ఆచరణ జరుపనందున సాంఘిక ప్రజాస్వామికవాదుల పూర్వ ప్రతిష్ఠ చాలవరకు సన్నగిల్లినది. అందలి ఉత్సాహవంతు లనేకులు కమ్యూనిస్టు పక్షమవలంబించిరి. కాని వారింకను పడమటియూరోపు నందలి ట్రేడుయూనియన్‌లను నడిపించుచున్నారు. రష్యాలో విజయము సాధించెను గాన కమ్యూనిజమ్ వర్ధమానమగుచున్న మతమాయెను. నేడు యూరోపులోను, ప్రపంచమందంతటను ధనికతత్వమునకు ముఖ్య ప్రతిస్పర్థి అదియే.

అయితే మార్క్సు తత్వమన నేమి? రాజనీతి శాస్త్రమును, (Politics), అర్థశాస్త్రమును, మానవజీవితమును, మానవవాంఛలను సమన్వయపరచు ఒక మార్గమిది. అది సిద్ధాంత మేకాదు. కార్యరంగమునకు పురిగొల్పు ఆహ్వానముకూడ. మానవుని జీవితకృత్యములనేకమును గూర్చి ఏదో కొంత చెప్పు తత్వశాస్త్రమిది. మానవుని భూతవర్తమాన భవిష్యత్ చరిత్రను కర్కశ తర్కబద్ధముచేయు ప్రయత్నమిది. విధి ఎట్లు దున్నివార్యమో ఇదియును అట్లే. జీవితమంత తర్క బద్ధమైనదా? కఠిన సూత్రములమీదను, పద్ధతులమీదను ఆధారపడియున్నదా? అను విషయము సుస్పష్టముగాతెలియదు. అనేకు లీవిషయమై సందేహించిరి. కాని మార్క్సు గత చరిత్రను శాస్త్రజ్ఞునివలె పరీక్షించి కొన్ని పర్యవసానములను గ్రహించెను. తొలి దినములనుండియు మానవుడు భుక్తికై పోరాడుచుండెను. ఈ పోరాటము ఒకప్రక్క ప్రకృతితోను, ఒకప్రక్క సాటిమానవునితోను. ఆహారమును, ఇతర జీవితావసరములను సంపాదించుకొనుటకు మానవుడు కృషిసల్పెను. కాలము గడచినకొలది అతని

సంపాదన పద్ధతులు మారిపోవజొచ్చెను. అవి రాను రాను క్లిష్టము కాజొచ్చెను. మార్క్సు అభిప్రాయము ప్రకారము జీవన సాధనముల నుత్పత్తిచేయు ఈ పద్ధతులే, మానవుని జీవితమందును, సంఘ జీవితము నందును, ప్రతి యుగమునను మిక్కిలి ప్రధానస్థానము నాక్రమించెను. చరిత్ర ప్రతియుగమునందు అవి ప్రబలమైయుండెను. ఆ యుగమునకు సంబంధించిన కార్యములన్నింటిమీదను, సాంఘిక సంబంధములమీదను వాని ప్రభావమును చూపెను. అవి మారినప్పుడు చారిత్రక, సాంఘిక మార్పులు వాని వెన్నింటియేవచ్చెను. ఈ జాబులలో కొంతవరకు ఈ మార్పుల ఫలితములను చూచియుంటిమి. ఉదాహరణమునకు—మొట్ట మొదలు సేద్యము ప్రవేశపెట్టబడినప్పుడు ఎంతయో మార్పువచ్చెను. దేశదిమ్మరులొకచోట స్థిరనివాస మేర్పరచుకొన్నప్పుడు పల్లెలు, పట్టణములు లేచినవి. వ్యవసాయ ఫలసాయమధికమైనప్పుడు కొంత సరుకు మిగులుచుండెను. జనాభా పెరిగెను; ధనము చేరెను; విశ్రాంతి చిక్కెను. కళలు, చేతిపనులు తలయెత్తెను. వేరొక ప్రత్యక్షోదాహరణము పారిశ్రామిక విప్లవము. ఉత్పత్తికై బృహద్యంత్రముల ప్రవేశపెట్టినప్పుడు బ్రహ్మాండమైన మార్పువచ్చెను. ఇతర ఉదాహరణము లనేకమున్నవి.

ఒక చరిత్ర యుగమునయున్న ఉత్పత్తి పద్ధతులు ప్రజల అభివృద్ధిలోని ఒక నిర్దిష్ట దశకు సరితూగియుండును. ఉత్పత్తి కార్యమును చేయుచున్నప్పుడును, దానికి ఫలితముగాను మానవులొకరితో నొకరు నిర్దిష్ట సంబంధములు పెట్టుకొందురు (ఉ॥ సాటాబేరము, (Barter) కొనుట, అమ్మట, మారకము మొదలైనవి). ఇవి ఉత్పత్తి పద్ధతులను బట్టియు, వానికనుగుణముగాను ఉండును. ఈ సంబంధములుయావత్తును సంఘముయొక్క ఆర్థిక నిర్మాణమనిపించుకొనును. ఈ ఆర్థిక నిర్మాణ మాధారముగా శాసనములు, రాజకీయములు, సంఘమర్యాదలు, భావములు—సమస్తమును ఏర్పాటుచేయబడును. కాబట్టి మార్క్సు చెప్పిన

ఈ అభిప్రాయమునుబట్టి ఉత్పత్తిపద్ధతులు మారినప్పుడు ఆర్థిక నిర్మాణము మారును. ఈ మార్పునుబట్టి దీని వెన్నంటి ప్రజల భావములలో, శాసనములలో, రాజకీయములు మున్నగు వానిలో మార్పులు వచ్చును.

మార్క్సు దృష్టిలో చరిత్ర అనగా—వివిధ వర్గముల మధ్య జరుగుచున్న పోరాటముయొక్క గాథయే—"భూత వర్తమాన కాలములలో సర్వమానవసంఘ చరిత్రము వర్గములందలి పోరాటముల చరిత్రగానే ఉన్నది." ఉత్పత్తి సాధనములను తన వశములో నుంచుకొన్న వర్గము అధికార స్థానములోనుండును. వర్గముల కష్టమునది స్వప్రయోజనమునకై వినియోగించి. లాభములు పొందును. కష్టపడి చేయువారు తమ కష్టమునకు తగిన ధనమును పొందరు. జీవితావసరములకు సరిపోయినంత భాగము మాత్రమే వారికి దక్కును. మిగిలినది స్వప్రయోజనపరుల చేజిక్కును. ఇట్లు స్వార్థపరుల వర్గము ఈ అదనపు డబ్బునుండి భాగ్యవంతమగును. ఈ వర్గమువారే రాష్ట్రమును, ప్రభుత్వమును నడిపింతురు. వీరే ఉత్పత్తిని తమ స్వాధీనమందుంచుకొందురు. ఇట్టి పాలకవర్గమును రక్షించుటయే రాజ్యముయొక్క ప్రథమకర్తవ్యమగును. "యావత్ పాలకవర్గ వ్యవహారములను నడిపించు కార్య నిర్వాహక సంఘమే రాష్ట్రము," అని మార్క్సు చెప్పుచున్నాడు. ఇందుకొరకే శాసనములు చేయబడుచున్నవి. విద్యద్వారా, మతముద్వారా, ఇతర మార్గములద్వారా, ఈ వర్గాధిపత్యము న్యాయమనియు, సహజమనియు ప్రజలలో నమ్మకము పుట్టించుచున్నారు. ప్రభుత్వమును, శాసనములును వర్గాధీనములై యున్నవను విషయము నీ పద్ధతులద్వారా కప్పిపుచ్చుటకు ప్రయత్నములు చేయబడుచున్నవి. స్వార్థోపయోగమునకు లక్ష్యభూతులైన ఇతర వర్గములవారికి నిజస్థితి తెలియకుండ, వారు అసంతుష్టి చెందకుండ ఇట్లు చేయుచున్నారు. ఎవ్వడైనను అసంతుష్టి జెంది ఈ పద్ధతి సరియైనది కాదని సవాలు జేసినయెడల వానిని సంఘశత్రువనియు, నీతిబాహ్యుడనియు, పురానిర్మిత మర్యాదల విధ్వంసము

చేయువాడనియు నిందించి ప్రభుత్వము వానిని అణచివేయును.

కాని ఎన్ని ప్రయత్నములు చేసినను ఒక వర్గము శాశ్వతముగా ప్రబలమైయుండజాలదు. దానిని ప్రబలముగా జేసిన హేతువులే ఇప్పుడు విపరీతముగా పనిచేయును. నాడున్న ఉత్పత్తి సాధనములను తన వశమున బెట్టుకొని నడిపించుటవల్లనే అది పాలకవర్గము స్వార్థోపయోగపర్గము అయినది. ఇప్పుడు నూతన ఉత్పత్తి పద్ధతులు తలయెత్తుటచే వీనిని నిర్వహించు నూతన వర్గములు ప్రాముఖ్యములోనికి వచ్చును. ఇతరుల స్వార్థోపయోగమునకు వీరు సమ్మతించరు. నూతనభావములు మానవులలో సంచలనము కలిగించును. భావవిప్లవమనున * దొకటి యున్నది. ఇది పురాతన భావములు, హేతురహిత మతసిద్ధాంతములు అను సంకెళ్లను బ్రద్దలు కొట్టును. అప్పుడు పైకివచ్చుచున్న వర్గమునకును, అధికారము నంటిపెట్టుకొన్న ప్రాత వర్గమునకును సంఘర్షణ కలుగును. నూతన వర్గమే ఆర్థిక ప్రాబల్యము సంపాదించుటచే తప్పకుండ జయించును. చరిత్రలో తన పాత్ర తాను నిర్వహించినదగుటచే ప్రాతవర్గము మాసిపోవును.

ఈ నూతన వర్గముయొక్క విజయము రాజకీయ విజయమును, ఆర్థికవిజయమునుకూడ. నూతన ఉత్పత్తి పద్ధతుల విజయమునకిది చిహ్నము. దీనినిబట్టి సంఘమునందంతటను మార్పులు వచ్చును— నూతనభావములు, నూతన రాజకీయ నిర్మాణము, శాసనములు, ఆచారములు, సమస్తమును మారును. ఈ నూతన వర్గము తన క్రింది వర్గములవారి నిప్పుడు స్వార్థోపయోగము చేసికొనును. దాని కాలము వచ్చినప్పుడది మరల వేరొకవర్గముచే స్థాన భ్రష్టమగును. ఇట్లే పోరాటము జరుగుచునే యుండును. ఒక వర్గము వేరొకవర్గమును స్వార్థోపయోగము చేసికొనుచున్నంతవరకు ఇది సాగును. అది లేనప్పుడు ఆగును. వర్గము లంతరించి ఒక వర్గముమాత్రమే మిగిలినప్పుడు ఈ

* Ideological Revolution.

పోరాట మాగును. అప్పుడు స్వార్థోపయోగమున కవకాశముండదుకదా! ఈ వర్గము తన్ను తాను స్వార్థోపయోగము చేసికొనలేదు. అప్పుడే సంఘమున సమత్వమేర్పడును. నేటి అంతములేని పోరాటములకు, పోటీలకు బదులు సంపూర్ణ సహకార మేర్పడును. రాష్ట్రముయొక్క ప్రధానకార్యమైన నిర్బంధమునకు, నిర్బంధించుటకు ఏ వర్గమును ఉండదుగనుక, ఇకముందు అవసరముండదు. కాన క్రమముగా రాష్ట్రమే "వడిలిపోవును". అట్లు జరిగిన.అనార్కిస్టుల ఆదర్శము సమీపించి నట్లగును.

ఇట్లు, మార్క్సు, అనివార్యమగు వర్గముల పోరాటములు కారణముగా జరుగు మహత్పరిణామ కార్యముల ప్రదర్శించునదే చరిత్రయని భావించెను. భూతకాలముననిది ఎట్లుసంభవించెనో అనేక వివరములతో, ఉదాహరణములతో నతడు నిరూపించెను. బృహద్యంత్రము వచ్చుట తోడనే ఫ్యూడల్ కాలము మారి ధనిక వర్గ కాలమెట్లు ప్రవేశించినదో, ఫూడల్ వర్గములు మారి బూర్జువా వర్గ మెట్లు వచ్చినదో అతడు నిరూపించెను. అతని మతప్రకారము మన కాలములో, తుట్టతుది వర్గ పోరాటము, బూర్జువాలకును, కార్మిక వర్గమునకును జరుగుచున్నది. ధనికవర్గ తత్వమే ఈ వర్గసంఖ్యను, బలమును వృద్ధిచేయుచున్నది. వృద్ధి అయి ఈ వర్గమే ధనికవర్గమును ముంచెత్తివేసి వర్గరహిత సంఘమును, సామ్యవాదమును స్థాపించును.

చరిత్రను ఏ దృష్టితో చూడవలెనో మార్క్సు వివరించెనుగదా: దానినే "చరిత్రనుగూర్చి * భౌతికదృష్టి" అనిరి. అది భావవాదము (Idealist) కాదు కాబట్టి భౌతికము (Materialist) అనిరి. మార్క్సు బ్రదికియున్న రోజులలో తత్వశాస్త్రజ్ఞులు భావవాదము (Idealist) అను పదమును తరుచు ప్రత్యేకార్థముతో వాడుచుండిరి. ఆ కాలమున పరిణామ వాదము ప్రజలలో వ్యాపించుచుండెను. అంతర్జాతుల ఉత్పత్తి వృద్ధులను

---

* Materialist Conception of History.

గూర్చినంతమట్టుకు డార్విన్ ప్రజల హృదయములలో పరిణామవాదము నాటెనని ఇదివరలో చెప్పియుంటిని. కాని మానవసంఘ సంబంధములకు కారణముల నిది నిరూపించలేదు. మనస్సుయొక్క అభివృద్ధిని గూర్చిన అస్పష్ట, ఆదర్శక భావములతో కొందరు తత్వశాస్త్రజ్ఞులు మానవాభివృద్ధిని విశదీకరించుటకు ప్రయత్నించిరి. అట్టి విశదీకరణమునకిది సరియైన మార్గము కాదని మార్క్స్ చెప్పెను. అతని అభిప్రాయము ప్రకారము గాలిలో ఊహలు, కల్పనలు ప్రమాదకరములు. ఇట్లు చేసినచో ప్రజలు ఆధార రహితమగు విషయముల ననేకము వూహించుకొందురు. కాన అతడు శాస్త్ర మర్యాద ననుసరించి యదార్థ విషయములను పరీక్షించెను. అందువల్లనే భౌతిక (Materialist) అను పదము వాడబడెను.

స్వార్థోపయోగమును గూర్చియు, వర్గసంఘర్షణలను గూర్చియు మార్క్స్ నిరంతరము మాటాడుచుండును. మన చుట్టుపట్ల మనము చూచుచున్న అన్యాయములకు మనకు కోపమువచ్చును; ఉద్రేకము వచ్చును. మార్క్స్ అభిప్రాయ ప్రకారము కోపము తెచ్చుకొనుటకు గాని, సదుపదేశము చేయుటకుగాని ఇది విషయముకాదు. స్వార్థోపయోగ మనునది స్వార్థోపయోగము చేయుచున్న వాని తప్పుకాదు. ఒక వర్గ మింకొకవర్గముపై అధికారము చెలాయించుట చారిత్రికాభివృద్ధి యొక్క స్వాభావిక ఫలితము. కొన్నాళ్లకిది పోయి వేరొక పద్ధతి వచ్చును. ఒకడు అధికారవర్గమునకు చెందియుండి ఆ కారణమున నితరులను స్వార్థోపయోగము చేసికొన్నట్లయితే అది అతనికి మహాపాప కారణము కాదు. అతడొక సంస్థలో భాగము. అతనిని తిట్టుట భావ్యము కాదు. వ్యక్తులకు, సంస్థలకు ఉండు భేదమును మనము తరుచు మరచిపోవుచుందుము. ఇండియా, బ్రిటిషు సామ్రాజ్యము క్రిందనున్నది. మన శక్తికొలది ఈ సామ్రాజ్యముతో మనము పోరాడవచ్చును కాని ఇండియాలోని ఈ సంస్థను పోషించు ఇంగ్లీషు వ్యక్తులు నిందార్హులుకారు. ఒక

పెద్ద యంత్రములోని చక్రముయొక్క చిన్నపండ్లవంటివారే వారు. దాని చలనమును మార్చుటకు వారికావంతయు శక్తిలేదు. ఈ విధముగానే జమీందారీ పద్ధతి ప్రాతపడి త్రుప్పుపట్టినదనియు, స్వార్థోపయోగము నకై రైతులను పీడింపకు తినుచున్నదనియు మనలోకొందర మనుకో వచ్చును. దీనినిబట్టి వ్యక్తిగతముగా జమీందారులు నిందార్హులుకారు. ఇట్లే స్వార్థోపయోగము చేయుచున్నారని నిందింపబడు పెట్టుబడిదారు లును వ్యక్తిగతముగా నిందార్హులుకారు. ఇందలి దోషము సంస్థలది. వ్యక్తులదికాదు.

వర్గపోరాట మవసరమని మార్క్సు ఆదేశించలేదు. అది యదార్థ ములో ఉన్నదని చూపించెను. ఏదో ఒక రూపముతో అది ఎప్పుడును ఉండెను. 'కాపిటల్' వ్రాయుటలో అతని ఉద్దేశము "నేటి సంఘ గతికి సంబంధించిన ఆర్థిక సిద్ధాంతమును వెల్లడి పరచుటయే". ఇట్లు వెల్లడి చేసినప్పుడు సంఘములోని వివిధ వర్గముల మధ్య చెలరేగిన భీషణ మగు పోరాటములు బయటపడెను. ఈ పోరాటములు వర్గపోరాటము లుగా అన్నివేళల స్పష్టము కాలేదు. ఎందువల్లననగా అధికారవర్గ మెప్పుడును తన వర్గలక్షణమును దాచివేయ ప్రయత్నించును. కాని తత్కాల పద్ధతికి ప్రమాదము సంభవింపనున్నప్పుడు అది తన కపట వేషమును తీసివేయును. దాని నిజలక్షణము బయటపడును. అప్పుడు వర్గములకు ప్రత్యక్షయుద్ధము సంభవించును. ఇది తటస్థించినప్పుడు ప్రజా స్వామిక స్వరూపములు, సామాన్యశాసనములు, తత్పరిపాలనాక్రమము- అన్నియును అంతరించును. కొందరనునట్లు ఈ వర్గ పోరాటములు అపోహవల్లగాని, ఆందోళనపరుల దౌష్ట్యమువల్లగాని సంభవించవు. అవి సంఘమునకు సహజము. వేర్వేరు వర్గముల ప్రయోజనములకు పోరాటములెట్టివో చక్కగా అర్థము చేసికొన్నకొలదియు ఇవి ప్రత్యక్ష ముగా వృద్ధియగుచుండును.

మార్క్సు సిద్ధాంతమును ఇండియాలో నేటి పరిస్థితులకు పోల్చి

చూతము. బ్రిటిషు ప్రభుత్వము, తన పరిపాలన, న్యాయముపైనను, ప్రజల శ్రేయస్సుపైనను ఆధారపడియున్నదని చెప్పుకొనుచుండును. ఈ మాటలలో కొంత యదార్థమున్నదని మన దేశస్థులు పలువురు గత కాలములో నమ్మియుండిరి. ఇప్పుడన్ననో ప్రజల మహోద్యమమొక్కటి ఈ పరిపాలనమును తీవ్రముగా ప్రతిఘటించుటచేత దాని నిజలక్షణము నగ్నముగా, మోటుతనముతో బయల్పడినది. సన్నబాకుపై ఆధారపడిన సామ్రాజ్యవాదుల స్వార్థోపయోగముయొక్క యాదార్థ్యమును ఇప్పుడందరును చూడగలరు. మెరుగు పూతలు, మెత్తని మాటలు తొలగిపోయినవి. ప్రత్యేక ఆర్డినెన్సులును, మిక్కిలి సామాన్య హక్కులైన వాక్స్వతంత్ర్యము, సమావేశ స్వాతంత్ర్యము, వార్తాపత్రికల స్వాతంత్ర్యములను అణచివేయుటయును దేశములో పరిపాటి యైనవి. ఉన్న అధికారమునకు ప్రతిఘటన ఎంత ఎక్కువగానున్న ఇట్టి వంత అధికముగా తటస్థించును. ఇట్లే ఒక వర్గము వేరొకవర్గమును ప్రతిఘటించినప్పుడును సంభవించును. ఇది మనదేశములో నేడు సంభవించుచుండుట చూడగలము. కృషికులపైనను, కార్మికులపైనను, వారికొరకు పనిచేయువారిపైనను వేసిన క్రూరదండనముల చూచిన ఇది స్పష్టమగును.

ఇట్లు చరిత్రకు సంబంధించిన మార్క్సు సిద్ధాంతము నిరంతరము మారుచు వృద్ధినందుచున్న సంఘమునుగురించినది. దానిలో స్థిరతలేదు. అది చలనస్వభావముగల భావన. అది అనివార్యముగా సాగిపోవుచుండును. ఒక సంఘ రచనకు బదులు వేరొక సంఘరచన వచ్చుచుండును. ఒక సంఘరచన పెరగవలసినంత పెరిగి చేయవలసిన పనులన్నియు చేసినపిమ్మట నే అంతరించును. దీనినిమించి సంఘము పెరిగినచో, ప్రాతపద్ధతిలో ధరించిన వస్త్రము లిప్పుడు తనకు సరిపోవు కాబట్టి, తన్ను బంధించిన ఆ బట్టలను చీల్చుకొని బయటపడి తనకు సరిపోవు నూత్న వస్త్రముల ధరించును.

మార్క్సు ప్రకారము, చరిత్రకు సంబంధించిన ఈ మహత్కార్య

మునకు తోడ్పడుట మానవుని విధి (Destiny). వెనుకటి దశలన్ని యును గడచిపోయినవి. చివరి వర్గపోరాటము పెట్టుబడిదారులైన మధ్య తరగతి వారికిని, కార్మికవర్గమునకును ఇప్పుడు జరుగుచున్నది. (పెట్టు బడి విధానము పూర్తిగా అభివృద్ధి చెందిన, అభివృద్ధిలో నున్న పారి శ్రామిక దేశములలోనే ఇది జరుగుచున్నది. పెట్టుబడిదారి విధాన మభి వృద్ధి చెందని ఇతర దేశములు వెకబడియున్నవి. కాన వారి పోరాట ములు సమ్మిశ్రితమై వేరు లక్షణములు కలిగియున్నవి. కాని అక్కడ సైతము ముఖ్యముగా ఈ పోరాటము అంశ భాగములో జరుగుచున్నది. ఇందుకు కారణము ప్రపంచమున అన్యోన్య సంబంధము నానాటికి పెరుగుచున్నది.) కష్టము వెనుకకష్టమును పెట్టుబడిదారి విధానము ఎదుర్కొనవలసి యున్నదనియు,ఒక ప్రమాదస్థితినుండి వేరొక ప్రమాద స్థితికి పోవలసి యుండుననియు, స్వతస్సిద్ధముగా దానిలో సమత్వము (Equilibrium)లేనికారణమున తలక్రిందుగాపడిపోవుననియుమార్క్సు చెప్పెను. మార్క్సు వ్రాసి అరవై సంవత్సములు దాటినవి. నాటినుండి పెట్టుబడిదారి విధానము అనేక ప్రమాదావస్థలకు లోనైనది. కాని అంతరించుటకు బదులది ప్రమాదావస్థల దాటి బ్రదికినది. అది ఇంకను శక్తివంతమైయున్నను, రష్యాలోమాత్రమది అంతరించినది. ఇప్పుడు, ఇది నేను వ్రాయుచున్నప్పుడు, ప్రపంచము నందంతటను అది జబ్బు స్థితిలో నున్నట్లు తోచుచున్నది. బ్రదికి బయట పడునను ఆశ లేదని వైద్యులు శిరఃకంపము చేయుచున్నారు.

పెట్టుబడిదారి విధానము మన కాలమువరకు జీవితమును పొడు గించుకొని బ్రదుకుట కొాక కారణమున్నదనియు, దానిని మార్క్సు పూర్తిగా విచారించలేదనియు చెప్పుదురు. పశ్చిమ ఖండమందలి పారి శ్రామిక దేశములు వలస సామ్రాజ్యములను స్వార్థోపయోగము చేసి కొనుటయే ఈ కారణము. స్వార్థోపయోగమునకు గురియైన బీదదేశము లను కొల్లకొట్టుటచే దానికి నూతన జీవనము, ఐశ్వర్యము అబ్బినవి.

నేటి కాలమున అమలులోనున్న పెట్టుబడిదారి విధానము ననుసరించి, బీదవారిని భాగ్యవంతులును, కార్మికులను పెట్టుబడిదారులును, స్వార్థోపయోగము చేయుట మనము తరుచు గర్హించుచుందుము. ఇది యదార్థాంశమే. కాని ఇందు దోషము పెట్టుబడిదారిది కాదు. ఆ విధానమే స్వార్థోపయోగముపై నాధారపడియున్నది. పెట్టుబడిదారి విధానమునకు మాత్రము ఇది క్రొత్తయని మనము భావించరాదు. వెనుకటి యుగములలో, అన్ని విధానములక్రిందను కార్మికులును, బీదవారును, తప్పనిసరిగ స్వార్థోపయోగమునకు గురియై బాధపడిరి. నిజము చెప్పవలసి వచ్చినచో, పెట్టుబడిదారుల స్వార్థోపయోగ మున్నప్పటికిని వెనుకటికాలములోకంటె వారీకాలమున మెరుగుగానున్నారు. ఇది అతిశయోక్తికాదు.

మార్క్సు తత్వమున కీనాటి వ్యాఖ్యాతశ్రేష్ఠుడు లెనిన్. దానినతడు వ్యాఖ్యానించి విశదపరుచుటయేగాదు;ఆచరణరూపముగా తనజీవితమున చూపెను. అయినను మార్క్సు తత్వము మార్చుటకు వీలులేని సిద్ధాంతముక్రింద భావించరాదని అతడు హెచ్చరిక చేసెను. అందలి సారభూతమగు విషయము యదార్థమని అతడు నమ్మెను. అయినను అనాలోచితముగా, దాని వివరముల నంగీకరించుటకుగాని, వానినన్ని చోట్ల ననుసంధించుటకుగాని అతడు సిద్ధముగాలేడు. అతని మాటలివి—

"మార్క్సు సిద్ధాంతము సంపూర్ణమనియు, నిరాక్షేపణమనియు మేము ఎంతమాత్రము భావించము సరిగదా జీవితమున వెనుకబడుటకు సహించని సామ్యవాదులు సర్వతోముఖముగా ప్రచారము చేయవలసిన శాస్త్రముయొక్క ఒకే ఒక మూలరాయి ఆసిద్ధాంతమని మా విశ్వాసము. రష్యన్ సామ్యవాదులు ముఖ్యముగా మార్క్సు సిద్ధాంతమును స్వతంత్రముగా పఠించుట అవసరమని మా అభిప్రాయము. ఎందువల్లననగా ఆ సిద్ధాంతము దారిచూపు సామాన్యాభిప్రాయములనే పొర్కొనుచున్నది. వాని ప్రయోగము భిన్నముగా నుండును. ఫ్రాంసులో ఒక విధముగాను, దానికి భిన్నముగా ఇంగ్లాండులోను, జర్మనీలో ఒక విధముగాను దానికి

భిన్నముగా ఫ్రాంసులోను, రష్యాలో ఒకవిధముగాను, దానికి భిన్నముగా జర్మనీలోను అది ప్రయోగించబడవచ్చును."

ఈ జాబులో మార్క్సు సిద్ధాంతములగూర్చి నీకు కొంత చెప్ప ప్రయత్నించితిని. కాని ఈ నా అతుకులబొంత నీ కెంతవరకు బోధ పడినదో, నీకు విస్పష్టగా తెలిసినదో లేదో నాకు తెలియదు. నేడు ప్రజా సమూహములను, పురుషులను, స్త్రీలను సంచలన పరచుచుచుండుట చేతను, మన దేశములో మనకిది కొంత సహాయకారిగా నుండవచ్చును గనుకను ఈ సిద్ధాంతములను తెలిసికొనుట మంచిది. గొప్ప జాతియగు రష్యాయును, సోవియట్ యూనియన్ లోని ఇతర భాగములును మార్క్సును ప్రధానప్రవక్తగా చేసికొన్నవి. ప్రపంచమున దుర్భర దుఃఖము తాండవించుచున్న నేటికాలమున, ప్రశమ నౌషధముల వెదకు పలువురు అతనివంక, ఏమైన ప్రశమ నౌషధము స్ఫురింప జేయునేమో యని, చూచుచున్నారు.

ఇంగ్లీషు కవి టెన్నిసన్ వ్రాసిన కొన్ని పద్యపాదములతో నీ జాబు ముగించుచున్నాను—

ప్రాతపద్ధతి మారిపోవును
క్రొత్త పద్ధతి వచ్చితీరును
మంచిదౌ ఆచారమైనా
లోకహానిని చేయకుండా
దేవుడెన్నో మార్గములుగా
చేసికొనును
ఆత్మకార్యము.

135

# ఇంగ్లాండులో విక్టోరియా యుగము

ఫిబ్రవరి 22, 1933

సామ్యవాద భావాభివృద్ధినిగురించి నేను వ్రాసిన లేఖలలో ఇంగ్లీషు తరహా సామ్యవాదము మిక్కిలి మితమైనదని చెప్పియుంటిని. అప్పుడు యూరోపులో ప్రచారమందున్న భావములలో మిక్కిలి తక్కువ విప్లవవంతమైన దిదియే. మంచి పరిస్థితులు వచ్చుటకు క్రమక్రమముగా మార్పు మెల్లగా రావలసియుండునని అది ఊహించియుండెను. వర్తకము హీన స్థితిలో నున్నప్పుడు, మాంద్యస్థితి ప్రబలినప్పుడు, నిరుద్యోగ సమస్య వృద్ధియైనప్పుడు, కూలి తగ్గినప్పుడు, ప్రజలు బాధపడ్డప్పుడు ఇంగ్లాండులో సైతము ఒక్కొక్కప్పుడు విప్లవ తరంగము తలయెత్తెడిది. మంచి పరిస్థితులు నెలకొనుటతోడనే ఇది శమించెడిది. 19వ శతాబ్దిలో ఇంగ్లీషు భావముయొక్క మితత్వము ఇంగ్లాండు ఐశ్వర్యముతో పెనవేసికొనియుండెను. ఐశ్వర్య విప్లవములకు సమానత్వ మెందును పట్టదుకదా! విప్లవమనగా గొప్ప మార్పు. ఉన్న పరిస్థితులతో సంతుష్టి చెందియున్న వారు, వానిని బాగుచేయవచ్చునేమో అన్న ఆశతో ప్రమాదకరమగు సాహసకార్యములలోనికి దిగరు.

నిజమునకు 19వ శతాబ్ది ఇంగ్లాండు ఔన్నత్యమును తెలుపు శతాబ్ది. 18వ శతాబ్దిలో మిగిలిన దేశములకంటె ముందుగా పారిశ్రామిక విప్లవము వచ్చుటవల్ల క్రొత్త ఫ్యాక్టరీలు కట్టి ఇంగ్లాండు నాయకత్వము వహించెను. 19వ శతాబ్దిలో చాల భాగము ఆ నాయకత్వమునది నిలుపుకొనెను. నే నిదివరలో చెప్పినట్లు ఇంగ్లాండు ప్రపంచముయొక్క కార్ఖానా (కర్మాగారము). దూర దేశములనుండి ప్రవాహముకట్టి ధనము ఇంగ్లాండులో పడుచుండెను. ఇండియాను, ఇతర వలస దేశములను స్వార్థోపయోగము చేసికొనుటవల్ల దానికి ధనము ఎడతెగకుండ

లభించెను. అందుచే దాని ప్రతిష్ఠ అతిశయించెను. యూరోపులో దాదాపు అన్ని దేశములలోను మార్పులు కలిగినవిగాని, ఇంగ్లాండు మట్టుకు, చలించని పర్వతమువలె ఎట్టి విప్లవము లేకుండ సాగిపోవుచుండెను. అప్పుడప్పుడు ప్రమాదస్థితులు సంభవించినవి. కాని మరికొందరికి వోటు ఇచ్చి అది తప్పించుకొనుచుండెను. ఈలోపున, మనము చూచినట్లు, ఫ్రాంసులో ప్రజాప్రభుత్వములు, సామ్రాజ్యములు ఒకదానివెనుక నొకటి శీఘ్రముగ వచ్చుచు, పోవుచునుండెను. దీర్ఘయుగముల కాలము వేరు పడియుండి తరువాత ఇటలీ ద్వీపకల్పమంతయును ఒక్కటై ఒకజాతి అయ్యెను. జర్మనీలో ఒక నూతన సామ్రాజ్య మవతరించెను. చిన్న దేశములైన బెల్జియం, డెన్మార్కు, గ్రీసులుకూడ అనేక విధములుగా మారెను. యూరోపులోని నేటికిని ప్రాచీనతమ హాప్సుబర్గు రాజవంశమునకు మూలస్థానమగు ఆస్ట్రియా, అనేక పర్యాయములు ఫ్రాంసు, ఇటలీ, ప్రష్యాలచే పరాజితమయ్యెను. తూర్పున రష్యామాత్రము మారుచున్నట్లు లేదు. అక్కడ నిరంకుశుడగు జార్ గొప్ప మొగల్‌వలె రాజ్యము చేయుచుండెను. కాని పారిశ్రామికముగా రష్యా చాల వెనుకబడియుండెను. అది కృషికజాతి. నూతన భావముల గాలి గాని, నూతన పరిశ్రమ గాలి గాని దాని నింకను స్పృశించలేదు.

ఇంగ్లాండు భాగ్యమువల్ల, దాని సామ్రాజ్యమువల్ల, దాని సముద్రాధిపత్యమువల్ల యూరోపులోను, ప్రపంచములోను దానికి అధికార పురస్సరమగు స్థానము లభించెను. అది నాయకజాతిగానుండెను. దాని దీర్ఘ బాహువులు ప్రపంచ మంతటను వ్యాపించెను. అమెరికా సంయుక్త రాష్ట్రము లింకను తమ కష్టములలో తాము మునిగియుండిరి. స్వదేశాభివృద్ధినిగురించి ఆలోచించుచుండిరి. గాని ప్రపంచ వ్యవహారములలో కలుగజేసికొనుచుండుటలేదు. రవానా పద్ధతులలో ఆశ్చర్యకరమగు మార్పులు వచ్చుచున్నవి. అందుచే ప్రపంచము చిన్నదై, సాంద్రమైనట్లు కనబడుచున్నది. దూరదేశముపై తన పట్టు సడలకుండ బిగించుటకు

ఇంగ్లాండుకివి తోడ్పడినవి. ఇన్ని మార్పులు కలిగినప్పటికిని ఇంగ్లాండు పరిపాలనా వైఖరిలో మార్పు రాలేదు. ఒక * నియమబద్ధ ప్రభువును—అనగా అధికారములేని పాలకుడన్నమాట—సర్వాధికారములతో కూడు కొన్నదని చెప్పబడు పార్లమెంటును, ఇంగ్లండును పాలించుచుండెను. తొలుదొల్త కొద్దిమంది భూస్వాముల చేతను, భాగ్యవంతులగు వ్యాపారుల చేతను పార్లమెంటు ఎన్నుకోబడెడిది. కాని రానురాను, ఈ శతాబ్దిలో, ప్రమాదస్థితి వచ్చినప్పుడెల్ల దానినుండి తప్పించుకొనుటకు ఎక్కువ మందికి వోటు హక్కు ఈయబడినది.

ఈ శతాబ్దిలో చాలభాగమువరకు విక్టోరియా ఇంగ్లాండుకు రాణియై యుండెను. జర్మన్ రాజవంశమైన హనోవరుకు చెందిన దామె. ఈ రాజవంశమే 18 వ శతాబ్దిలో కొందరు జార్జిలను ఇంగ్లీషు సింహాసమునకు ప్రసాదించినది. 1837 లో ఆమె సింహాసన మధిష్ఠించెను. అప్పుడామె పదునెన్మిది వర్షముల కన్య. శతాబ్దాంతము వరకు, 1900 వరకు ఆమె 63 సంవత్సరములు రాజ్యమేలెను. ఈ దీర్ఘకాలమునకు ఇంగ్లాండులో తరుచు విక్టోరియాయుగ మందురు. యూరోపులోను, ఇతర ప్రదేశములందును విక్టోరియా రాణి అనేక గొప్ప మార్పులను చూడగలిగెను. ప్రాతగుర్తులు అంతరించుట, వానిస్థానే క్రొత్తగుర్తులు వచ్చుట ఆమె చూచెను. యూరోపులోని విప్లవములను, ఫ్రాంసులోని మార్పును, ఇటలీ రాజ్యావతరణమును, జర్మన్ సామ్రాజ్యావతరణమును ఆమె చూచెను. ఆమె చనిపోవు కాలమునకు యూరోపుకును, యూరోపియన్ రాజులకును ఆమె అమ్మమ్మవలె నుండెను. విక్టోరియా సమకాలికుడగు వేరొక రాజు యూరోపులో నుండెను. అతని వృత్తాంతము కూడ అట్టిదే. అతడు ఆస్ట్రియా రాజవంశమగు హాప్సుబర్గుకు చెందిన ఫ్రాంసిస్ జోసిఫ్. విప్లవ సంవత్సరమగు 1848 లో శిధిలావస్థలోనున్న తన సామ్రాజ్యమునకు వచ్చుసరికి అతని వయస్సుకూడ పదునెన్మిది

---

* **Constitutional monarch.**

వర్షములే. అతడు 68 సంవత్సరముల కాలము రాజ్యముచేసెను ఆస్ట్రియా, హంగరీ, తనక్రిందనున్న ఇతర భాగములను ఒక్కటిగా చేర్చి, అతడు రాజ్యమేలెను. కాని ప్రపంచ సంగ్రామములో అతడును, అతని సామ్రాజ్యమునుకూడ అంతరించెను.

విక్టోరియా అంతకన్న అదృష్టవంతురాలు. ఆమె రాజ్య కాలమున ఇంగ్లాండు ప్రబలమయ్యెను. ఆమె సామ్రాజ్యము పెరిగెను. ఆమె సింహాసనమెక్కునరికి కెనడాలో క్లిష్ట పరిస్థితు లేర్పడెను. కెనడా వలసరాజ్యము. అది బాహాటముగా తిరుగబడెను. అందలి ప్రజలనేకులు ఇంగ్లాండునుండి చీలిపోయి పొరుగుననున్న అమెరికా సంయుక్త రాష్ట్రములతో కలిసి పోగోరిరి. అయితే ఇంగ్లాండు, అమెరికన్ యుద్ధమునుండి ఒక గుణపాఠము నేర్చుకొనెను. కాన కెనడావారిని శమింప జేయుటకై వెంటనే వారికి చాలవరకు స్వపరిపాలన హక్కునిచ్చెను. వెంటనే అది స్వపరిపాలన చేసుకొను అధినివేశమయ్యెను. సామ్రాజ్యములో ఇది యొక క్రొత్త తరహా ప్రయోగము. ఏలయన స్వాతంత్ర్యమునకు, సామ్రాజ్యమునకును పొత్తుకుదరదు. కాని పరిస్థితుల బలముచే ఇంగ్లాండు చేయక తప్పినదికాదు. లేకున్న కెనడానే వదులుకోవలసి వచ్చెడిది. కెనడాలోని ప్రజలు ఎక్కువమంది ఇంగ్లీషు సంతతివారే కాబట్టి మాతృదేశముతో వారికి ప్రేమానుబంధము గాఢముగానుండెను. ఈ నూతన దేశము గొప్పది. అభివృద్ధికాలేదు. జనసంఖ్య తక్కువ. కాన దేశము నభివృద్ధి పరుచుకొనుటకు ఇంగ్లీషువారి ధనముమీదను, ఇంగ్లీషువారి తయారీసరుకులమీదను అధికముగా అది ఆధారపడియుండవలసియుండెను. కాన ఆ రెండు దేశముల శ్రేయస్సులకును ఎట్టివిధమగు సంఘర్షణ తటస్థించలేదు. వారి మధ్యనున్న వింత బాంధవ్యమునకు యెట్టి చిక్కును తటస్థించలేదు. ఈ శతాబ్దిలోనే కొంతకాలమైన తరువాత పరదేశములలోనున్న బ్రిటిషు వలసరాజ్యములకు స్వపరిపాలన హక్కునిచ్చు పద్ధతిని ఆస్ట్రేలియాకుకూడ ప్రయోగింపబడినది. అది శతాబ్ది

మధ్యకాలమువరకు నేరస్థులనుంచు దేశముగా నుండెను. శతాబ్దాంతమున కది సామ్రాజ్యములో స్వతంత్ర అధినివేశమైనది.

అది యట్లుండగా ఇండియాలో బ్రిటిషువారి పట్టు బిగిసిపోవుచుండెను. దేశమును జయించుటకై పరంపరగా యుద్ధములు చేయుటచే బ్రిటిష్-ఇండియన్ సామ్రాజ్యము విస్తరించెను. ఇండియా బ్రిటిష్‌వారి క్రిందనున్న పరాధీనరాజ్యము. స్వపరిపాలనము ఛాయామాత్రమైన నచ్చట లేదు. 1857 లో తిరుగుబాటు అణచివేయబడెను. సామ్రాజ్య భారము పూర్తిగా ఇండియాచే అనుభవింపజేయబడెను. అనేక విధములుగా ఇంగ్లాండు ఇండియాను స్వార్థోపయోగము చేసికొన్నదని ఇదివరలో చెప్పియుంటిని. అసలు బ్రిటిషువారి సామ్రాజ్యమొక్క ఇండియాయే. ఈ యదార్థ విషయమును లోకమునకు వెల్లడిచేయుట కొరకే విక్టోరియారాణి ఇండియా చక్రవర్తిని అను బిరుదమును వహించెను. ఇండియాకాక, ప్రపంచమున అనేక భాగములలో బ్రిటన్‌కు చిన్న చిన్న ఇతర పరాధీన రాజ్యము లనేక ముండెను.

ఈ విధముగా బ్రిటిషు సామ్రాజ్యము రెండు తరహాల దేశముల వింత కలగూరగంపగా నుండెను—స్వపరిపాలన చేసికొను దేశములు: అవియే తరువాత స్వతంత్రాధినివేశములయ్యెను. పరాధీనరాజ్యములు-రక్షితరాష్ట్రములు. మొదటి స్వతంత్రాధినివేశములు మాతృదేశము యొక్క పెత్తనమును ఒప్పుకొనుచు, ఒకవిధముగా ఒక్క కుటుంబములోని మనుష్యులవలెనే యుండిరి. రెండవ రకము రాజ్యములు-అనగా పరాధీన రాజ్యములును, రక్షిత రాష్ట్రములును ఈ సంస్థలో సేవకులుగను, బానిసలుగను ఉండిరి. వారిని నీచులుగా పరిగణించుచుండిరి; వారిని దురాదరణ చేయుచుండిరి; వారిని స్వార్థోపయోగము చేసికొనుచుండిరి. స్వతంత్రాధినివేశములలో ఉన్నవారు బ్రిటిష్ మనుష్యులు, యూరోపియనులు, వారి సంతతివారును. పరాధీన రాజ్యములలో నున్నవారు బ్రిటిషువారుకారు:యూరోపియనులునూకారు. బ్రిటిషు సామ్రాజ్యమందలి

ఈ రెండు భాగములకు నుండు విభేదము నేటివరకు నిలిచియున్నది.

తన భాగ్యముతో, తన సామ్రాజ్యముతో ఇంగ్లాండు ఒక విధముగా సంతుష్టిచెందిన అగ్రరాజ్యముగా నుండెను. పూర్తి సంతుష్టకాదు. ఏలయన సామ్రాజ్యవాది సహజగుణము పొలిమేరలతో తృప్తి పొందునది కాదు. నిరంతరము విస్తరించుటకే కోరుచుండును.అయినను ఇంగ్లాండు బెంగ ఎక్కువ గ్రహించుటకుకాదు. ఉన్నదానిని రక్షించుకొనుటకే. ముఖ్యముగా ఇండియా దానికున్న అమూల్యమగు ఆస్తి. చివరివరకు దానిని పట్టుకొని యుండవలెననియే దాని అభిలాష. ఇండియా తన ఆస్తిగా ఉండుట, తూర్పునకున్న సముద్రమార్గములు సురక్షితముగా నుండుట—అను ఈ రెండు విషయముల ననుసరించియే ఇంగ్లాండు విదేశాంగ నీతియంతయు నడుచుచుండెను. ఈజిప్టు వ్యవహారములలో అనవసరముగా అది జోక్యము కలిగించుకొనెను. చివరకు ఆ దేశముపై అధికారము చెలాయించెను. అందుకు కారణమిదియే. అట్లే పర్షియాలోను, ఆఫ్ఘనిస్థానములోను అది కలుగజేసికొనెను. చాకచక్యముతో అది సూయజ్ కెనాల్ కంపెనీ వాటాలను కొనివేసెను. అట్లు ఆ కాలువపై అధికారమును సంపాదించెను.

19వ శతాబ్ది అధిక భాగము యూరోపులో రాజ్యములు దాదాపన్నియు ఇంగ్లాండును వేధించలేదు. వారి కష్టములలో వారు మునిగి యుండిరి. ఒకరితో నొకరు పోరాడుచుండిరికూడ. యూరోపు రాజ్యముల తుల్యత నిలుపుటకొరకై ఒక రాజ్యమును వేరొకరాజ్యముపైకి పురిగొల్పుచు, ఆ యా రాజ్యములకుండు అన్యోన్య స్పర్థలవల్ల తాను లాభము పొందుచు,ఇంగ్లాండు తనసంప్రదాయసిద్ధమగు నాటకమాడుచునేయుండెను. ఫ్రాంసురాజు నెపోలియన్ III ప్రమాదమును తెచ్చునట్లు తోచెను. కాని అతడు మట్టమయ్యెను. తేరుకొనుటకు ఫ్రాంసుకు కొంతకాలము పట్టినది. జర్మనీ ఇంకను బాల్యావస్థలో నుండుటచే తీవ్రప్రతిస్పర్థిగా నూహింప నవసరములేకుండెను. కాని ఒక్క దేశముమాత్రము బ్రిటిష్

సామ్రాజ్యమును ఎదురించునట్లు కనిపించెను. అది జారు పరిపాలన మందున్న రష్యా: వెనుకబడ్డ రష్యా. అయినను దేశపటములలో గొప్ప దేశముగా నది కనిపించుచున్నది. ఇంగ్లాండు, ఇండియాకును, దక్షిణ ఆసియాకును వ్యాపించగా రష్యా, ఉత్తర ఆసియాకును, మధ్య ఆసియాకును వ్యాపించెను. దాని పొలిమేర ఇండియాకు దూరముగాలేదు. రష్యా ఇంత సమీపములో నుండుట బ్రిటిష్‌వారికి నిరంతరము భీతి జనకముగా నుండెను. ఇండియానుగురించి ముచ్చటించునప్పుడు బ్రిటిష్‌వారు ఆఫ్ఘనిస్థానముపై దండయాత్రలు చేసిన వైనమును, ఆఫ్ఘన్ యుద్ధముల గురించియు చెప్పియుంటిని. ఇవి అన్నియును జారు పరిపాలనమందున్న రష్యాకు భయపడి చేసిన కార్యములే.

యూరోపులోకూడ ఇంగ్లాండు, రష్యాలు గ్రుద్దులాటలలోనికి దిగిరి. సంవత్సరము పొడుగునను పనికివచ్చునట్టియు, శీతకాలమున మంచు గడ్డ కట్టుకుపోని నీళ్లుగలట్టియు ఒంచి సముద్రరేవు తనకు కావలెనని రష్యా ఉవ్విళ్లూరుచుండెను. విశాలమగు భూభాగము దానికున్నను దాని రేవులన్నియు ఆర్కిటిక్ మండలము సమీపమున నుండుటచే సంవత్సరములో కొంత భాగము గడ్డకట్టుకొని పోవుచుండెను. సముద్రమును చేరకుండ ఇండియా, ఆఫ్ఘనిస్థానములలో బ్రిటిష్‌వారు దాని నటకాయించిరి. పరిష్యాలోకూడ అట్లే చేసిరి. బోస్ఫొరస్, డార్డినెల్సులు టర్కీవారి అధీనమందుండుటచే నల్ల సముద్రమువల్ల ప్రయోజనములేకుండెను. వెనుకటి కాలమున అది కాంస్టాంటినోపిల్ గ్రహించుటకు ప్రయత్నించెను. కాని టర్కీ తా నెదిరించలేనంత బలాఢ్యముగానుండెను. ఇప్పుడు టర్కీ దేశస్థులు దుర్బలులై యుండిరి. దాని అభీష్టము నెరవేరునట్లే కనిపించెను. దానిని గ్రహించుటకది ప్రయత్నించెను. కాని ఇంగ్లాండు అడ్డువచ్చెను. స్వప్రయోజన పరత్వముతో ఇంగ్లాండు టర్కీని వెనుక వేసికొనివచ్చెను. 1854 లో క్రిమియాలో జరిగిన యుద్ధము వల్లను, మరియొక్క యుద్ధము రానున్నదను బెదిరింపు వల్లను, రష్యా

వెనుకడుగు వేసెను.

1854—1856 సంవత్సరములలో క్రిమియన్ యుద్ధము జరుగు చున్నప్పుడే ఫ్లారెన్సు నైటింగేల్, క్షతగాత్రుల ఉపచారార్థమై, ధైర్య సాహసములుగల ఐచ్ఛిక సేవికలను చేర్చి వారికి నాయకత్వమువహించెను. ఆ కాలమున నిట్లు చేయుట అసాధారణ కార్యమే. ఏల యన విక్టోరియా కాలమునాటి మధ్యతరగతి స్త్రీలు ఇల్లువిడిచి బయటికి వచ్చిన వారు కారు. ఫ్లారెన్సు నైటింగేల్ పలువురను బయటికి లాగి ఉత్సాహముతో సేవచేయుట వారికి నేర్పెను. కాన స్త్రీల ఉద్యమాభివృద్ధిలో ఆమెకు ప్రముఖస్థానము కలదు.

బ్రిటన్‌లో ఉన్నప్రభుత్వమును నియమబద్ధ ఏకాధిపత్యమందురు. లేదా, "కిరీటము ధరించిన ప్రజాప్రభుత్వము" అందురు. దీని కర్థము కిరీటము ధరించినవానికి నిజమగు అధికారము లేదు. అతడు పార్లమెంటు నమ్మిన మంత్రుల అభిప్రాయములను తన నోటితో తెలుపువాడు మాత్రమే. రాజకీయముగా అతడు (లేదా ఆమె) మంత్రుల చేతులలో కీలుబొమ్మగా మాత్రమే ఉండువాడు."రాజకీయముల కత దతీతుడు"అని చెప్పుదురు. నిజమునకు తెలివితేటలు కలవాడును, ఇచ్ఛాశక్తి కలవాడును పట్టి కీలుబొమ్మగా ఉండజాలడు. ఇంగ్లీషు రాజుకాని, రాణికాని, రాజ్య వ్యవహారములలో కలుగజేసికొనుటకు అవకాశము లనేకమున్నవి. కాని ఇది అంతయు సాధారణముగా తెర మరుగున జరుగును. ఎంతోకాలము గడచిన పిమ్మటకాని ప్రజలకది తెలియరాదు. బహిరంగముగా కలుగ చేసికొన్నచో దాని నెంతమాత్రము సహించరు సరిగదా ఏకాధిపత్యమునకే మోసమువచ్చును. నియమబద్ధైకాధిపతి కుండవలసిన గొప్ప లక్షణము కౌశలముతో వ్యవహరించుట. ఇది ఉన్నయెడల అతడు పరిపాలనా కార్యము సాగించవచ్చును. అనేక విధములుగా తన అభిప్రాయములను ఒప్పించవచ్చును.

రాజ్యాంగ వ్యవస్థను బట్టియు, న్యాయశాస్త్రమును బట్టియు ప్రజా

ప్రభుత్వములయొక్క అధిపతులు (Presidents) (అమెరికా సంయుక్త రాష్ట్రాధి పతివలె), పార్లమెంటరీ దేశముల కిరీటధారులకంటె అనేకరెట్లు ఎక్కువ అధికారముకలవారు. కాని ప్రెసిడెంట్లు తరుచు మారుచుందురు. రాజులన్ననో, చిరకాలముందురు. ఒక్క మార్గములో రాజ్య వ్యవహార ములను నిరంతరము నడిపించుటకై అతడు అంతరంగమున ప్రయ త్నించ వచ్చును (సంఘములో అత డగ్రగణ్యుడు గాన). కుట్రలు పన్నుటకును, సాంఘికముగా ఒత్తిడి తీసికొని వచ్చుటకును రాజునకు అవకాశము లనేకమున్నవి. నిజమునకు రాజాస్థానముల వాతావరణ మంతయును అధికారతత్వముతో, అగ్రమర్యాదలతో, బిరుదులతో, వర్గములతో నిండియుండును. దేశమున కంతకును ఇదియే ఒజ్జబంతి. దీనితో సాంఘిక సమానత్వమునకును, వర్గముల తొలగింపునకును పొత్తు కుదురదు. ఇంగ్లీషువారి మనస్తత్వమునకొక రూపమిచ్చుటకును, సంఘ మున వర్గ విభాగ మంగీకరించుటకును చాలవరకు కారణ భూతమైనది ఇంగ్లాండులోని రాజస్థానమే అనుటకు సందేహములేదు. లేకున్నచో బహుశా ఒకదానిపై నొకటిగా వర్గముల నంగీకరించుటవల్లనే, రాజత్వ సంస్థ ఇంగ్లాండులో నిలిచియుండగలిగినది. ప్రపంచమందలి పెద్ద దేశము లన్నిటను అది అంతరించినప్పటికిని, "ప్రతి ఇంగ్లీషు వాడును ఒక ప్రభువును ప్రేమించును"అను ప్రాత సామెత ఒకటి కలదు. దానిలో చాల సత్యమున్నది. యూరోపులోగాని, అమెరికాలోగాని, బహుశా జపాను, ఇండియాలు వినా ఆసియాలోగాని, ఇంగ్లాండులో ఉన్నంత తీవ్రముగా వర్గవిభేదములు కానరావు. రాజకీయ ప్రజాస్వామికము నందును, పారిశ్రామికత్వమునందును వెనుకటికాలముతో నాయకత్వము వహించిన ఇంగ్లాండు సాంఘికముగా ఇంత వెనుకబడుటయు, ఇంత సంప్రదాయ పరత్వముతో నుండుటయు వింతగానున్నది.

బ్రిటిష్ పార్లమెంటును "పార్లమెంట్ల తల్లి" అందురు. దీర్ఘము, గౌరవప్రదము అగు జీవితముదానిది. అనేక విషయములలో రాజు

నిరంకుశత్వమును ఢీకొని, పోరాడి మార్గదర్శియైనది. నిరంకుశత్వము నకు బదులు పార్లమెంటుయొక్క స్వల్ప జనాధిపత్యము వచ్చినది— అనగా కొద్ది భూస్వాములయొక్కయు, పాలకవర్గమువారియొక్కయు పాలనము. అప్పుడు ప్రజాస్వామికము మేళ తాళములతో వచ్చినది. ఎన్నో పోట్లాటలు జరిగిన పిమ్మట, ప్రజలలో బహుసంఖ్యాకులకు, కామన్సు సభకు సభ్యుల నెన్నుకొనుటకు వోటు హక్కు ఈయబడెను. పర్యవసాన మేమనగా నిజమగు ప్రజాస్వామికాధికారము వచ్చుటకు బదులుగా భాగ్యవంతులగు పారిశ్రామికుల చేతులలోనికి పార్లమెంటు పోయినది. ప్రజాస్వామికమునకు బదులు ప్లూటోక్రసీ (ధనికాధిపత్యము) వచ్చి పడినది.

శాసన నిర్మాణ, పరిపాలనాకార్యములు నిర్వహించుటకు బ్రిటిష్ పార్లమెంటు ఒక వింత విధానమును కనిపెట్టి వృద్ధిచేసినది. ఇదియే రెండు పార్టీల విధానము. ఈ రెండు పక్షములకును భేదమెక్కువగా లేదు. విభిన్న సూత్రములకై వారెన్నడును వేరుపడలేదు. ఈ రెండు పక్షములవారును భాగ్యవంతులే. అమలులో నున్న సంఘ విధానము నంగీకరించినవారే. ఒక పక్షములో ప్రాత భూస్వాముల సంఖ్య అధికము. రెండవ పక్షములో భాగ్యవంతులగు ఫ్యాక్టరీ యజమానుల సంఖ్య అధికము. కాని వారిలో విభేదములు బహుస్వల్పము. వారిని టోరీస్ అనియు, విగ్సు అనియు పేర్కొనెడివారు. తరువాత 19వ శతాబ్దిలో వారికే సంప్రదాయపరులు(Conservatives)అనియు, లిబరల్సు అనియు పేళ్లు వచ్చినవి.

మిగత యూరోపియన్ దేశములలో పరిస్థితులు భిన్నముగా నుండెను. నిజమగు పార్టీలు భిన్న కార్యకలాపముతో, భిన్నాదర్శములతో, పార్లమెంటులలోను, బయటను ఒకరితోనొకరు ఉద్రేకముతో పోరాడుచుండిరి. కాని ఇంగ్లాండులో ఇదంతయు ఒక కుటుంబ చర్య క్రింద నడిచిపోయెను. ప్రతిఘటన ఒకవిధమగు సహకారమయ్యెను.

ప్రతీ పక్షమును వరుసగా అధికారమునకువచ్చుచు, ప్రతిఘటించుచు ఉండెను. రెండు పక్షములును భాగ్యవంతుల పక్షములగుటచే బీదవారికిని, భాగ్యవంతులకును నిజమగు సంఘర్షణ, వర్గపోరాటము పార్లమెంటులో ప్రదర్శనకాలేదు. ప్రజల ఉద్రేకమును పెంపొందించుటకు మత సమస్యలు చెప్పుకొనదగిన వేవియులేవు. భిన్నజాతుల సమస్యలుగాని, జాతీయ సమస్యగాని లేవు (యూరోపులోనున్నట్లు). ఉద్రేకమునకు నిజమగు కారణము శతాబ్దిలో తరువాత కాలమున ఐరిష్ జాతీయ సభ్యులవల్ల ప్రవేశపెట్టబడినది. ఐర్లండు స్వాతంత్ర్యము వారికి జాతీయ సమస్య అగుట అందుకు కారణము.

అట్టి ప్రబలమగు భాగ్యవంతుల రెండు పార్టీలు పార్లమెంటుకు సభ్యులను నిలబెట్టినప్పుడు, స్వతంత్ర వ్యక్తులుగాని, చిన్న సమూహములుగాని ఎన్నుకోబడుట మిక్కిలి కష్టమగును. ప్రజాస్వామికమున్నను, వోటు ఉన్నను, బీదవోటరు కిందులో ప్రమేయములేదు. రెండు పక్షములలో ఒకపక్షము నిలబెట్టిన అభ్యర్థికి అతడు వోటు చేయవచ్చును. లేదా ఇంట కూర్చుండి వోటు వేయుట మానుకోవచ్చును. పార్లమెంటులో ఈ పార్టీల సభ్యులకు స్వేచ్ఛ ఏమియు లేదు. వారిపార్టీ యజమాని ఉత్తరువులను పాలించి వారు, వోటు వేయవలసియుండును. అంతకన్న వారు చేయునదేదియు లేదు. ఈ యొక్క విధముగానే తమ పక్షములో ఐకమత్యమును వృద్ధి చేసికొనగలరు. ఎదిరి పక్షమును ఓడించుటకు తగిన బలమును సంపాదించుకోగలరు. ఇట్లు అధికార పదవులందగలరు. ఇట్టి ఐకమత్యమును, సమత్వమును మంచివన్న మాట నిజమే కాని, నిజమగు ప్రజాస్వామికమున కది చాలదూరము.

ప్రజాస్వామికాభివృద్ధికి మాదిరిగా తరుచు చూపబడు ఇంగ్లాండులో సైతము ప్రజాస్వామికము మహా గొప్ప విజయవంతముకాలేదు. ·దొరతనముయొక్క గొప్ప సమస్య, తమ్ము పాలించుటకై అత్యుత్తములను సంతుష్టికరముగా ప్రజలెన్నుకొనుట ఎట్లని. ఈ సమస్యకు తృప్తికర

మగు పరిష్కారము కుదురలేదు. ప్రజాస్వామికము కార్యరంగమునకు దిగినప్పుడు, బహిరంగోపన్యాసములుగా, అరుపులుగా తేలినది. తనకు తెలియని వానికి ఓటు నిచ్చుటకు తెలియని ఓటరును ప్రేరేపించుటకే ఇది యంతయును.

జనరల్ ఎలక్షనులు బహిరంగముగా జరుగు ఏలము పాటలని అందురు. అచ్చట అన్నివిధములగు వాగ్దానములు చేయబడును. అయినను ఇన్ని దోషములున్నను ఈ అబద్ధపు ప్రజాస్వామికము సాగిపోయెను. ఇందుకు కారణము ఇంగ్లాండు భాగ్యవంతమైయుండుట. ఈ భాగ్యమువల్లనే ఈ విధానము విచ్ఛిత్తికాలేదు. ఒకవిధమగు సంతుష్టిని కూడ చేకూర్చెను.

19 వ శతాబ్ది రెండవ భాగములో ఇంగ్లీషు రాజకీయ పక్షములకు మహా నాయకు లిద్దరు—డిస్రేలి, గ్లాడ్‌స్టనులు. డిస్రేలి (తరువాత ఎరల్ ఆఫ్ బీకన్సు ఫీల్డు అయ్యెను) సాంప్రదాయిక పక్షనాయకుడు. అనేక పర్యాయములు ప్రధానమంత్రి అయ్యెను. అతనిపట్ల ఇది మిక్కిలి అద్భుత కార్యము. ఏలయన అతడు జ్యూ. గొప్పవారితో సంబంధ బాంధవము లున్నవాడు కాడు. జ్యూలన్న ఇంగ్లీషువారి కిష్టములేదు. కాని స్వసామర్థ్యము వల్లను, పట్టుదలవల్లను తనపైనున్న ప్రాతికూల్యత లేకుండ చేసికొనెను. ప్రథమశ్రేణికి పట్టుదలతో వచ్చెను. అతడు పెద్ద సామ్రాజ్యవాది. అతడే విక్టోరియాను ఇండియాకు చక్రవర్తినిగా జేసెను. గ్లాడ్‌స్టన్ భాగ్యవంతమైన ఒక ప్రాచీన ఇంగ్లీషు కుటుంబమునకు చెందినవాడు. అతడు లిబరల్ పార్టీకి నాయకుడయ్యెను. అనేక పర్యాయములు ప్రధానామాత్యుడుగాకూడ నుండెను. సామ్రాజ్యతత్వము, విదేశాంగ నీతి విషయములో గ్లాడ్‌స్టన్, డిస్రేలి లకు వంశ విభేదములేదు. కాని తన సామ్రాజ్యతత్వము విషయమై డిస్రేలి కుండ బ్రద్దలుకొట్టి చెప్పువాడు. గ్లాడ్‌స్టన్ అచ్చాణీ ఇంగ్లీషువాడగుటవల్ల తన సామ్రాజ్యవాదమును చక్కని వాక్యములతోను, ధర్మ బోధనలతోను కప్పిపుచ్చువాడు. తాను

చేసిన ప్రతి కార్యమునకును భగవంతుడే ప్రధాన సలహాదారుడని అతడు చెప్పువాడు. బాల్కనులలో టర్కీవారి దౌర్జన్యములపై అతడు గొప్పగా వ్యతిరేక ప్రచారముచేసెను. డిజ్రేలి ప్రతిపక్షమున నుండుటచే టర్కీల పక్ష మవలంబించెను. నిజమున కిందలి దోషము టర్కీవారిదిని, బాల్కనులలో నుండు వివిధ జాతులకు చెందిన ప్రజలదిని. వా రొకరి తర్వాత ఒకరు భయంకరమగు హత్యలు, దౌర్జన్యములు చేసియుండిరి.

ఐర్లాండుకు హోంరూలు అవసరమని వారి పక్షమున పోరాడిన వాడును గ్లాడ్‌స్టనే. అతడు దానిని సాధించలేకపోయెను. ఇంగ్లీషువారి ప్రతికూలత అధికముగా నుండుటచే లిబరల్ పక్షము రెండు భాగములుగా చీలిపోయెను. అందొక భాగము సాంప్రదాయకీ పక్షముతో చేరెను. వారినే ఇప్పుడు యూనియనిస్టులు అందురు. ఐర్లాండుతోకలిసి యుండవలెననియే వారు కోరుటచే వారికాపేరు వచ్చినది.

ఇంకను నీకు దీనిని గురించియు, విక్టోరియా యుగమునందలి ఇతర సంఘటనల గురించియు ముందు లేఖలో చెప్పవలసియున్నది.

## 136

## ఇంగ్లాండు ప్రపంచ ఋణదాత అగుట

ఫిబ్రవరి 23, 1933

19 వ శతాబ్దిలో ఇంగ్లాండు ఐశ్వర్యము దాని పరిశ్రమలవల్లను, వంశరాజ్యములను, పరాధీనరాజ్యములను, స్వార్థోపయోగము చేసికొనుటవల్లను కలిగెను. ముఖ్యముగా పెరుగుచున్న దాని ఐశ్వర్యము నాలుగు పరిశ్రమలపై నిలిచియుండెను. వానిని ఆధార (basic) పరిశ్రమలనవచ్చును. ఇవి ప్రత్తి, బొగ్గు, ఇనుము, ఓడల కట్టుట అనునవి. వీని ననుసరించియు, ప్రత్యేకముగాను ఇతర పరిశ్రమ లనేకము పెరిగెను. పెద్ద వర్తక శాలలు, బ్యాకింగ్ గృహములు నిర్మింపబడెను. ప్రపంచ మందన్ని భాగములందును, బ్రిటిష్ సరకునేగాక ఇతర పారిశ్రామిక

దేశములలో తయారైన సరకును కూడ మోసకొనుపోవు బ్రిటిష్ వర్తక నావలుండెను. ప్రపంచములోని వర్తకపు సరకును మోసికొనిపోవుటకు ముఖ్యముగా అవియేయుండెను. లండనులోనున్న లాయడ్సు పెద్ద భీమా ఆఫీసు ప్రపంచమందలి నావలన్నిటికి కేంద్రస్థానమయ్యెను. ఈ పరిశ్రమలు, ఈ వర్తకములు పార్లమెంటును తమ స్వాధీనములో నుంచుకొనెను.

ధనము దేశములోనికి పారసాగెను. పై తరగతులు, మధ్య తరగతులు నానాటికి భాగ్యవంతులైరి. ధనములో కొంతభాగము కార్మిక వర్గములకుకూడ చేరెను. వారి జీవిత మానము హెచ్చెను. భాగ్యవంతులకు వచ్చుచున్న ధనమునంతయు ఏమి చేయవలెను? ఉపయోగించక ఉండ నుంచుట అవివేకము కాన ప్రతివాడును పరిశ్రమను వృద్ధిచేయుటకే పూనుకొనెను. సరుకు నానాటికి తయారు చేయుచుండెను; నానాటికి అధికలాభములు పొందుచుండెను. ఈ ధనములో పెద్దభాగము ఇంగ్లాండు, స్కాట్లాండులలో క్రొత్త ఫ్యాక్టరీలకు, రైల్వేలు మున్నగు వానికి వినియోగమయ్యెను. కొంతకాలమైన పిమ్మట ఫ్యాక్టరీలు దేశములో అసంఖ్యాకముగా పెరిగి దేశము పూర్తిగా పారిశ్రామిక మైనప్పుడు, పోటీ ఎక్కువగుటచే లాభము తగ్గుట సహజమేకదా! పెట్టుబడిదారులు తమ ధనముతో అన్యదేశములలో పెట్టుబడి పెట్టి ఇంతకన్న ఎక్కువలాభములు తీయవచ్చునేమోనని చూచిరి. అట్టి సావకాశము లనేకముండెను. ప్రపంచమందంతటను రైల్వేలు, కేబిల్సు టెలిగ్రాఫులు, ఫ్యాక్టరీలు కట్టుచుండిరి. బ్రిటనులోనున్న అదనపు ధనము యూరోపు, అమెరికా, ఆఫ్రికా, బ్రిటిష్‌వారి పరాధీన రాజ్యములలోని పైకార్యములకై విరివిగా వెళ్లెను. అమెరికా సంయుక్త రాష్ట్రములు, ధనవస్తు సంపత్తి కలవాఁగుటచే త్వరత్వరగా వృద్ధినందుచుండిరి. వారి రైల్వేలు మున్నగు వానికి బ్రిటిష్ ధనములో ఎక్కువ భాగమును వినియోగించుకొనిరి. దక్షిణ అమెరికాలో, ముఖ్యముగా ఆర్జెంటైనులో బ్రిటిష్‌వారు బ్రహ్మాండమగు

వలస తోటలకు యజమానులు. కెనడా, ఆస్ట్రేలియాలు బ్రిటిష్ పెట్టుబడితోనే అభివృద్ధి పరుపబడినవి. చీనాలో "సమ్మతుల యుద్ధము"ను * గురించి నీకు కొంత చెప్పియుంటిని. ఇక ఇండియాసంగతి చెప్పుట ఏల? బ్రిటిషువారు సర్వాధికారులు. రైల్వేలకని, ఇతర పనులకని విపరీతమగు షరతులు పెట్టి అప్పులు ఇచ్చిరి.

ఈ విధముగా ఇంగ్లాండు ప్రపంచమున కంతకును ఋణదాత అయ్యెను. లండను ప్రపంచమునకు ద్రవ్యవ్యాపార రంగము (Money market) అయ్యెను. ధనము అప్పు ఇచ్చినప్పుడు వెండి, బంగారాలతో నిండిన పెద్ద సంచులు ఇంగ్లాండునుండి ఇతర దేశములకు పంపువారేమోనని భ్రమ పడకు. నేటి వ్యాపార మీ విధముగా జరుగదు. చాలినంత వెండి, బంగారములును ఉండవు. తెలివితక్కువ మనుష్యులు వెండి, బంగారాలకు అధిక ప్రాముఖ్య మిచ్చెదరు. వెండి బంగారాలు మారకము (exchange) నకును, సరుకు పరివర్తనమునకును సాధనములు మాత్రమే. ఎవరును వానిని తినలేరు, ధరించలేరు. ఏవిధముగాను వాడలేరు. ఆభరణములుగా మాత్రము వానిని ధరించుటకద్దు. దానివల్ల ఎవరికిని ప్రయోజనములేదు. ఉపయోగించుటకు పనికివచ్చు వస్తువులను కలిగియుండుటయే నిజమగు ధనము. కాన ఇంగ్లాండు, అనగా బ్రిటిష్ పెట్టుబడిదారులు, ధనమును అప్పిచ్చిరనగా వారు పరదేశమందలి రైల్వేకో, పరిశ్రమకో కొంత సొమ్ము పెట్టుబడి పెట్టిరని అర్థము. నగదు ఇచ్చుటకు బదులు బ్రిటిష్ సరుకు పంపుచుండిరి. బ్రిటిష్ యంత్రములును, రైల్వే సామానును ఈ విధముగా పరదేశములకు పంపబడును. ఈ పద్ధతి బ్రిటిష్ పరిశ్రమకు అనుకూలముగా నుండెను. ఇంతేకాదు. పెట్టుబడి పెట్టగల బ్రిటిష్ వారికి మంచి లాభమునకు తమ వద్దనున్న అదనపు సొమ్ము పెట్టుబడి పెట్టుటకు అవకాశములు చిక్కినవి.

* **Battle of Concessions.**

అప్పిచ్చుట లాభకరమగు వ్యాపారము. ఈ వృత్తి అధికముగా అవలంబించినకొలదియు అది ఎక్కువగా భాగ్యవంతమగుచునే ఉండెను. తీరికజనుల సంఖ్య పెరిగిపోయెను. వ్యాపారములనుండి వచ్చు లాభములు, డివిడెండులమీదనే వారు పూర్తిగా జీవించుచుండిరి. దేనిని ఉత్పత్తి చేయుటకును వారు పనిచేయవలసిన అవసరములేదు. ఏదో ఒక రైల్వే కంపెనీలోనో, టీ వలస తోటలోనో, ఇతర వ్యాపారములోనో వారి వాటాలుండును. క్రమము తప్పక వారికి డివిడెండులు వచ్చుచుండును. ఈ తీరిక జనుల వలసలు అనేకమగు మంచిచోట్ల వెలిసెను. ఫ్రెంచి రివీరా, ఇటలీ, స్విట్జర్లాండు అట్టి వలసలు. కాని వీరిలో పలువురు ఇంగ్లాండులోనే ఉండిపోవుచుండిరి.

ఇంగ్లాండువద్దనుండి ఈ విధముగా అప్పు తీసికొన్న దేశము లన్నియు దానిపై వడ్డీనిగాని, డివిడెండులుగాని ఎట్లిచ్చుచుండిరి? వారు వెండి, బంగారాలు పంపలేరుగదా: ప్రతి సంవత్సరమును నగదుగా ఇచ్చుటకు వారివద్ద కావలసినంత వెండి, బంగారాలుండవుకాన వారు సరుకులతో ఇచ్చుచుండిరి. తయారైన సరుకుగాదు. ఏలయన ఇంగ్లాండు సరుకులు తయారుచేయు దేశములలో అగ్రగణ్యము. కాన భోజన పదార్థములతో, ముడి పదార్థములతో ఇచ్చుచుండిరి. గోధుమలు, టీ, కాఫీ, మాంసము, పండ్లు, సారాలు, ప్రత్తి, ఊలు మున్నగునవి నిరంతర ప్రవాహముగా వచ్చి ఇంగ్లాండులో పడుచుండెను.

రెండు దేశముల మధ్య వాణిజ్యమనగా సరకుల మార్పుదలయే. ఒకదేశము ఎప్పుడును కొనుటగాని, రెండవ దేశము ఎప్పుడును అమ్మటగాని సంభవింపదు. ఇట్లు చేయుటకు ప్రయత్నించినచో వెండి, బంగారాల రూపమున ధనము చెల్లించవలసియుండును. కొద్ది కాలములోనే చెల్లించుటకు వెండి, బంగారాలుండవు. లేదా ఒకవైపునుండి సాగే వర్తకము ఆగిపోవలసియుండును. ఒండొరులతో చేయు వర్తకము నందు మారకముండును గనుక పరిస్థితులు సర్దుకొనును. ఈ మారక

మొకప్పు డొక దేశమునకు. వేరొకప్పుడు రెండవదేశమునకును అనుకూలముగా నుండును. 13 వ శతాబ్దిలో ఇంగ్లాండు చేసిన వర్తకమును పరీక్షించినచో అది మొత్తముమీద బయటకు పంపిన సరుకులుతక్కువ అనియు, తాను పొందిన సరుకులు అధికమనియు తేలును. అనగా సరుకులు సముదాయము నధికముగా నది ఎగుమతి చేసినప్పటికిని యదార్థమునకు విలువగల ఎక్కువ సరుకుల నది దిగుమతి చేసికొనుచుండెను. విశేషమేమనగా అది ఎగుమతి చేయు సరుకులు తయారీ సరుకులు. ముఖ్యముగా దిగుమతి చేసికొనునవి భోజన పదార్థములు, ముడి పదార్థములును. ఇట్లు పైకి మట్టుకు అది అమ్మిన సరుకుకంటె కొన్నసరుకు అధికముగా నున్నట్లు కనిపించును. వర్తకము చక్కగా చేయుటకిది మార్గము కాదనిపించును. కాని నిజమునకు అదనముగా దిగుమతియైన సరుకులు, అప్పిచ్చిన ధనముపై వచ్చిన లాభముగు చున్నవి. అప్పుతీసుకొన్న దేశములును, ఇండియావంటి పరాధీన రాజ్యములును చెల్లించే కప్పమిది.

పెట్టుబడులపై వచ్చిన లాభమంతయు ఇంగ్లాండుకు వచ్చుట లేదు. అందులో చాలభాగము అప్పుతీసికొన్న దేశములోనే ఉండును. బ్రిటిషు పెట్టుబడివారు లా లాభమును తిరిగి పెట్టుబడి పెట్టుచుండిరి. ఈ విధముగా ఇతర దేశములలో బ్రిటిష్‌వారి పెట్టుబడులు దినదినాభివృద్ధి నందుచుండెను. ఇంగ్లాండునుండి క్రొత్తగా ధనమునుగాని, సరుకునుగాని పంపించవలసిన అవసరము లేకుండెను. ఇండియాలో బ్రిటిష్ పెట్టుబడులు రైల్వేలమీద, కాలువలమీద అనేకమగు ఇతర పనులమీద విశేషముగా నున్నవని తరుచు మనకు చెప్పుచుందురు. ఇందువల్ల ఇండియా, ఇంగ్లాండుకు పెద్దమొత్తము "అప్పు" పడినదని చెప్పుదురు. అనేకాంశములను పేర్కొని ఇండియనులు ఇది సరిగాదని సవాలు చేసిరి. అయితే ఆ వివరములతో మనకిక్కడ ప్రసక్తి లేదు. కాని గమనించవలసిన విషయమేమనగా ఈ పెద్ద పెట్టుబడులు ఇంగ్లాండు

నుండి క్రొత్తగా వచ్చిన ధనమును నిరూపించవు. ఇండియాలో చేసి కొన్న లాభములయొక్క పునః పెట్టుబడులే. ప్లాసీ కాలమునను, క్లైవు కాలమునను, నేను ఇదివరలో చెప్పినట్లు, బంగారమును, నగదును లెక్కలేనంత ఇండియానుండి ఇంగ్లాండుకు కొనిపోబడినది. తదనంతరము అన్యవిధములుగా, గుప్తముగా ఇండియాను స్వార్థోపయోగమది చేసికొన్నది. వచ్చిన లాభములలో కొంతభాగము ఇండియాలోనే పెట్టుబడి తిరిగి పెట్టుచుండిరి.

వడ్డీకి బదులు సరుకును తీసికొనుట కంగీకరించుటయే అప్పిచ్చు వృత్తిని ప్రపంచమందంతటను వ్యాపింపచేయుటకు మార్గమని ఇంగ్లాండు తెలిసికొనెను. నేను పైని చెప్పినట్లు తనకు బంగారమే కావలెనని అది అడగుటకు వీలులేదు. దీనివల్ల రెండు ముఖ్య ఫలితములు కల్గినవి. తన జనాభాకు తిండికూర్చుటకు ఇతర దేశములనుండి భోజన పదార్థముల నది రానిచ్చినది. తన కర్షకులనది ఉపేక్షించినది. ఇతరదేశముల నుండి చౌకగా భోజన పదార్థములు వచ్చుచున్నప్పుడు సొంతముగా పండించవలసిన శ్రమ ఎందుకు తీసికొనవలెను? పరిశ్రమవల్ల అధిక లాభమువచ్చుచున్నప్పుడు వ్యవసాయముతో శ్రమపడుట ఎందుకు? కాన ఇంగ్లాండు పూర్తిగా పారిశ్రామిక దేశమై పరదేశములపై తన ఆహారమునకై ఆధారపడుచుండెను.

రెండవ ఫలితమేమనగా అది స్వేచ్ఛావాణిజ్యనీతిని(**Free trade policy**) అవలంబించెను—అనగా తన రేవులలోనికి దిగుమతియగు పరదేశపు సరుకుపై పన్నులు విధించలేదు. ఒకవేళ విధించినను బహు తక్కువ పన్ను విధించెను. అది పారిశ్రామిక దేశములలో అగ్రగామిగాన, తయారీ వస్తువుల విషయమై పోటీవచ్చునను భయము దానికి చాలకాలము వరకు లేకుండెను. పరాయి సరుకుపై పన్నులు విధించుట అనగా పరదేశములనుండి తనకు వచ్చు ఆహార పదార్థములమీదను, తనకొరకు వచ్చిన ముడి సరుకు మీదను పన్నులు వేయుట అని అర్థము

తేలుచున్నది. ఇట్లు చేసినచో ప్రజల భోజనముయొక్క ఖరీదు పెరిగి పోయెడిది. తాను తయారు చేసిన వస్తువుల ఖరీదును పెరిగిపోయెడిది. అదిగాక పన్నులు అధికముగావేసి పరాయిసరుకును రాకుండ చేసి కొన్నచో ఇంగ్లాండుకు అప్పుపడ్డ పరాయి దేశములు ఇంగ్లాండుకు తమ కప్పము (చెల్లించవలసిన రొక్కము) నెట్లు చెల్లించ గలుగుదురు? సరుకుద్వారానే వారు చెల్లించగలరు. ఈ కారణము వల్లనే ఇంగ్లాండు స్వేచ్ఛావాణిజ్యము నవలంబించెను. ఇతర దేశములన్ననో, రక్షణ విధాన మవలంబించెను—అనగా తమ దేశములోనికి దిగుమతియగు పరాయి సరుకుపై పన్నులు వేసి వారు పెరుగుచున్న తమ పరిశ్రమ లను రక్షించికొనుచుండిరి. అమెరికా సంయుక్తరాష్ట్రములు, ఫ్రాంసు, జర్మనీ దేశములు రక్షణ విధాన మవలంబించిరి.

19వశతాబ్దిలోఇంగ్లీషువా రవలంబించిన విధానము-వ్యవసాయము నుపేక్షించుట, పరిశ్రమపై దృష్టి నేకాగ్రము చేయుట, బయటనుండి భోజన పదార్థములు తెప్పించుకొనుట, పరదేశములవారు చెల్లించిన రొక్కముతో సుఖముగా కాలక్షేపము చేయుట—హితకరముగాను, లాభ కరముగాను ఉండెను. కాని అది ప్రమాదములతో కూడుకొన్నపని. ప్రస్తుతమది స్పష్టముగా కనిపించుచున్నది. పరిశ్రమలో అగ్రగామిత్వ మును, బ్రహ్మాండమగు విదేశ వాణిజ్యమును ఈ విధాన మవలంబించు టకు కారణము. కాని ఈ అగ్రగామిత్వము ఊడినయెడల, దానితోపాటు విదేశవాణిజ్యము క్షీణించినయెడల ఏమికావలసినది? అప్పుడు తన భోజన పదార్థములకై ధనమునెట్లు చెల్లించును? ఒకవేళ చెల్లించగలిగి యున్నను ప్రబలమగు శత్రు వడ్డునిలిచినచో పరదేశములనుండి ఆహార మెట్లు దిగును? వెనుకటి ప్రపంచ సంగ్రామములో ఇంగ్లాండు ప్రజలు, భోజన సరఫరా జరుగకుండుటచే తిండిలేక మలమల మాడిరి. ఇంత కన్న ప్రమాదకరమగు విషయము, పరదేశముల పోటీలవల్ల ఇంగ్లాండు విదేశ వాణిజ్యము నానాటికి క్షీణించుట. అమెరికా సంయుక్త రాష్ట్రము

లును, జర్మనీయు పరదేశ వ్యాపార రంగములను తడవుచున్న కాలమున, 1880 ప్రాంతమున, ఈ పోటీ ప్రస్ఫుటమయ్యెను. క్రమక్రమముగా ఇతర జాతులును పారిశ్రామికములయ్యెను. వానికిని వ్యాపార రంగములు కావలసివచ్చెను. ఇప్పుడు సుమారు ప్రపంచమంతయు కొంతవరకు పారిశ్రామికమయ్యెను. ప్రతి దేశమును తనకు కావలసిన వస్తువులనేకము చేసికొనుటకు ప్రయత్నించుచూ, పరదేశ వస్తువులనుకొనుట మానుకొనుచుండెను. ఇండియా పరదేశ వస్త్రములు కొనదలచుకోలేదు. ఈ సందర్భమున లాంకషైరు ఏమిచేయవలసియుండును ? విదేశవాణిజ్యముపై ఆధారపడ్డ ఇతర బ్రిటిష్ పరిశ్రమలేమి కావలెను ?

ఈ ప్రశ్నలకు ఇంగ్లాండు సమాధానము చెప్పుట కష్టసాధ్యమైన పని. ముందు దానికి కష్టదినము లున్నట్లు తోచును. తనకు కావలసిన తిండి తాను పండించుకొనుచు, తనకు కావలసి వస్తువులు తాను తయారు చేసికొనుచు ఒకరి ప్రేక్షము లేకుండా తన బ్రదుకు తాను బ్రదుకుచు తన గూడులో తాను దూరి ఉండలేదు. నేటి ప్రపంచము క్లిష్టముగా నుండుటచే అది అట్లు చేయలేదు. ఒకవేళ ప్రపంచముతో సంబంధము పెట్టుకోకుండ ఉండగలిగినను, అమితముగా పెరిగిపోయిన తన జనాభాకు చాలినంత తిండి అది తయారుచేయుట సంశయాస్పదము. కాని ఈ ప్రశ్నలన్నియు ఈ కాలమునకు సంబంధించినవి. 19 వ శతాబ్దిలో వాటికి ప్రాముఖ్యములేదు. ఈ విధముగా ఇంగ్లాండు భావికాలములో జరుగనున్నది చూడకుండ ఆధిపత్యము ఎన్నటికిని తనకే ఉండునను ఆశతో జూదమాడినట్లు ప్రవర్తించినది. అది గొప్ప ఆట. ఒడ్డిన పందెములు గొప్పవి-ప్రపంచములో నాయకాజాతిగా ఉండుటా, లేదా నామరూపములు లేకుండ పోవుటా. ఇక దానికి మధ్యేమార్గము లేదు. కాని విక్టోరియా కాలమునాటి మధ్యతరగతి ఇంగ్లీషు మనిషికి ఆత్మవిశ్వాసము, లేదా ఆత్మవంచనము అధికముగానుండెను. చిరకాలము పాటుచేసిన పనిలో జయముగాంచుట, ఐశ్వర్యమును చూరగొనుట, పరిశ్రమ వాణిజ్యములలో

నాయకత్వము వహించుటవల్ల ఇతర మానవజాతికన్న తానే అధికుడనన్న విశ్వాసము కలిగినది. పరదేశస్థులన్న వానికి ఈసడింపు. ఆసియా, ఆఫ్రికా ప్రజలతని దృష్టిలో వెనుకబడ్డవారు, అనాగరికులు. వెనుకబడ్డ మానవజాతులను బాగుచేయుటకును, పాలించుటకును కావలసిన తమ ఉపజ్ఞ నుపయోగించుటకు ఇంగ్లీషువారికి సావకాశము కల్పించుటకే పై జాతులు సృష్టింపబడినవని వారి యూహ. యూరోపియన్ ఖండమందలి ప్రజలు సైతము జ్ఞానములేని, మూఢ విశ్వాసములుగల పరదేశులు. నాగరికతా శిఖరముపై నిలుచుటకు ఇంగ్లీషువారినే భగవంతుడెన్నుకొన్నట్లున్నది. ప్రపంచమున కంతకును ముందు యూరోపు. యూరోపుముందు సేనాముఖమున ఇంగ్లాండుండి నడుచుచున్నది. బ్రిటిష్ సామ్రాజ్యము పూర్తిగా గాకున్నను సగము మట్టుకైనను దివ్య సంస్థ. అందుచేతనే అది ఉన్నతజాతియని స్థిరపడుచున్నది. ముప్పదిసంవత్సరముల క్రితము ఇండియాలో వైస్రాయిగా కర్జన్ ప్రభువుండెను. ఆనాటి ఇంగ్లీషు వారిలో అతడు కడు సమర్థుడు. అతడు తన పుస్తకము నొకదానిని క్రిందిరీతిని అంకితమిచ్చెను—"భగవదిచ్ఛచే, బ్రిటిష్ సామ్రాజ్యము, ప్రపంచమునకు మంచిచేయుట కేర్పడిన అశ్రుతపూర్వమగు అఖండ సాధనమని విశ్వసించువారి కిది అంకితము."

విక్టోరియన్ ఇంగ్లీషు వానినిగురించి నేను వ్రాయుచున్నదంతయు అసహజమనియు, అసాధారణ మనియు కనిపించవచ్చును. వానిని వేళాకోళము చేయుచున్నాననియు నీవనుకోవచ్చును. తెలివిగల పురుషుడు ఈ విధముగా ప్రవర్తించుట వింతగానుండును—ఇంత ఆత్మవంచన, తానే నీతిపరుడనను ఇంత దురహంకారము ఆశ్చర్యముకదా! తమకు లాభకరముగా నున్నప్పుడును, తమ అహంకారము తెలుపుటకును జాతు లెట్టి నమ్మకములైనను పెట్టుకోవచ్చును. తమ పొరుగువారిపట్ల వ్యక్తు లీ విధముగా అనాగరికముగా ప్రవర్తింప సమ్మతింపరు. కాని జాతుల కిట్టి శంకలేదు. దురదృష్ట వశమున మనమందరమును అట్టి

వారమే. మనజాతి సద్గుణములను ప్రశంసించుకొనుచు మనము విర్ర వీగుదుము. విక్టోరియా కాలమునాటి ఇంగ్లీషు వ్యక్తి, కొద్దిమార్పులతో, అంతటను ఉన్నాడు. యూరోపియన్ జాతులన్నింటిలో ఇట్టిమాదిరి మనుష్యులున్నారు. అమెరికాలోను, ఆసియాలోను ఉన్నారు.

పరిశ్రమలకు సంబంధించిన పెట్టుబడిదారి విధానము వృద్ధియగుట వల్ల ఇంగ్లాండును, పడమటి యూరోపును ఐశ్వర్యవంతములైనవి. ఈ పెట్టుబడిదారీ విధానము లాభములకై నిరంతరమును కృషిచేయుచు ముందుకు పోయెను. విజయము, లాభములు అను దేవుళ్లను మాత్రమే వీరు కొలుచుచుండిరి. పెట్టుబడిదారి విధానమునకు మతముతోను, నీతి తోను ప్రసక్తిలేదు. వ్యక్తులమధ్యను, జాతులమధ్యను ఉన్నది గొంతు కలు కోయు పోటీ అనే సిద్ధాంతము. వెనుకబడ్డవాని కర్మము వానిదే. మతముపట్ల సహనము కలవారమని విక్టోరియన్ ప్రజలు గర్వించు చుండిరి. విజ్ఞానశాస్త్రములోను, పురోగమనములోను వారికి విశ్వాసము కలదు. వాణిజ్యములోను, సామ్రాజ్య స్థాపనములోను వారు విజయము సాధించుటచే వారే ఉత్కృష్టులనుభావము వారికికలిగెను. జీవులు బ్రదుకు టకై చేయు పోరాటములో మిగిలినవాడే ఘనుడని డార్విన్ చెప్పియుం డెను గదా! మతముపట్ల వారి సహనము ఉపేక్షాభావమే. ఆర్. హెచ్. టాని అను ఇంగ్లీషు రచయిత ఈ పరిస్థితులను చక్కగా వర్ణించెను. అత డన్న మాటలు : ప్రపంచ వ్యవహారములకు దూరముగా భగవంతుడు స్వస్థానమున ఉంచబడెను. "భూమిమీదనున్నట్లే స్వర్గమందును నియమ బద్ధైకాధిపత్యము (**Limited monarchy**) ఉండెను." భాగ్యవంతులగు బూర్జువా ప్రజల అభిప్రాయమిది. కాని ప్రజాసామాన్యము విషయమై చర్చికి వెళ్లుట, మతము ప్రోత్సహింపబడుచుండెను. ఆ విధముగా విప్లవ భావనలు వారిలో పుట్టకుండ చేసికొనుచుండిరి. మతముపట్ల సహనమున్న ప్పుడు ఇతర విషయములలో సహనమున్నట్లు భావించరాదు. ప్రజాబాహు ళ్యము ముఖ్యమని భావించు విషయములలో సహనములేదు. ఎట్టి

ఆయాసము కలిగినను ఈ సహనము పటాపంచలగును. ఇండియానేలు బ్రిటిష్‌ప్రభుత్వము మతముపట్ల ఎంతో సహనము కలిగియుండెను. చేయక తప్పనికార్యము గనుక దానిని చేసెను. నిజమునకు, మతమునకు ఏమి సంభవించినను దానికి పిసరంతయు అక్కఱలేదు. కాని రాజకీయములను గాని, అదిచేయు పనులనుగాని కించిత్తువిమర్శించినను అది చెవులు నిక్కబొడుచుకొనును. అప్పుడు సహన ధర్మము దానికున్నదని ఎవరును భావించరు. దానికెంత ఆయాసము కలిగించిన దాని సహనమునకంత పతనముండును. ఆయాసము మిక్కిలి అధికమైనచో ప్రభుత్వము సహన వేషమును త్యజించి బహిరంగముగా, సిగ్గులేకుండ క్రూరచర్యలలోనికి దిగును. నేటి ఇండియాలో ఇది చూడవచ్చును. కొద్దికాలము క్రితము నేను వార్తా పత్రికలలో చదివితిని—ఒక పిల్లవాడు, ఇంకను పూర్తిగా బాల్యము దాటనివాడు, కొందరు బ్రిటిష్‌ఉద్యోగులను బెదిరించుచు జాబులు వ్రాసెనన్న కారణమున 8 సంవత్సరములు కఠిన నరకము ననుభవింప శిక్షింపబడెను.

పెట్టుబడిదారీ పరిశ్రమ పెరిగినకొలది అనేక మార్పులువచ్చెను. పెట్టుబడిదారీవిధానము నానాటికి హెచ్చుస్థాయిలో పనిచేయ మొదలు పెట్టెను. చిన్నసంస్థలు పనిచేయుటకన్న పెద్దసంస్థలు పనిచేసినచో పని సమర్థముగా జరుగుటయేగాక లాభములును అధికముగావచ్చును. కాన కంపెనులు, ట్రస్టులు అను సంఘములు లేచెను. అవి పెద్ద పరిశ్రమలను యావత్తు నడిపించుచుండెను. చిన్న స్వతంత్ర ఫ్యాక్టరీలను, ఉత్పత్తి దారులను ఇవి గ్రసించివైచెను. దీనిముందు వెనుకటి యథేష్ట వర్తక సిద్ధాంతము నాశమయ్యెను. కారణము-వ్యక్తులు, పరిశ్రమలు ప్రారంభించుటకు సావకాశములు లేవు. పై సంఘములు ప్రభుత్వములను తమ చేతిలో పెట్టుకొనెను.

పెట్టుబడిదారి విధానమువలన సామ్రాజ్యతత్వము వేరొక తీవ్ర రూపము ధరించెను. 19 వ శతాబ్ది రెండవ అర్ధభాగములో పారిశ్రామిక

దేశముల మధ్య పోటీలు పెరిగినకొలది, వ్యాపారరంగముల కనియు, ముడి పదార్థముల కనియు దూరదేశములు వెదుకజొచ్చిరి. ప్రపంచ మందంతటను సామ్రాజ్యమునకై ప్రాకులాట తీవ్రముగా నుండెను. ఆసియాలో-అనగా ఇండియాలో, చీనాలో, దూరఇండియాలో (Farther India), పర్షియాలో ఏమి జరిగినదో విపులముగా నీకిదివరలో చెప్పి యుంటిని. యూరోపియన్ రాజ్యము లిప్పుడు రాబందులవలె వెళ్లి ఆఫ్రికామీదపడి దానిని తమలో తాము పంచుకొన్నవి. ఇక్కడకూడ ఇంగ్లాండు అత్యధికభాగము—ఉత్తరమున ఈజిప్టు, తూర్పున, దక్షిమున, పడమర పెద్ద దేశభాగములు గ్రహించెను. ఫ్రాంసుకూడ బాగుగానే గ్రహించెను. ఇటలీకూడ కొల్లకొట్టుకోగోరెను. గాని అబిసీనియా దానిని చితుకగొట్టెను. అందరికిని ఇది ఆశ్చర్యము కలిగించెను. జర్మనీకికూడ కొంతభాగము దొరికినది. గాని దానికి తృప్తికలుగలేదు. కేకలువేయుచు, బెదిరించుచు, గ్రహించుచు సామ్రాజ్యతత్వ మంతట చిందులు త్రొక్కు చుండెను. బ్రిటిష్ సామ్రాజ్యతత్వ కవియగు రుడ్యార్డు కిప్లింగ్ "తెల్ల వాని భారము"పై పాటలు పాడెను. ఫ్రాంసుచేయు నాగరికతా ప్రచార మని ఫ్రెంచివారు చెప్పిరి. జర్మనులు తమ సంస్కృతి (Kultur)ని వ్యాపింపజేయవలసి యుండెను. ఈ విధముగా నాగరీక ప్రచారముచేయు వారు, ఇతర దేశముల బాగుచేయువారు, ఇతరుల భారములను మోయు వారు వీరందరును శుద్ధ ఆత్మార్పణ బుద్ధితో వెళ్లి నల్ల మనుష్యుల మెడలమీదను, ఎర్రమనుష్యుల మెడలమీదను, పచ్చమనుష్యుల మెడల మీదను కూర్చుండి పోయిరి. "నల్లవారి భారము"ను గురించి పాడిన వారెవ్వరును లేరు.

గ్రహణశీలమును, స్పర్థలలో మునిగినట్టియు ఈ సామ్రాజ్యతత్వ ములను భరించుటకు తగినంత పెద్దదికాదీ ప్రపంచము. వ్యాపారరంగ ములకై పెట్టుబడిదారుల దేవులాటలు కారణముగా ఆయా దేశములకు తరుచు సంఘర్షణములు తటస్థించెను. అనేక పర్యాయములు ఇంగ్లాండు,

ఫ్రాంసులకు మధ్య యుద్ధము తటస్థించవలసినదే. అన్యోన్య శ్రేయస్సులకు సంఘర్షణ ఇంగ్లీషు పరిశ్రమ, జర్మన్ పరిశ్రమలకు కలిగెను. పరిశ్రమలోను, నావల సమూహమందును జర్మనీ ఇంగ్లాండుతో సరితూగ జొచ్చెను. ప్రతి వ్యాపారరంగములోను దాని నెదిరించెను. కాని ప్రపంచ మందలి ప్రశస్త భాగములన్నియు అప్పటికే ఇంగ్లాండు వశములో నుండెను. ఇతర దేశములు తనను వెనుకకు నెట్టివేయుటయా అను ఉక్రోషముతో, అహంకారముతో, సాహసముతో జర్మనీ ఇంగ్లాండుతో గొప్ప పోరాటమునకై శాయశక్తుల సంసిద్ధ మగుచుండెను. యూరోపంతయును సంసిద్ధమగుచుండెను. సైన్యములు పెరిగెను. నౌకాదళములు పెరిగెను. భిన్న భిన్న దేశములకు మైత్రులు జరుగుచుండెను. తుదకు ఒకరినొకరు ఎదిరించుచుండుటచే సాయుధపక్షములు రెండు తయారైనట్లు కనిపించెను-జర్మనీ, ఆస్ట్రియా,ఇటలీలు మిత్రత్రయము ఒకపక్షము. ఫ్రాంసు,రష్యాలు మిత్రద్వయముగా (ఇంగ్లాండు లోపాయికారిగా వారితో కలిసియుండెను) రెండవపక్షము.

ఇంతలో శతాబ్దాంతమున దక్షిణ ఆఫ్రికాలో ఇంగ్లాండు ఒకచిన్న సొంత యుద్ధములో తగుల్కొనెను. ట్రాంస్వాల్ రిపబ్లిక్‌లో బంగారమున్నట్లు కనిపెట్టబడుటచే 1899 లో యుద్ధము తటస్థించెను. యూరోపులోని అగ్రరాజ్యమైన ఇంగ్లాండుతో బోయర్లు అద్భుతమగు ధైర్యముతో, పట్టుదలతో మూడు సంవత్సరములు పోరాడిరి. వారు చితుకకొట్టబడిరి. పరాజితుల మైతిమని వా రంగీకరింపవలసివచ్చినది. కాని వెంటనే బ్రిటిష్ వారు (అప్పుడు లిబరల్ పార్టీ అధికారములో నుండెను) వివేకముతో, ఔదార్యముతో నిన్న మొన్నటివరకు తమకు శత్రువులైన వారికి సంపూర్ణ స్వరాజ్యము నొసంగిరి. మరికొంత కాలమునకు దక్షిణ ఆఫ్రికా అంతయు బ్రిటిష్ సామ్రాజ్యములో స్వతంత్ర అధినివేశమయ్యెను.

## 137

# అమెరికాలో అంతఃకలహము

ఫిబ్రవరి 27, 1933

మనము చాలకాలము ప్రాత ప్రపంచముతో గడపితిమి. దాని పోరాటములతో, దాని కుట్రలతో, దాని రాజులతో, దాని విప్లవములతో, దాని ద్వేషములతో, దాని నిజాయతలతో. మనమిప్పుడు అట్లాంటిక్ సముద్రము దాటి నూతన ప్రపంచమగు అమెరికాను దర్శింతము. యూరోపు పట్టునుండి వదిలించుకొన్న తరువాత అది ఎట్లు కాలక్షేపము చేయుచున్నదో చూతము. ముఖ్యముగా సంయుక్త రాష్ట్రములను మనము పరిశీలించవలసియున్నది. ఆదిని స్వల్ప ప్రారంభములతో మొదలుపెట్టి రానురాను వృద్ధియగుచు నేడుఅది ప్రపంచ పరిస్థితులనే అదుపులో పెట్టు నట్లుండెను. నేడు ఇంగ్లాండు వెనుకటివలె ప్రథమస్థానమునలేదు. నేడది ప్రపంచమునకు ఋణదాతకాదు. పాపము యూరోపులో ఇతర దేశముల వలెనే అప్పుపడ్డ దేశమైనదది. దయతో, ఉదార భావముతో కనిపెట్టి చూడమని అది సంయుక్త రాష్ట్రముల నడుగుచున్నది. ఇప్పుడు అమెరికా ఋణదాత యైనది. ధనము అమెరికాలోనికి ప్రవహించుచుండెను. అమెరికాలో కోటీశ్వరులసంఖ్య ఆశ్చర్యకరముగా పెరుగుచున్నది. మైదాస్ కథలోవలె బంగారును స్పృశించుటచే దానికేమియు ఆనంద మధికముగా వచ్చుచున్నట్లు లేదు. ఆ దేశ ప్రజలు, కోటీశ్వరు లందరచ్చటనున్నను, దారిద్ర్యముతో నేడు బాధపడుచుండిరి.

1775 లో ఇంగ్లాండునుండి విడివడిన సముద్రతీరమందున్న 13 రాష్ట్రములందును జనాభా 40 లక్షలు. సంయుక్తరాష్ట్రముల మొత్తము జనాభా 1250 లక్షలు. ఇప్పుడు యూనియన్‌లో ఇంకను ఎక్కువగా అనేక రాష్ట్రములుకలవు. ఖండమున కడ్డముగా నవి పసిఫిక్ సముద్రము వరకును విస్తరించియుండును. 19 వ శతాబ్దిలో ఈ దేశము, విస్తీర్ణ

మందును, జనాభా యందును మాత్రమేకాదు నేటి పరిశ్రమయందును, వాణిజ్యమందును, భాగ్యమందును, పలుకుబడియందునుకూడ వృద్ధి నందెను. ఈ రాష్ట్రముల కనేక కష్టములు కలిగెను. యూరోపుతో కొన్ని యుద్ధములందును, చిక్కులందును తగులుకొనెను. కాని దానికి సంభవించిన కష్టములలోనికెల్ల పెద్దకష్టము—ఉత్తర రాష్ట్రములకును, దక్షిణ రాష్ట్రములకును మధ్య తటస్థించిన విధ్వంసకరమగు అంతఃకలహము.

అమెరికా స్వేచ్ఛ సంపాదించిన తరువాత కొద్ది సంవత్సరములకు ఫ్రాంసులో విప్లవము సంభవించెను. తరువాత నెపోలియన్ యుద్ధములు వచ్చెను. ఒండొరుల వాణిజ్యములను విధ్వంసము చేయుటకై నెపోలియన్, ఇంగ్లాండులు ప్రయత్నించిరి. ఇట్లు చేయునప్పుడు సంయుక్త రాష్ట్రములతో సంఘర్షణ తటస్థించెను. అమెరికావారి సముద్ర వాణిజ్యమంతయు కూలబడెను. ఇందుచేతనే 1812 లో ఇంగ్లాండుతో వేరొక యుద్ధము సంభవించెను. ఇది రెండు సంవత్సరములు జరిగెను. గాని ఫలితమేమియు కలుగలేదు. ఈ యుద్ధము జరుగుచున్నప్పుడే నెపోలియన్ ఎల్బాకు పంపివేయబడెను. ఇంగ్లాండుకు తీరికచిక్కెను. అప్పుడు ఇంగ్లాండు, రాజధానియైన వాషింగ్టన్ పట్టణమును స్వాధీనము చేసికొనగలిగెను. ముఖ్యమైన రాజకీయ భవనములను, కాపిటోల్‌తో సహా తగులబెట్టి నాశనము చేసెను. కాపిటోల్‌లోనే కాంగ్రెసు సభలు జరుగును. ప్రెసిడెంట్లు కాపురముండు వైట్ హవుస్‌ను కూడ నాశము చేసెను. తరువాత బ్రిటిష్‌వారు పరాజితులైరి.

ఈ యుద్ధమునకు పూర్వమే దక్షిణముననున్న ఒక పెద్ద దేశ భాగమును ఈ రాష్ట్రములు తమలో కలుపుకొనెను. బ్రిటిష్‌వారి నౌకా దళము చేయు దాడులకు తట్టుకోలేక నెపోలియన్, ఫ్రెంచివారి వలస యగు లూయీ జియేనాను ఇంగ్లీషువారి కమ్మివేసెను. రాష్ట్రములు కలుపుకొన్న దిదియే. కొద్ది సంవత్సరములైన పిమ్మట 1822 లో రాష్ట్రములు స్పెయిన్ నుండి ఫ్లారిడాను కొనుక్కొనిరి. 1848 లో

మెక్సికోతో యుద్ధముచేసి గెలిచి, నైరుతి దిశనున్న అనేక రాష్ట్రములను, కాలిఫోర్నియాతోసహా, రాష్ట్రములలో కలుపుకొనెను. నైరుతి భాగ మందున్న నగరముల పేళ్ళనేకము స్పానిష్ పేళ్లే. ఒకప్పుడు స్పెయిన్ దేశస్థులో, స్పానిష్ భాష మాటాడు మెక్సికనులో అచ్చట రాజ్యము చేసినట్లు మనకవి జ్ఞాపకము చేయును. సినిమాప్రపంచంయొక్క పెద్ద నగరమగు లాస్ ఏంజలీస్ పేరును, శాన్‌ఫ్రాంసిస్కో పేరును అందరును విన్నవే.

యూరోపులో ఉండుండియు విప్లవ ప్రయత్నములు, వాని నణచి వేయు ప్రయత్నములు జరుగుచున్న కాలములో సంయుక్త రాష్ట్రములు పడమరగా విస్తరించుచు పోయెను. యూరోపులో అణచివేతలవల్ల ప్రజలు వలసపోవ నారంభించిరి. విస్తారమగు దేశభాగములును, పెద్ద పెద్ద భృతులును కలవని విని యూరోపియన్ దేశములనుండి బహు సంఖ్యాకులు ఆకర్షింపబడుచుండిరి. జనసంఖ్య పడమరగా వ్యాపించగా క్రొత్త రాష్ట్రములు సృష్టింపబడి యూనియన్‌లో చేర్చబడినవి.

మొదటినుండియు ఉత్తర రాష్ట్రములకును, దక్షిణ రాష్ట్రము లకును విభేద మెక్కువగా నుండెను. నూతన బృహద్యంత్ర పరిశ్రమ వేగముగా వ్యాపించుటచే ఉత్తర రాష్ట్రములు పారిశ్రామికమయ్యెను. దక్షిణమున బానిసలు పనిచేయు వలస తోటలు పెద్ద పెద్దవి వుండెను. బానిస తన మచ్చట న్యాయసిద్ధము. ఉత్తరమున బానిసతనము నెవ్వ రును సహించరు. దాని కచ్చట ప్రాముఖ్యములేదు. బానిసల పాటుమీదనే పూర్తిగా దక్షిణ రాష్ట్రము లాధారపడియుండెను. ఆ బానిసలు ఆఫ్రికా నుండి వచ్చిన నీగ్రోలే. తెల్లవాళ్లెవరూ బానిసలుకారు. "మానవు లందరును సమానముగానే పుట్టిరి" అని స్వాతంత్ర్య ప్రకటన తెలుపు చున్నది. కాని ఇది నల్లవారికేకాని తెల్లవారికి వర్తించదు.

ఆఫ్రికానుండి నీగ్రోలను తెచ్చిన విధానము హృదయవిదారకము. 17 వ శతాబ్ది తొలిరో బానిసవర్తకము ప్రారంభమాయెను. 1863 వరకు


అమెరికా సంయుక్త రాష్ట్రముల విస్తరింపు
1845-48
1803
మిస్సోరి
1783
ఒహాయో
మొదటి రాష్ట్రములు
1776
1819
ఈ గీతకు - - - - దక్షిణముననున్న రాష్ట్రములు
అంతఃకలహములో వేరుపడ్డ రాష్ట్రములు

ఎడతెగకుండ బానిసల సరఫరా జరుగుచుండెను. మొట్టమొదట ఆఫ్రికా పడమటి తీరము నంటిపోవు సరుకు పడవలు—(ఆ తీరమును నేడు పైతము "బానిసల తీరమందురు")—సులభముగ దొరికిన ఆఫ్రికనులను పట్టుకొని అమెరికాకు తీసికొని పోవుచుండెను. ఆఫ్రికనులలో వారిలో వారికి బానిసతనము లేదనియే చెప్పవచ్చును. యుద్ధములో ఖైదీలైన వారిని, ఋణగ్రస్తులను మాత్రమే బానిసలనుగా చూచుచుండిరి. ఆఫ్రికనులను పట్టుకొని అమెరికా తీసికొనిపోయి అమ్ముకొనుట లాభసాటి వర్తకముగా నుండెను. బానిసవర్తకము వృద్ధి అయ్యెను. ఇంగ్లీషువారు, స్పానిష్‌వారు, పోర్చుగీసువారు ఈ వర్తకమునకు సహాయార్థమై ధన మిచ్చుచుండిరి. బానిసవర్తకమునకై ప్రత్యేక నావలు నిర్మింపబడెను. ఓడ తట్టునకు తట్టునకు మధ్య వసారాలు వీనికుండును. ఈ వసారాలలో పాప మీ నీగ్రోలు పండుకొనియుండవలెను. ఇద్దరిద్దరికి సంకెళ్లు తగిలించి యుండును. అందరిని గొలుసుతో కట్టి యుంచుదురు. అట్లాంటిక్ సముద్ర ప్రయాణము అనేక వారములు, లేదా మాసములు పట్టును. ఈ కాలములో ఈ నీగ్రోలు ఈ ఇరుకు వసారాలలో ఉమ్మడిగా బంధితులై ఉందురు. ఒక్కొక్కనికి అందు నిర్దేశమైన స్థలము 5½ అడుగులు పొడవు, 16 అంగుళముల వెడల్పు.

బానిస వర్తకపు పునాదులపై లివర్‌పూల్ మహానగరమయ్యెను. 1713 లోనే ఉట్రెచ్టి సంధిలో, ఆఫ్రికా, స్పానిష్ అమెరికాలమధ్య బానిసలను మోసికొనిపోవు హక్కు స్పెయిన్ నుండి ఇంగ్లాండు బలవంతముగా పుచ్చుకొన్నది. ఇంతకుముందే అమెరికాలోని ఇంగ్లీషు భూములకు ఇంగ్లాండు బానిసలను సరఫరా చేసెను. కాన 18 వ శతాబ్దిలో ఆఫ్రికా అమెరికాలమధ్య జరుగు బానిస వ్యాపారము ఇంగ్లీషు వారికి గుత్తగా నుండవలెనను ప్రయత్నము జరిగెను. 1730 లో ఈ వ్యాపారమందు లివర్‌పూల్ 132 నావలను ఉపయోగించెను. పారిశ్రామిక విప్లవము తొలినాళ్లలో ఇంగ్లాండులోని లాంకషైరులో నూలు వడకుట

వృద్ధిగాంచెను. ఇందుచే సంయుక్తరాష్ట్రములలో ఎక్కువమంది బానిసలు కావలసి వచ్చెను. ఎందువల్లననగా లాంకషైరు మిల్లులవా రుపయోగించు ప్రత్తి దక్షిణ రాష్ట్రములోని పెద్ద ప్రత్తితోటలనుండి వచ్చుచుండెను. ఈ ప్రత్తి తోటలు వేగముగా విస్తరింపబడెను. ఆఫ్రికానుండి నీగ్రోలు అధికముగా తీసికొని రాబడిరి. నీగ్రోలను పుట్టించుటకు సర్వ యత్నములు చేయబడెను. 1790 లో సంయుక్తరాష్ట్రములలో 6,97,000 బానిసలుండిరి; 1861 లో 40,00,000 వరకు వారి సంఖ్య పెరిగెను.

18 వ శతాబ్ది తొలి రోజులలో బ్రిటిష్ పార్లమెంటు బానిసత్వమును నిషేధించుచు కఠిన శాసనములను అమలుపరచెను. యూరోప్పులోని ఇతర దేశములును, అమెరికాయును దాని ననుసరించెను. ఈ విధముగా బానిస వ్యాపారము చట్ట విరుద్ధమని బహిష్కరింపబడినను ఆఫ్రికానుండి అమెరికాకు నీగ్రోలు తీసికొని పోబడుచునే యుండిరి. కాని కొంత భేదమున్నది. అప్పటికన్న ఇప్పుడు ప్రయాణ పరిస్థితులు మరీ విషమముగానుండెను. బహిరంగముగా వారి నిప్పుడు తీసికొని పోరాదు. కాన వారిని ఒకదానిపై నొకటి అమర్చినట్టియు, విడివిడిగా నున్నట్టియు అరలలోపెట్టి కనిపించకుండ తీసికొనిపోవుచుండిరి. ఒక అమెరికన్ రచయిత ఇట్లు చెప్పుచున్నాడు. ఒక్కొక్కప్పుడు "ఒకరి ఒడిలో ఒకరు, కాళ్ళమీద కాళ్ళు పడుచు మంచు జారుడు బల్లపైనుండి జారి పడు వారివలె" వారుండిరి. ఇందరి నిందు ఘోరత్వమును ఊహించుట కష్టము. పరిస్థితులు బహు రోతిగా నుండుటచేత, నాలుగైదు నబురులైన పిమ్మట బానిస నావలను పరిహరింపవలసి వచ్చెడిది. కాని లాభములు హెచ్చుగానుండును. 18 వ శతాబ్దాంతమున, 19 వ శతాబ్దాదిని బానిస వ్యాపారము ముమ్మరముగా నున్నప్పుడు ఆఫ్రికన్ బానిస తీరమునుండి ప్రతి సంవత్సరమున లక్షలమంది బానిసలను తీసికొని పోవుచుండిరి. నీగ్రోలను పట్టుకొనుటకు చేసెడి దాడులలో పట్టుబడ్డ నీగ్రోలకంటె హతులైనవారి సంఖ్యయే అధికమని జ్ఞాపక

ముంచుకొనును.

19 వ శతాబ్ది తొలి నాళ్ళలోనో, ఆ ప్రాంతముననో ప్రధాన దేశము లన్నియు బానిస వ్యాపారమును చట్టవిరుద్ధమని నిషేధించినవి. సంయుక్తరాష్ట్రములుకూడ ఆ విధముగానే చేసెను. బానిస వ్యాపారము నిషేధింపబడినను అమెరికాలో బానిసత్వము నిషేధింపబడలేదు-అనగా ప్రాతబానిసలు బానిసలుగానే ఉండిరి. బానిసత్వము చట్టవిరుద్ధముకాదు. కాబట్టి నిషేధ మున్నప్పటికిని బానిస వ్యాపారముకూడ సాగుచునే ఉండెను. బ్రిటను బానిసత్వమును కూడ రద్దుచేసినప్పుడు బానిస వ్యాపారమునకు న్యూయార్కు ప్రధాన రేవు పట్టణమాయెను.

అనేక సంవత్సరముల వరకు ఈ వ్యాపారమునకు న్యూయార్కు రేవుపట్టణముగానున్నను—(శతాబ్ది మధ్య వరకు)—ఉత్తర రాష్ట్రములు బానిసత్వమునకు వ్యతిరేకముగానే ఉండెను. దక్షిణ రాష్ట్రములకన్ననో వలస తోటల పనికి బానిసలు కావలసి వచ్చుచుండిరి. అందు కొన్ని రాష్ట్రములు బానిసత్వమును రద్దుచేసినవి, కొన్ని చేయలేదు. బానిస రాష్ట్రమునుండి నీగ్రోలు తరుచు "అబానిస రాష్ట్రము"నకు పారిపోవు చుండిరి. అందుచే వివాదములు వారినిబట్టి కలుగుచుండెను.

ఉత్తర, దక్షిణ రాష్ట్రముల ఆర్థిక ప్రయోజనములు విభిన్నముగా నుండెను. 1830 సంవత్సరములోనే ఎగుమతి, దిగుమతి పన్నుల గురించియు, రేవు సుంకముల గురించియు రవరవలు పుట్టెను. యూనియన్ నుండి విడిపోవుదుమని బెదిరించిరి. రాష్ట్రములు తమ హక్కుల విషయమై పట్టుదలతో నుండిరి. ఫెడరల్ ప్రభుత్వము తమ వ్యవహార ములలో అధికముగా జోక్యము కలిగించుకొనుట వారికి కిట్టలేదు. దేశ ములో రెండు పార్టీలు తలయెత్తెను. ఒకపార్టీవారు సర్వాధికారములు రాష్ట్రమునకే ఉండవలెననిరి. రెండవ పక్షమువారు ప్రబలమగు కేంద్ర ప్రభుత్వమును కోరిరి. ఇట్టి భేదాభిప్రాయములే ఉత్తర, దక్షిణ రాజ్యము లను మరింత దూరము చేసెను. యూనియన్‌కు క్రొత్తరాజ్యములను

చేర్చినప్పుడెల్ల ఏపక్షమునది బలపరుచునను అంశము వచ్చుచుండెను. ఎవరిపక్షము బాహుళ్యముగా నుండును? యూరోపునుండి ప్రజలు వలస వచ్చుచుండుటచేత ఉత్తర రాష్ట్రముల జనాభా పెరుగుచుండెను. దీనిని చూచి ఉత్తర రాష్ట్రములు తమ్ము ముంచివేయుదనియు, ప్రతివిషయము నకు హెచ్చు వోట్లతో వారు తమ అభిప్రాయములు సాగనీయరనియు దక్షిణ రాష్ట్రములు భయపడదొడగెను. ఈ విధముగా ఉత్తర, దక్షిణ రాష్ట్రముల మధ్య మనస్పర్థలు వృద్ధి అయ్యెను.

ఇంతలో ఉత్తరమున బానిసత్వము సంపూర్ణముగా నిషేధించ వలెనని ఆందోళన పెరిగెను. దీనికనుకూలురుగా నున్నవారిని "అబాలిష నిస్టులు" అనిరి. వారి ప్రధాన నాయకుడు విలియమ్ లాయడ్ గారిజన్. తన బానిసత్వ వ్యతిరేకాందోళనకు పుష్టిగా నుండుటకై అతడు "లిబ రేటర్" అను పత్రికను వెలువరచెను. ఈ పత్రిక మొదటి సంచికలోనే, తాను ఈ విషయమై ఎంతమాత్రము రాజీకి రాననియు, మితముగా వ్యవహరించజాలననియు స్పష్టముచేసెను. ఆ సంచికలోని కొన్ని వాక్య ములు ప్రసిద్ధిగన్నవి. అవి ఇక్కడ వ్రాయుచున్నాను—

"సత్యమెంత కఠోరముగా నుండునో నేనంత కఠోరముగా నుందును. న్యాయమెంత నిశ్చలముగానుండునో నేనంత నిశ్చలముగా నుందును. ఈ విషయమై నేను మితముగా ఆలోచించను. మితముగా మాటాడను: మితముగా వ్రాయను: ఎన్నడును చేయను. ఇల్లు తగులబడు చున్నప్పుడు ఇంటివారితో మితముగా హెచ్చరిక చేయమని చెప్పు; భార్య మానము చెరచుచున్నవానినుండి ఆమెను మితముగారక్షింపుమని భర్తతో చెప్పు; శిశువు మంటలో పడ్డప్పుడు ఆశిశువును క్రమక్రమముగా పైకదీసుకు రమ్మని తల్లితో చెప్పు; కాని ఈ విషయమున మితముగా నుండమని నాతో చెప్పవద్దు. నేను త్రికరణ శుద్ధిగా చెప్పుచున్నాను—నేను సందిగ్ధ ముగా వ్యవహరించను—నేను క్షమించను-ఒక అంగుళమైనను వెను కడుగు వేయను-నామాట అందరును విని తీరుదురు."

ఇట్లు ధైర్యముతో పనిచేసిన వారి సంఖ్యమాత్రము బహుకొద్ది.

బానిసత్వము కూడదను వారిలో పెక్కురు, ఇదివరలో అది అమలులో నున్నచోట అట్లే ఉండనిమ్మని కోరిరి. అయినను ఉత్తర, దక్షిణముల మధ్య ఉద్రేక మధికమయ్యెను. ఆర్థికప్రయోజనములు భిన్నముగా నుంటయే ఇందుకు కారణము. ముఖ్యముగా ఎగుమతి, దిగుమతి పన్నుల విషయమునసే వారివారి ఆర్థిక ప్రయోజనములకు సంఘర్షణ కలిగినది.

1860లో అబ్రహాం లింకన్ సంయుక్తరాష్ట్రములకు ప్రెసిడెంటుగా ఎన్నుకోబడెను. అతని ఎన్నికను పురస్కరించుకొని దక్షిణరాష్ట్రములు చీలిపోయెను. అతడు బానిసత్వమునకు వ్యతిరేకి. అయినను బానిసత్వ మున్నచోట తానేమియు కలుగజేసికోనని అతడు చెప్పెను. క్రొత్త రాష్ట్రముల కది ప్రాకుట తానిష్టపడననియు, దానిసత్వమును చట్టబద్ధము చేయననియు అతడు చెప్పెను.

ఇట్లభయమిచ్చినను దక్షిణ రాష్ట్రములకు సంతుష్టి కలుగలేదు. రాష్ట్రము తరువాత రాష్ట్రము యూనియన్‌నుండి వేరుపడెను. సంయుక్త రాష్ట్రములు శకలములగుచుండెను. క్రొత్త ప్రెసిడెంటు ఎదుర్కొన వలసిన పరిస్థితులంత తీవ్రముగా నుండెను. దక్షిణ రాష్ట్రములను తన పక్షమునకు త్రిప్పుకొని విచ్ఛిత్తి నాపుటకు వేరొక ప్రయత్న మతడు చేసెను. బానిసత్వము సాగనిత్తునని అతడెన్నో నమ్మకములు పలికెను. బానిసత్వమున్నచోట, దానికి శాశ్వ తత్వము కల్పించుటకై రాజ్యాంగమునందుకూడ చేర్చెదనని అతడు చెప్పెను. శాంతిని స్థాపించు టకై అతడెంత దూరమైనను పోవుటకు సిద్ధముగానుండెను. కాని యూనియన్ విచ్ఛిత్తియగుటకుమాత్ర మతడు సమ్మతించలేదు. ఏ రాష్ట్రమునకును యూనియన్‌నుండి విడిపోవుటకు హక్కులేదని అతడు గట్టిగా చెప్పెను.

అంతఃకలహమును నివారించుటకు లింకన్ చేసిన ప్రయత్నము వ్యర్థమయ్యెను. దక్షిణ రాష్ట్రములు వీడిపోవుటకు నిశ్చయించుకొన్నవి.

11 రాష్ట్రములట్లుచేసినవి. సరిహద్దు ప్రాంతమున నున్న మరికొన్ని రాష్ట్రములు వారిపై సానుభూతిచూపినవి. విడిపోయిన రాష్ట్రములు "కాంఫెడరేట్ స్టేట్సు" అను పేరు పెట్టుకొన్నవి. జెఫర్‌సన్ డేవిస్ అనువానిని తమ ప్రెసిడెంటుగా ఎన్నుకొన్నవి. 1861 ఏప్రిల్‌లో అంతఃకలహము ప్రారంభమయ్యెను. అది నాలుగు సంవత్సరములు సాగినది. సోదరుడు సోదరునితో, స్నేహితుడు స్నేహితునితో పోరాడెను. యుద్ధము సాగుచుండగా పెద్దపెద్ద సేనలు సమకూడెను. ఉత్తర రాష్ట్రముల కనుకూలము లనేకముండెను. దక్షిణమునకన్న దాని జనాభా చాల పెద్దది. ధనవంతముగాకూడ నుండెను. పారిశ్రామిక ప్రాంతమగుటవల్లను, వస్తువులుతయారుచేయు ప్రాంతమగుటవల్లను దానికి స్తోమతు అధికముగా నుండెను. దానికి దక్షిణముకన్న ఎక్కువ రైళ్లుండెను. కాని దక్షిణమున భటులు, సేనానాయకులు సమర్థులు. ముఖ్యముగా చెప్పుకోదగ్గవాడు జనరల్ లీ. తొలి విజయములన్నియు దక్షిణమునకే దక్కెను. కాని రాను రాను చివరకు దక్షిణము అలసిపోయెను. ఉత్తరాదివారి నౌకాదళము యూరోపు వ్యాపార రంగములతో దక్షిణాది వారికి ఎంత మాత్రము సంబంధము లేకుండ చేసెను. ఇందుచే ప్రత్తి, పొగాకు ఎగుమతి చేయ వీలులేకపోయెను. ఆ కారణమున దక్షిణాదివారు క్రుంగిపోయిరి. అంతేకాదు, ప్రత్తిలేని కారణముచేత లాంకషైరులో అనేక మిల్లులు మూయవలసి వచ్చెను. లాంకషైరు మిల్లులలో పనిచేయు కార్మికులకు ఉద్యోగములు పోయినందున అష్టకష్టముల పాలైరి.

ఈ అంతఃకలహమున సామాన్యముగా ఇంగ్లీషువారు దక్షిణ రాష్ట్రములపై సానుభూతి కలిగియుండిరి. లేదా భాగ్యవంతులగువారి సానుభూతి దక్షిణము వైపునకే మొగ్గియుండెను. అతివాదులు ఉత్తర రాష్ట్రములకే సానుభూతి చూపుచుండిరి.

అంతఃకలహమునకు బానిసత్వము ప్రధాన కారణముకాదు. నే నిదివరలో చెప్పినట్లు ఉన్నచోట్ల బానిసత్వము జోలికి పోనని చివర

వరకు లింకను చెప్పుచునే యుండెను. ఉత్తర, దక్షిణ రాష్ట్రముల ఆర్థిక ప్రయోజనములు భిన్నమైనవి. పరస్పర విరుద్ధములు. ఇందువల్లనే కలహము సంభవించెను. తుదకు యూనియన్‌ను నిలుపుటకు లింకను పోరాటములోనికిదిగెను. యుద్ధము ప్రారంభించిన పిమ్మటకూడ లింకను విస్పష్టముగా బానిసత్వమునుగురించి ప్రకటన చేయలేదు. అట్లుచేసినచో బానిసత్వము కూడునని చెప్పు ఉత్తర రాష్ట్ర ప్రజ లనేకులకు కోపము వచ్చునని అతడు భయపడెను. యుద్ధము సాగినకొలది అతని అభిప్రాయము స్పష్టరూపము పొందెను. కాంగ్రెసువారు బానిసలను విడుదల చేయవలసినదనియు, బానిసల యజమానులకు నష్టపూర్తి యీయవలసినదనియు అతడు ప్రతిపాదించెను. కొన్నాళ్ళైన పిమ్మట నష్టపూర్తి ఈయవలెనను అభిప్రాయము నాతడు విసర్జించెను. 1862 సెప్టెంబరులో "దాస్యవిమోచన ప్రకటనము" నతడు జారీచేసెను. దాని ప్రకారము ప్రభుత్వముపై తిరుగుబాటు చేసిన రాష్ట్రములలోని బానిసలందరును 1863 జనవరి 1 వతేదీ నాటికి విడుదల కావలెను. ఈ ప్రకటనమును జారీ చేయుటకు ముఖ్యకారణము బహుశా యుద్ధములో దక్షిణ రాష్ట్రములకు దుర్బలత్వము చేకూర్చుటకే అయియుండును. ఇందుకు ఫలితముగా 40 లక్షల బానిసలు స్వేచ్ఛనందిరి. వీరు కాంఫెడరేటు రాష్ట్రములలో అల్లరి ప్రారంభింతురని ఆశించబడెను.

దక్షిణరాష్ట్రములు పూర్తిగా అలసిపోయినపిమ్మట 1865 లో అంతఃకలహము ముగిసెను. ఎప్పుడైనను యుద్ధము ఘోరమైన విషయమే. అందు తరుచుగా అంతఃకలహము అంతకన్న ఘోరతరము. నాలుగు సంవత్సరములుజరిగిన ఈ భయంకర యుద్ధముయొక్క భారము ముఖ్యముగా ప్రెసిడెంటయిన లింకను పైబడెను. ఎన్ని కష్టములు వచ్చినను, ఎన్నిమాట్లు ఆశాభంగమైనను గణించక, చలించని పట్టుదలతో అతడు నిర్వహించుటవలననే విజయము చేకూరినది. జయించవలెనను పట్టుదలతో అతడు దిగెను. అంతేకాదు. సాధ్యమైనంతవరకు ద్వేష

భావమును రేకెత్తనీయకుండ కృతకృత్యుడు కా ప్రయత్నించెను. ఎందు కన్న, ఏ యూనియన్‌కై అతడు పోరాడుచున్నాడో అట్టియూనియన్ నిజముగా హృదయములు కలిసిన యూనియన్‌గా ఉండవలెననియు, బలవంతాన కూర్చిన యూనియన్‌గా ఉండకూడదనియు అతని ఆశ యము. కాన యుద్ధమున విజయము సాధించి, పిమ్మట పరాజితులైన దక్షిణ రాష్ట్రవాసుల యెడ ఉదారముగా ప్రవర్తింప దొడగెను. కాని కొద్ది రోజులలోనే ఒక ఉన్మాది అతనిని కాల్చి చంపివేసెను.

అమెరికన్ మహా పీపలలో, అగ్రగణ్యులలో అబ్రహాం లింకను ఒక్కడు. ప్రపంచమందలి మహా పురుషులలోకూడ అతనికొక స్థాన మున్నది. ప్రారంభములో అతడు సామాన్యుడు. అతనికి చదువు తక్కువ. ఉన్నచదువు అతడు స్వయంకృషివల్ల సంపాదించినదే. అయినను అతడొక గొప్ప రాజకీయవేత్త: ఒక గొప్ప వక్త. గొప్ప ప్రమాద స్థితిలోనున్న తన దేశమును ఒడ్డు చేర్చెను.

లింకన్ మరణానంతరము అమెరికన్ కాంగ్రెసు, దక్షిణ రాష్ట్ర మందలి తెల్లవారిపట్ల చూపవలసినంత ఔదార్యము చూపలేదు. లింకన్ ఇంతకన్న ఉదారముగా ఉండియుండును. దక్షిణ రాష్ట్రములందలి తెల్లవా రనేకులు కొన్నివిధములుగా శిక్షాపాత్రులైరి. అనేకులు తమ వోటును గోల్పోయిరి. నీగ్రోలు పౌరులై పౌరులకుండు హక్కులన్నియుపొందిరి. అమెరికన్ రాజ్యాంగ వ్యవస్థలో ఇది చేర్చబడెను. జాతిని బట్టిగాని, రంగును బట్టిగాని, వెనుక బానిసయై యుండెనన్న కారణమును బట్టిగాని ఎట్టి మానవుని హక్కును, ఏ రాష్ట్రమును తీసివేయరాదనియు అందు నమోదు చేయబడ్డది.

నీగ్రోలిప్పుడు చట్టసమ్మతమగు స్వేచ్ఛను పొందిరి. వారికి వోటు వచ్చెను. కాని దీనివల్ల వారికి కలిగిన లాభమేమియు లేదు. ఆర్థికముగా వారు పూర్వస్థితియందే ఉండిరి. విడుదలయైన నీగ్రోల కెవ్వరి కిని ఎట్టి ఆస్తియు లేదు. వీరినేమి చేయవలెనో సమస్యగా నుండెను.

కొందరు ఉత్తర రాష్ట్రమందలి పట్టణములకు వలస పోయిరి. కొంద రున్న చోటనే ఉండి పూర్వ శ్వేతయజమానుల అధికారము క్రిందనే పనిచేయుచుండిరి. వారు కూలివాండ్రుగా వెనుకటి వలస తోటలలోనే పనిచేయుచు, శ్వేత యజమానులు తోచినకూలి ఈయగా పుచ్చుకొనుచు ఉండిరి. దక్షిణ రాష్ట్రములందలి తెల్లవారు ఒక్కటిగా కూడి అన్ని విధముల నీగ్రోలను క్రూరముగా అణచివేయ పూనుకొనిరి. "కూక్లక్సు క్లాన్" అను పేర ఒక అసాధారణ సంస్థ స్థాపించబడెను. అది కొంత వరకు రహస్య సంస్థ. నీగ్రోలను భయోత్పాతులను జేయుచు, ఎన్నికల సందర్భముల వారిని వోటు నీయకుండ అభ్యంతర పెట్టుచు దానిసభ్యులు దేశము వెంట తిరుగుచుండిరి.

కడచిన అర్థ శతాబ్దములో నీగ్రోలు కొంత అభివృద్ధి పొందిరి. అనేకులు ఆస్తి సంపాదించుకొనిరి. వారికి కొన్ని చక్కని విద్యాశాలలు కలవు. అయినను వారింకను నిస్సందేహముగా పరాధీన జాతియే. సంయుక్త రాష్ట్రములలో 120 లక్షల మంది నీగ్రోలున్నారు—అనగా మొత్తము జనాభాలో సుమారు పదియవ వంతు. వారి సంఖ్య కొద్దిగా ఉన్నప్పుడు వారిని సహించుచుండిరి. ఉత్తరమున కొన్ని భాగములలో అట్లుండెను. వారిసంఖ్య పెరిగిన తోడనే వారిని గద్దించుచుండిరి. పూర్వ బానిసల తుల్యులమే అని వారనుకొనునట్లు చేయుచుండిరి. ప్రతిచోటను వారిని కేటాయించుచుండిరి. తెల్లవారికి దూరముగా నుంచుచుండిరి. హోటళ్లలో, కాఫీహోటళ్లలో, దేవాలయములలో, కాలేజీలలో, పార్కులలో, సముద్రతీర స్నాన ఘట్టములలో, ట్రాములలో, పచారీ దుకాణములలో సైతము ఇది జరుగుచుండెను. రైళ్లలో వారు ప్రత్యేక బళ్లలో కూర్చుండి ప్రయాణము చేయవలెను. ఆ బళ్లకే "జిమ్‌క్రో కార్సు" అని పేరు. తెల్లవారికిని, నీగ్రోలకును వివాహమును చట్టము నిషేధించెను. ఇట్టి వింత చట్టములు అనేకముండెను. మొన్న మొన్న 1926లో వర్జీనియా రాష్ట్రమొక చట్టమును చేసెను. దాని ప్రకారము తెల్లవారును, నీగ్రో

లును ఒకే నేలపై కూర్చుండరాదు.

ఒక్కొక్కప్పుడు తెల్లవారికిని, నీగ్రోలకును మధ్య భయంకరమగు దొమ్మిలాటలు సంభవించుచుండెను. తరుచుగా దక్షిణమున నీగ్రోలను ఘోరముగా హత్యలు చేయుచుండిరి. ఏదో నేరము చేసినట్లు అనుమానించిన నీగ్రోను అల్లరిమూక పట్టుకొని, వానిని చంపుచుండిరి. ఈ మధ్యనే శ్వేతముఖుల మూకలు నీగ్రోలను కర్రకుకట్టి కాల్చివేసినట్లు తెలియుచున్నది.

అమెరికా యందంతటను, ముఖ్యముగా దక్షిణ రాష్ట్రములందును నీగ్రోల స్థితి దుర్భరముగానే ఉండెను. కొన్ని దక్షిణ రాష్ట్రములలో తరుచుగా కూలీలు దొరకనప్పుడు, ఏ పాపమెరుగని నీగ్రోలను పట్టుకొని వారిపై ఏదో ఒక నేరమును మోపి జైలుకు పంపుచుండిరి. పిమ్మట ఈ ఖైదీలనే కూలీలనుగా ప్రయివేటు కంట్రాక్టర్లకు కౌలుకు ఇచ్చుచుండిరి. ఎంత దుష్టముగా నున్నది! కాని దీనిని అనుసరించి యున్న పరిస్థితులు ఘోరముగానే ఉండెను. కాన చట్టబద్ధ స్వేచ్ఛ అన్నంతనే ఒలికిన దేమియు లేదని తేలినది.

హారియట్ బీచర్ స్టోవు వ్రాసిన "అంకుల్ టామ్సు కాబిన్" అను గ్రంథమును చదివితివా? వింటివా? దక్షిణ రాష్ట్రములలోని ప్రాతకాలమునాటి నీగ్రో బానిసల దుఃఖమయగాథనిది చిత్రించుచున్నది. అంతఃకలహమునకు 10 సంవత్సరముల ముందు ఇది వెలువడ్డది. బానిసత్వమును ప్రతిఘటించుటకు అమెరికనులకిది తోడ్పడినది.

## 138

# అమెరికావారి కనపడని సామ్రాజ్యము

ఫిబ్రవరి 28, 1933

అమెరికాలోని అంతఃకలహమువల్ల యువకు లనేకులు ప్రాణముల గోల్పోయిరి. దేశమునకు మిగిలినది పెద్ద అప్పు. కాని ఆ దేశము

బాల్యమందుండుటచే, వీర్యవంతమై యుండుటచే దాని యభివృద్ధి సాగి పోయెను. ప్రకృతి సంపత్తి దాని కతిశయముగా నుండెను. ముఖ్యముగా ఖనిజములు అమితముగా దొరుకుచుండెను. నేటి పరిశ్రమకును, నాగరికతకును ఆధారమైన వస్తువులు మూడును అక్కడ సమృద్ధిగా నుండెను. అవి బొగ్గు, ఇనుము, పెట్రోలియం. అచ్చట జలశక్తి విస్తారముగా నుండుటచే దానినుండి విద్యుత్‌శక్తి పుట్టించుటకు వీలుగా నుండెను. నయాగరా జలపాత మిందుకు ఒక ఉదాహరణమని నీకు తట్టి యుండవచ్చును. దేశమా చాల పెద్దది. అందున్న జనులా స్వల్ప సంఖ్యాకులు—దేశమునకు తగినంత మంది లేరు. ప్రతివారికిని అక్కడ కావలసినంత మసలుటకు స్థలమున్నది. ఈ కారణములచేత అది గొప్ప పారిశ్రామిక దేశముగా, వస్తువులను తయారు చేయు దేశముగా వృద్ధినందుటకు వీళ్లుండెను. అది అట్లు వేగముగా వృద్ధినందుటకు ప్రారంభించెను. 1880 సంవత్సర ప్రాంతములకు అమెరికన్ పరిశ్రమలు, పరదేశ వ్యాపార రంగములలో బ్రిటిష్ పరిశ్రమతో పోటీ చేయ ప్రయత్నించెను. పరదేశ వర్తకములో నూరు సంవత్సరములపాటు సులభముగా అనుభవించిన బ్రిటన్ అగ్రగణ్యత్వమును అమెరికా, జర్మనీలు తుదముట్ట జేసినవి.

వలస జనులు దేశములోనికి ప్రవహించ ప్రారంభించిరి. యూరోపు నుండి అన్ని రకముల జనులును వచ్చుచుండిరి. జర్మనులు, స్కాండినేవియనులు, ఐరిష్ ప్రజలు, ఇటాలియనులు, జ్యూలు, పోలాండు జనులు. స్వదేశమున రాజకీయ భీభత్సమునకు భయపడి అనేకులు వచ్చిరి. బ్రతుకుతెరువుకై అనేకులువచ్చిరి. క్రిక్కిరిసియున్న యూరోపు లోని అదనపుజనము అమెరికాలోనికి వచ్చిపడిరి. అనేక తెగల, జాతుల, భాషల, మతముల అసాధారణమగు కదంబము (కలగా పులగము)అది. యూరోపులో వారందరు ఎవరిమట్టుకువారు, తమ చిన్న ప్రపంచము లలో, ఒకరినొకరు ద్వేషించుచు, విరోధించుచు నివసించుచుండిరి.

నూతన వాతావరణములో ఇప్పుడు వారందరు ఒక్కచో చేరిరి. ప్రాత ద్వేషముల కిక్కడ స్థానములేదు. ఒకేవిధమగు నిర్బంధ విద్యావిధానము కారణముగా వారి జాతీయ విభేదము లంతరించినవి. ఈ జాతుల కలగూర గంపనుండి అమెరికన్ మాదిరి జాతి పరిణమించ మొదలుపెట్టెను. ఆంగ్లో సాక్సన్ కుదురుకు సంబంధించిన ప్రాతవారు మాత్రము తాము కులీనులమని తలచుచుండిరి. వారు సంఘనాయకులు. వారి తరువాతను, వారికి కొద్దిదూరముననుఉన్నవారు ఉత్తర యూరోపునుండి వచ్చిన జాతులు. దక్షిణ యూరోపునుండి, ముఖ్యముగా ఇటలీనుండి వచ్చిన వారిని ఉత్తర యూరోపియనులు తిరస్కార భావముతో చూచుచు వారికి "డాగోస్" అను న్యూనత నాపాదించు పేరు పెట్టిరి. నీగ్రోల మాట చెప్పనే అక్కరలేదు. వారు అట్టడుగు భాగములోనుండిరి. వారు ఏ తెల్లజాతితోను కలియుటలేదు. పడమటి తీరమున చైనా, జపాన్, ఇండియా దేశస్థులు కొందరుండిరి. కూలికి గిరాకి అధికముగా నున్నప్పుడు వారు వచ్చిరి. ఈ ఆసియాదేశ జాతులును ఇతరులతో చేరకుండ వేరుగానుండిరి.

అంతటను వ్యాపించియున్న రైల్వే, టెలిగ్రాఫుల ఫలితము ఈ మహా దేశమును ఏకముగా కూర్చుటయే. ప్రాత దినములలో ఇది సాధ్యమయ్యేడిదికాదు. ఆరోజులలో ఒకతీరమునుండి ఇంకొక తీరమునకు పోవుటకు వారములు, లేదా మాసములు పట్టెడిది. వెనుకటి కాలమున ఆసియాలోను, యూరోపులోను మహా సామ్రాజ్యములు తరుచు ఉండెడివని మనము చూచియుంటిమి. ప్రయాణ సౌకర్యములు, రవాణా సౌకర్యములు లేని కారణమున ఆ సామ్రాజ్యములు సుబద్ధమై యుండలేదు. సామ్రాజ్యమందలి వివిధ భాగములు క్రియకు స్వేచ్ఛతోనే యుండెను. తమ బ్రతుకు తాము బ్రతుకుచుండెను. చక్రవర్తి సార్వభౌమత్వమును మాత్రము వారంగీకరించి, కప్పము కట్టుచుండిరి. ఒకే ఆధిపత్యముక్రింద చేరిన వివిధ దేశముల బిగువులేని సంఘములవి. సమాన దృక్పథము

వారికి లేదు. అమెరికా సంయుక్త రాష్ట్రములు మాత్రము, రైల్వేలు మున్నగు సంచార సాధనములవల్లను, ఒకే విధమగు విద్యావిధానము వల్లను భిన్నజాతులలో సమాన దృక్పథమును పెంపొందజేయగలిగిరి. క్రమ క్రమముగా ఈ జాతులన్నియు చేరి ఒకే కుదురుగా ఏర్పడినవి. ఈ కార్యము పూర్తికాలేదు. ఇంకను జరుగుచున్నది. ఇంత పెద్దఎత్తున ఇట్లు జాతులు ఏకమగుట చరిత్రలో మున్నెప్పుడును జరుగలేదు.

యూరోపియన్ గొడవలనుండియు, యూరోపియన్ రాజ్యముల కుట్రలనుండియు దూరముగా నుండుటకై సంయుక్త రాష్ట్రములు ప్రయత్నించెను. ఉత్తర, దక్షిణ అమెరికాల జోలికి యూరోపు రాకూడదని వారు కోరిరి. "మన్రో డాక్ట్రిన్" (మన్రో సిద్ధాంతము)ను గురించి ఇదివరలో నీకు చెప్పియుంటిని. స్పెయిన్ సామ్రాజ్యమును రక్షించుటకు, "హోలీ ఎల్లయన్సు" (పవిత్ర స్నేహము) అను పేర కొన్ని యూరోపియన్ రాజ్యములు దక్షిణ అమెరికా వ్యవహారములలో కలుగజేసికోకోరినప్పుడు, అమెరికా సంయుక్త రాష్ట్రముల ప్రెసిడెంటైన మన్రో ఈ సిద్ధాంతమును చేసెను. ఏ యూరోపియన్ రాజ్యములు, అమెరికాలో ఎచ్చటనైనను, సాయుధముగా కలుగజేసికొనుట సంయుక్త రాష్ట్రములు సహింపనేరవని మన్రో తెలియజేసెను. ఈ ప్రకటనవల్లనే దక్షిణ అమెరికా రిపబ్లిక్కులు యూరోపునుండి రక్షింపబడినవి. ఒకమారు ఇందుచే ఇంగ్లాండుతో యుద్ధము తటస్థించవలసినదే. కాని అమెరికా నేటికి నూరు సంవత్సరముల పాటు ఈ నీతిని జయప్రదముగా సాగించెను.

ఉత్తర అమెరికాకంటె దక్షిణ అమెరికా చాలభిన్నముగానుండెను. నూరు సంవత్సరములు గడచినను విభేదములు తగ్గలేదు. ఉత్తరమున నున్న కెనడా ఆనాటికానాడు సంయుక్త రాష్ట్రముల మాదిరి వృద్ధినందుచుండెను. దక్షిణ రిపబ్లికులు అట్లు చేయుటలేదు. దక్షిణ అమెరికాలోని రిపబ్లికులను, ఉత్తర అమెరికాలోనున్నను మెక్సికోను, లాటిన్ రిపబ్లికు

లందురు. సంయుక్త రాష్ట్రములకు, మెక్సికోకు మధ్యనున్న సరిహద్దులు భిన్న ప్రజలను, భిన్న సంస్కృతులను వేరుచేయుచున్నవి. దానికి దక్షిణమున చిన్న పీలికగానున్న మధ్య అమెరికాలోను, దక్షిణ అమెరికా ఖండమందంతటను ప్రజలు మాటాడుకొనుభాషలు స్పానిష్, పోర్చుగీసు భాషలు. ఈ రెంటిలోను ఎక్కువ ప్రచారములో నున్నది స్పానిష్ భాష. బ్రెజిల్‌లో మాత్రమే పోర్చుగీసు మాటాడుదురని నా నమ్మకము. దక్షిణ అమెరికాలో వ్యవహారమందుండుటవల్లనే స్పానిష్ భాష గొప్ప ప్రపంచ భాషలలో ఒక్కటైనది. సంస్కృతి సంబంధములు స్పెయిన్‌తోనే నేటికికూడ లాటిన్ అమెరికా పెట్టుకొనుచున్నది. సంయుక్త రాష్ట్రములలోను, కెనడాలోను ఉన్నంతగా జాతి విభేదములు లాటిన్ అమెరికాలో పరిగణించుటలేదు. స్పానిష్‌జాతివారికి ఆదిమవాసులతో, ఎర్ర ఇండియనులతో, కొంతవరకు నీగ్రోలతో వివాహ సంబంధము లుండుటవల్ల ఒక సంకరజాతి అక్కడ తయారైనది.

నూరు సంవత్సరములబట్టి స్వాతంత్ర్య మనుభవించుచున్నను ఈ లాటిన్ రిపబ్లికులు స్థిరపడుటకు సమ్మతించుటలేదు. ఉండుండియు విప్లవములు చెలరేగు చుండును. సైనిక నియంతృత్వము తలయెత్తు చుండును. నిరంతరము మారుచుండు వారి రాజనీతి గతిని, వారి ప్రభుత్వముల గతిని అనుసరించుట సులభముకాదు. దక్షిణ అమెరికాలోని ముఖ్య దేశములు మూడు—అర్జెంటీనా, బ్రెజిల్, ఛిలీ (**Argentina, Brazil, Chile**). ఇంగ్లీషులో వాని మొదటి అక్షరములనుబట్టి వానిని ఏ, బి, సి (**A, B, C**) దేశములందురు. ఉత్తర అమెరికాలో నున్న మెక్సికో ఒక ముఖ్య లాటిన్ అమెరికన్ దేశము.

లాటిన్ అమెరికా వ్యవహారములలో యూరోపు కలుగజేసికోకుండ, మన్రో సిద్ధాంతమును పెట్టి, సంయుక్త రాష్ట్రములు ఆటంకపరచెను. కాని వారికి భాగ్యము చేకూరిన కొలదియు, విస్తరించుటకు నూతన భూముల కొరకై వారు చూడజొచ్చిరి. వారి దృష్టి లాటిన్

అమెరికాపై పడుట సహజమే. వెనుకటి కాలములో సామ్రాజ్యములు నిర్మింపవలసి వచ్చినప్పుడు బలవంతముగా దేశములను గ్రహించు చుండిరి. వీరు నేడట్లు చేయలేదు. తమ సరుకు నక్కడికి పంపి వారి మార్కెట్టులను స్వాధీనము చేసికొనిరి. రైల్వేలు, ఖనులు మున్నగు దక్షిణ దేశమందలి కార్యములకు తమ ధనమును వారు పెట్టుబడిపెట్టిరి. ప్రభుత్వములకు వారు అప్పులిచ్చిరి. విప్లవ సమయములలో ఒక్కొక్కప్పుడు పోరాడు ప్రతికక్షులకు వారు అప్పులిచ్చిరి. వారు అనగా అమెరికన్ పెట్టుబడిదారులును, బాంకర్లును. కాని వారివెనుక వారిని ప్రోద్బలము చేయుచు అమెరికన్ ప్రభుత్వముండెను. తాము పెట్టుబడి పెట్టిన, లేదా అప్పులిచ్చిన ధనముద్వారా క్రమ క్రమముగా ఈ బాంకర్లు, చిన్నవియైన అనేక దక్షిణ, మధ్య అమెరికా ప్రభుత్వములను తమ వశములో పెట్టుకొనిరి. ఒకపక్షమునకు ధనమును, ఆయుధములను ఇచ్చుచు రెండవ పక్షమున కీయక ఈ బాంకర్లు విప్లవములు కూడ కలిగించు చుండిరి. బాంకర్ల వెనుక, పెట్టుబడిదారుల వెనుక సమర్థమగు సంయుక్త రాష్ట్ర ప్రభుత్వముండెను. ఇక బలహీనమగు చిన్న దక్షిణ అమెరికా దేశము లేమి చేయగలవు?

ఈ విధముగా అమెరికన్ పెట్టుబడిదారులు దక్షిణ మందలి ఈ చిన్న దేశములను పూర్తిగా తమ వశములోనికి తెచ్చుకొని వారి బాంకులను, రైల్వేలను, ఖనులను తామే నడిపించుచు, స్వలాభమునకై వానిని ఉపయోగించు చుండిరి. లాటిన్ అమెరికాలోని పెద్ద దేశములలోకూడ, వారి పెట్టుబడులవల్ల, ధనము వారి స్వాధీనములో నుండుటవల్ల వారికి పలుకుబడి ఎక్కువగా నుండెను. అనగా సంయుక్త రాష్ట్రములు ఈ దేశముల భాగ్యమును, లేదా అందలి పెద్ద భాగమును లోబరుచుకొనిరి. ఇది గమనింపదగిన విషయము. ఇది క్రొత్తవిధమగు సామ్రాజ్యము. నేటి మాదిరి సామ్రాజ్యము. ఇది కనబడదు. ఇది ఆర్థిక సంబంధమైనది. బాహ్యచిహ్నము లేమియు లేకుండనే ఇది స్వార్థోపయోగము చేసి

కొనును. తన అధికారమును చెలాయించును. దక్షిణ అమెరికా రిపబ్లి కులు రాజకీయముగా, అంతర్జాతీయముగా స్వేచ్ఛా స్వతంత్రతలు కలవి. దేశ పటమును చూచిన అవి చాల పెద్ద దేశములు. అవి సర్వ స్వతంత్రములు కావనుటకు ఎట్టి నిదర్శనములును లేవు. కాని అందనేకము సంపూర్తిగా సంయుక్త రాష్ట్రముల అధికారమునకు లోబడియున్నవి.

చరిత్రను పరామర్శించునప్పుడు మనము భిన్న యుగములలో అనేక విధముల సామ్రాజ్యములను చూచియుంటిమి. ప్రారంభదశలో— ఒకరు ఇంకొకరిపై యుద్ధమున విజయము సాధించినచో ఓడిన ప్రజలను, దేశమును విజేత లిష్టమువచ్చినట్లు చేసికొనవచ్చును. దేశమును, ప్రజలనుకూడ వారు లోబరుచుకొనుచుండిరి. అనగా పరాజితులు బానిసలగుచుండిరి. ఇది సామాన్యాచారము. బాబిలోనియనులచే యుద్ధమందు ఓడిపోయిన జ్యూలను, బాబిలోనియనులు పట్టుకొని బానిసలనుగా తీసికొని పోయినట్లు బైబిలులో కలదు. క్రమ క్రమముగా ఈ ఆచారము మారిపోయెను. వేరొక విధమగు సామ్రాజ్యము వచ్చెను. ఇందు దేశమును మాత్రమే లోబరుచుకొందురు. ప్రజలను దానిసలుగాచేయురు. పన్నులు విధించుట మున్నగు స్వార్థోపయోగ పద్ధతులచే వారినుండి సులభముగా ధనములాగవచ్చునని బహుశా తరువాత కనిపెట్టియుందురు. మనలో చాలమందికి ఇట్టి సామ్రాజ్యములతోనే పరిచయము. ఇండియాలోని బ్రిటిష్ సామ్రాజ్యమిట్టిదే. బ్రిటిష్‌వారు రాజకీయముగా ఇండియాను తమ వశమునందుంచుకొనకున్నచో ఇండియా స్వేచ్ఛ అనుభవించునని మన మనుకొందుము. కాని ఇట్టి విధమగు సామ్రాజ్యము అంతరించుచున్నది. దీనికి బదులు ఇంతకన్న అభివృద్ధి చెందిన, పరిపక్వమైన సామ్రాజ్యము వచ్చినది. ఈ అధునాతన సామ్రాజ్యము దేశమునుకూడ కలుపుకొనదు. భాగ్యమును, లేదా భాగ్యము నుత్పత్తిచేయు అంశములను మాత్రమే లోబరుచుకొనును. ఇట్లు చేయుటవల్ల దేశమును పూర్తిగా స్వప్రయోజనమునకై వినియోగించుకొనవచ్చును. దానిని

చాలవరకు నడిపించ వచ్చును. దేశమును పరిపాలించుట, దానిని అదుపులో పెట్టుట అను బాధ్యత వారు వహించవలసి యుండదు. పర్యవసానము, కొద్ది శ్రమతో దేశమును, అందలి ప్రజలను వీరి వశములో, వీరి అధికారమున నుందురు.

ఈ విధముగా కాలక్రమమున సామ్రాజ్యతత్వము పరిపూర్ణ స్థితిని పొందెను. నేటి తరహా సామ్రాజ్యము కనబడని ఆర్థిక సామ్రాజ్యము. బానిసత్వము నిషేధింపబడినప్పుడును, తరువాత ఫ్యూడల్ మాదిరి దాస్యము అంతరించినప్పుడును మానవునకు స్వేచ్ఛ వచ్చునని ఊహించి యుండిరి. కాని అచిరకాలములోనే, ధనసంపత్తి కలవారు మానవులను స్వార్థోపయోగము చేసికొనుచు వారిపై అధికారము చెలాయించుచుండుట గమనింపబడినది. బానిసలై, కమతగాండ్రై, మానవులు తుదకు కూలి-బానిసలైరి. స్వేచ్ఛ వారికింకను సుదూరములోనుండెను. దేశములపట్ల కూడ ఇంతే. ఒకదేశము, వేరొకదేశము పరిపాలనలో నున్నప్పుడు, పరపరిపాలన తొలగిన వెంటనే స్వాతంత్ర్యము దానంతట అదే వచ్చునని ప్రజ లూహింతురు. కాని ఇది అంతగా మనకు కనిపించదు. రాజకీయముగా స్వేచ్ఛనందిన దేశములు, ఆర్థికముగా అన్యదేశముల వారి కాలిక్రింద అణగియుండుట మనము చూచుచున్నాము. ఇండియాలోని బ్రిటిష్ సామ్రాజ్యమును అందరును ఎరిగినదే. ఇండియా రాజకీయముగా బ్రిటన్ స్వాధీనమందున్నది. ఈ దృష్ట సామ్రాజ్యము ప్రక్కనే దాని అదృష్ట సామ్రాజ్యమును కలదు. ఆర్థికముగా ఇండియా బ్రిటన్ స్వాధీనమందున్నది. ఈ అదృష్ట సామ్రాజ్యము దృష్ట సామ్రాజ్యము యొక్క అపరిహార్యమగు అంశ. అచిరకాలముననే ఇంగ్లాండుకు ఇండియాపైగల కనిపించు పట్టు సడలిపోవచ్చును. అయినను ఆర్థికముగా దానిపట్టు పోదు. అదృష్టసామ్రాజ్య రూపమున నది నిలిచి యుండ వచ్చును. అట్లే జరిగినట్లైన బ్రిటన్ ఇండియాను స్వార్థోపయోగము చేసికొనుచునే పోవును.

ఆర్థిక సామ్రాజ్య తత్వము, అధికారము చూపుచున్న రాజ్యము నకు, తత్కార్యము నిర్వహించుటలో ఎక్కువ కష్టములు కల్పించదు. రాజకీయ పరాధీనతవల్ల ప్రజల మనస్సులలో రవరవలు పుట్టును. ఆర్థిక పరాధీనత ప్రజలు చూడరు. కాబట్టి అట్టి పని జరుగదు. కాని కష్టము తోచినప్పుడు మాత్రము ప్రజలు అది పని చేయు విధమును తెలిసికొని అప్పుడు కోపింతురు. లాటిన్ అమెరికాలో ఇప్పుడు సంయుక్త రాష్ట్రి ములపై ప్రీతిలేదు. ఉత్తర అమెరికా అధికారమును ప్రతిఘటించుటకు లాటిన్ అమెరికా జాతులందరును ఏకము కావలెనని అనేక ప్రయత్న ములు చేసిరి. తరుచుగా సంభవించుచున్న అన్యోన్య కలహములను, నగరి విప్లవములను వారు మానుకొనిననేగాని వారే కార్యమును సాధించలేరు.

సంయుక్త రాష్ట్రిములయొక్క దృష్ట సామ్రాజ్యము ఫిలిప్పైను ద్వీపముల వరకును విస్తరించియున్నది. స్పెయిన్‌తో యుద్ధము చేసి ఆ దీవుల నమెరికా ఎట్లు సంపాదించినదో వెనుక నొక జాబులో చెప్పి యుంటిని. అట్లాంటిక్ సముద్రములోని క్యూబా ద్వీపమును పురస్క రించుకొని 1898 లో ఈ యుద్ధము తటస్థించెను. క్యూబా స్వాతంత్ర్య మును బడసెను. కాని అదినామమాత్రమే. క్యూబా, హైటేలు అమెరికా అధికారముక్రిందనే ఉన్నవి.

సుమారు పన్నెండు సంవత్సరములకు పూర్వము పెనామా కాలువ తెరువబడెను. అట్లాంటిక్ సముద్రమును పసిఫిక్ సముద్రముతో కలుపు మధ్య అమెరికాలోని సన్నని భూభాగమిది. సూయజ్ కెనాల్ నిర్మించిన ఫెర్డినండ్ డిలెస్సెప్సు అనువాడే 50 సంవత్సరములకు పూర్వము దీనిని కల్పనచేసి సూచించెను. కాని అతనికి కష్టములు సంభ వించుటచే అమెరికనులే ఈ కాలువను నిర్మించిరి. మన్యపుజ్వరము వలనను, పచ్చజ్వరము (Yellow fever) వలనను వారికి అమిత కష్ట ములు కలిగెను. ఈ రోగములను నిర్మూలింప పూనుకొని వారు కృత

కృత్యులైరి. మన్యపు జ్వరము మొదలగు రోగములు కలిగించుదోమలు గ్రుడ్లుపెట్టు స్థలములను వారు నిర్మూలనము చేసిరి. కాలువ ప్రాంతము నంతను ఆరోగ్యవంతముగా చేసిరి. ఈ కాలువ చిన్నదైన పెనామా రిపబ్లిక్‌లో ఉన్నది. కాని సంయుక్త రాష్ట్రముల వాగీ రిపబ్లికును, ఆ కాలువనుకూడ తమ వశమందుంచుకొని, నడిపించుచుండిరి. అమెరికాకీ కాలువ ఒక గొప్ప వరప్రసాదము. ఈ కాలువే లేకున్న వారి యోడలు దక్షిణ అమెరికాను చుట్టవలసి యుండెడిది. అయినను పెనమా కాలువ ప్రాముఖ్యము సూయజ్‌కాలువ ప్రాముఖ్యమంత గొప్పదికాదు.

ఇట్లు సంయుక్త రాష్ట్రములు నానాటికి ప్రబలమగుచుండెను. భాగ్యవంతమగుచుండెను. ఇతర వస్తువులతోపాటు ఆదేశములో కోటీశ్వరులు, ఆకాశమునంటు సౌధములు ఉత్పత్తి యగుచుండెను. అనేక విధములుగా వారు పురోగమించి యూరోపునందుకొని, దానిని దాటి పోయిరి. పారిశ్రామికముగా ప్రపంచమున వారు నాయకత్వము గడించిరి. వారి కార్మికుల జీవితమానము చాల హెచ్చుగానుండెను. ప్రపంచమందెచ్చటను ఇట్లు లేదు. 19 వ శతాబ్దిని ఇంగ్లాండులోవలెనే, ఈ ఐశ్వర్యము కారణముగా, సోషలిస్టులయొక్కయు, ర్యాడికలులయొక్కయు సిద్ధాంతములు వారిచెవి కెక్కకుండెను. కొందరిని మాత్రము మినహాయించినచో అమెరికన్ కార్మికులు చాల మితవాదులు; సంప్రదాయపరులు. వారికి ఇతర దేశములతో పోల్చి చూచిన కూలి బాగుగానే కిట్టుబడియగుచుండెను. ముందు బాగుపడగల పరిస్థితు లేర్పడవచ్చునను సందేహముతో ప్రస్తుత సౌఖ్యమును కార్మికు లెందుకు వదలుకొందురు ? కార్మికులలో ప్రధానముగా ఇటాలియనులును, డాగోలని న్యూనముగా పిలువబడువారును ఉండిరి. వారు బలహీనులు. వారిలో ఐక్యతలేదు. వారు న్యూనముగా చూడబడుచుండిరి. మంచి జీతమును తీసికొను కుశలులగు కార్మికులు సైతము ఈ డాగోలకన్న తాము భిన్నులమని తలచుచుండిరి.

అమెరికన్ రాజకీయములలో రెండు పక్షములు వృద్ధి చెందినవి. ఒకటి రిపబ్లికన్ పక్షము, రెండవది ప్రజాప్రభుత్వపక్షము. ఇంగ్లాండులో వలెనే, ఇంగ్లాండులోకన్న ఇంకను మిక్కుటముగా వారు భాగ్యవంతుల వర్గములకు ప్రతినిధులుగానున్నవారే. వారి సిద్ధాంతములలో భేదములు బహు తక్కువ.

ప్రపంచయుద్ధము తటస్థించి నప్పుడు పరిస్థితు లిట్టులుండెను. తుదకు యుద్ధమను సుడిగుండము అమెరికాను తనలోనికి లాగుకొన్నది.

## 139

# ఇంగ్లాండు, ఐర్లాండుల మధ్య ఏడువందల సంవత్సరముల పోరాటము

మార్చి 4, 1933

మరల మనము అట్లాంటిక్ సముద్రము దాటి ప్రాత ప్రపంచమునకు పోదము. సముద్రముపైగాని, గాలిలోగాని ప్రయాణము చేయువానికి తగులు మొదటి భూమి ఐర్లాండు. కాన మనమిక్కడ దిగుదము. యూరోపునకు దూర పశ్చిమముననున్న ఈ పచ్చని సుందరద్వీపము అట్లాంటిక్ సముద్రములోనికి కొంచెముగా ప్రవేశించియున్నది. ఇది చిన్న ద్వీపము. ప్రపంచ చరిత్రయొక్క ప్రధాన ప్రవాహముల కది దూరముగా నున్నది. చిన్నదైనను ఇది అద్భుత చరిత్రకలది. అనేక శతాబ్దుల కాలముపాటు బీరుపోని ధైర్యమును, అసాధారణ త్యాగమును జాతీయ స్వాతంత్ర్య సమరమున అది చూపియుండెను. ప్రబలముగానున్న పొరుగు రాజ్యముతో పోరాడుచు అది అద్భుతమగు పట్టుదలను చూపెను. 750 ఏండ్ల క్రిత మీ పోరాటము ప్రారంభమయ్యెను. నేటికిని అది తెగలేదు. ఇండియాలోను, చీనాలోను, ఇతర స్థలములలోను బ్రిటిష్ సామ్రాజ్యతత్వము ఎట్లు కార్యరూపమున ప్రకటమైనదో మనము

చూచియుంటిమి. తొలిదినముల నుండియు ఐర్లాండు దాని తీవ్రతను భరించవలసి వచ్చెను. అయినను ఇష్టముతో దాని కెన్నడును లొంగ లేదు. దాదాపు ప్రతి తరమువారును ఇంగ్లాండుపై ఐర్లాండు తిరుగబడుట చూచియుండిరి. ఐర్లాండు కన్నపుత్రులలో అనన్య సాహసోపేతులగు వారు స్వాతంత్ర్యమునకై పోరాడుచు మరణించిరి. లేదా ఇంగ్లీషు అధికారులచే ఉరిదీయబడిరి. తాము త్రికరణ శుద్ధిగా ప్రేమించిన మాతృ దేశమును వీడి బహు సంఖ్యాకులు ఐరిష్ ప్రజలు పరదేశములకు వలస పోయిరి. ఇంగ్లాండుతో యుద్ధము చేయుచున్న పర సైన్యములలో పలువురు చేరిరి. ఈ విధముగా తమ మాతృభూమిని వశపరచుకొని హింసించుచున్న దేశము నెదుర్కొని తమ బలమును రుచిచూప సావ కాశము కలుగునని తలచిరి. ఐర్లాండును వీడిపోయినవారు దూరదేశము లలో వ్యాపించిరి. ఎచ్చటికిపోయినను వారు తమ హృదయములలో ఐర్లాండును నిక్షిప్తము చేసికొనియే యుండిరి.

దురదృష్టవంతులును, పెనుగులాడుచున్న పీడిత దేశములును, అసంతుష్టులును, వర్తమానమున సుఖములేనివారందరును గతకాలము వైపు దృష్టి మరల్చి అందు అనునయము పొందుటకు చూచుచుందురు. గత కాలమెంతో మహత్తరమైనదని అనుకొందురు. గతించిన గొప్పను తలుచుకొని సంతుష్టి నొందుచురు. వర్తమానము దుఃఖ భూయిష్టమై యున్నప్పుడు గత కాలము దుఃఖశాంతిని, ఆవేశమును ఇచ్చును. ప్రాత కష్టములు మరపునకు రావు. మనస్సులో మెలగుచుండును. ఇట్టి వెనుక దృష్టి జాతియొక్క ఆరోగ్య చిహ్నముకాదు. ఆరోగ్యవంతులును, స్వస్థ దేశములును వర్తమానమందే పనిచేయుదురు. భావిపైననే చూపు పెట్టు దురు. స్వేచ్ఛలేని మానవుడుగాని, జాతిగాని ఆరోగ్యముగా నుండ జాలరు. కావుననే వారు వెనుకదృష్టి ప్రసరించి గతకాలమున కొంత వరకు నివసింతురు.

కావున ఐర్లాండు ఇంకను భూతకాలమునందే నివసించియుండెను.

తాము స్వేచ్ఛగానున్న గత కాలమును ఐరిష్ ప్రజలు తలచుకొని గర్వింతురు. వారు తమ ప్రాతకష్టములను స్మరింతురు. స్వేచ్ఛకై తాము చేసిన పోరాటములను స్పష్టముగా జ్ఞప్తికి తెచ్చుకొందురు. వారు వెనుకకు చూతురు. 1400 సంవత్సరములకు పూర్వము, క్రీస్తు తరువాత ఆరవ శతాబ్దిపై వారి దృష్టిపడును. అప్పుడు ఐర్లాండు పడమటి యూరోపున కెల్ల విద్యాకేంద్రము. దూరప్రాంతములనుండి విద్యార్థు లచ్చటికి వచ్చెడివారు. రోమక సామ్రాజ్యము పతనము కాగానే వాండాలులును, హూణులును రోమక నాగరికతను తుదముట్టించిరి. ఆరోజులలో సంస్కృతి దీపము వెలుగుచున్న దేశములలో ఐర్లాండు ఒక్కటి అని చెప్పుదురు. తరువాత యూరోపులో సంస్కృతి పునరుద్భవించెను. ఐర్లాండుకు క్రైస్తవమతము ఇతరదేశములకన్న ముందుగానే వచ్చెను. ఐర్లాండు ఇలవేలుపు సెయింట్ పాట్రిక్ ఆ మతమును కొనివచ్చెనట. ఐర్లాండు నుండి ఉత్తర ఇంగ్లాండున కది ప్రాకెను. ఐర్లాండులో అనేక మఠములు వెలసెను. ఇండియాలో ప్రాచీన ఋష్యాశ్రమముల, బౌద్ధ మఠముల వలెనే ఇవియును విద్యాకేంద్రములయ్యెను. ఆరుబయిట తరుచు విద్య గఱపుచుండిరి. ఈ మఠములనుండి మత ప్రచారకులు ఉత్తర, పశ్చిమ యూరోపునకు, అక్రైస్తవులకే నూతనమతమగు క్రైస్తవమును బోధించుటకు వెళ్ళిరి. ఈ ఐరిష్ మఠములలో నుండు సన్యాసులు కొందరు అందమగు వ్రాత ప్రతులను, రంగురంగుల అక్షరములతో అందముగా తయారుచేసిరి. అట్టి అందమగు వ్రాత ప్రతి యొకటి, బుక్ ఆఫ్ కెల్సు అను పేరుగలది నేడు డబ్లిన్‌లో భద్రము చేయబడినది. బహుశా 1200 సంవత్సరములకు పూర్వమది వ్రాయబడినది.

6 వ శతాబ్ది మొదలుకొని రెండు, మూడు వందల సంవత్సరముల కాలము—ఐరిష్ ప్రజలచే ఐర్లాండుయొక్క స్వర్ణయుగముగా పరిగణింపబడెను. అప్పుడు గాలిక్ సంస్కృతి అత్యుచ్ఛలో నుండెను. ఇంతకాలము జరుగుటచేత బహుశా ఆ ప్రాచీనకాలమున కొక విధమగు

మహాత్మ్యము ఆపాదింపబడియుండును. ఉన్నదానికంటె గొప్పగా కని పించుట కది కారణమై యుండును. ఆనాటి ఐర్లాండు అనేక తెగల వశమై చీలియుండెను. ఈ తెగల వారొకరితో నొకరు నిరంతరము పోరాడుచుండిరి. ఇండియాలోవలెనే ఐర్లాండు దుర్బలత్వమునకు కారణము ఈ పోరాటములే. తరువాత డేనులు, నార్సుమెన్ వచ్చిరి. ఇంగ్లాండు, ఫ్రాంసు దేశములలోవలెనే ఐరిష్ ప్రజలను వారు పీడించి పెద్ద భూభాగములను ఆక్రమించిరి. 7వ శతాబ్ది తొలిలో ఒక ఐరిష్ రాజు, బ్రయన్ బొరుమ అనువాడు ప్రసిద్ధుడయ్యెను. అతడు డేనులను ఓడించి ఐర్లాండును తాత్కాలికముగా ఏకముచేసెను. కాని ఆ దేశము, అతని మరణానంతరము, మరల చీలిపోయెను.

విజేత విలియం నాయకత్వమున నార్మనులు 11వ శతాబ్దిలో ఇంగ్లాండును ఓడించిరని నీకు జ్ఞాపక ముండవచ్చును. వంద సంత్సర ములు గడచిన తరువాత ఈ ఆంగ్లో-నార్మనులు ఐర్లాండుపై దండెత్తిరి. వారు జయించిన భాగమునకు 'పేల్' అని పేరు. 1169 లో జరిగిన ఈ నార్మన్ దండయాత్ర ప్రాచీన గాలిక్ నాగరికతకు పెద్ద దెబ్బ అయ్యెను. ఐరిస్ తెగలతో ఎడతెగని యుద్ధముల కిదియే ప్రారంభము. ఈ యుద్ధ ములు వందల కొలది సంవత్సరముల కాలము జరిగెను. అవి అమిత క్రూరముగాను, అసభ్యముగాను జరిగెను. ఇంగ్లీషువారు (ఆంగ్లో-నార్మ నుల నిప్పు డీ పేరుతో పిలువవచ్చును) ఎప్పుడును ఐరిష్ వారిని అనాగ రిక జాతిగా చూచుచుండిరి. వా రుభయులకును జాతిలో భేదముండెను. ఇంగ్లీషువారు ఆంగ్లో-సాక్సనులు. ఐరిష్వారన్ననో కెల్టులు. తరువాత మతములోకూడ వీరికి భేదము వచ్చెను. ఇంగ్లీషువారును, స్కాచ్ వారును ప్రొటెస్టెంటులైరి. ఐరిష్వారు రోమన్ కేతలిక్ మతమునే నమ్మియుండిరి. కాన ఆంగ్లేయులకు, ఐరిష్వారికి జరిగిన యుద్ధములు జాతి, మత యుద్ధములవలెనే పగతో సాధింపబడినవి. ఇంగ్లీషువారు బుద్ధిపూర్వకముగా ఈ రెండు తెగలు మిశితము కాకుండ అడ్డుపెట్టిరి.

ఇంగ్లీషువారికిని, ఐరిష్ వారికిని అంతర్వివాహములు నిషేధించుచు ఒక శాసనము (కిల్ కెన్నీ చట్టము) అమలు జరుపబడెను.

తిరుగుబాటు వెనుకతిరుగుబాటు ఐర్లాండులో తటస్థించెను. ప్రతి తిరుగుబాటును మిక్కిలి క్రూరముగా అణచివేయబడెను. ఐరిష్‌వారు తమ్ము పాలించు పర రాజులను ద్వేషించుట సహజమే. తరుణము వచ్చినప్పుడెల్ల,రానప్పుడుసైతము వారు తిరుగబడిరి."ఇంగ్లాండు కష్టము ఐర్లాండు తరుణము" అనే ప్రాతసామెత కలదు. కారణములు రాజకీయ ములైనను. మతమునకు సంబంధించిన వైనను తరుచు ఐర్లాండు, ఫ్రాంసు, స్పెయిన్‌వంటి ఇంగ్లాండు శత్రువుల పక్షమునే చేరుచుండెను. ఇందువల్ల ఇంగ్లీషుల క్రోధ మతిశయించెను. వెనుకపాటున వచ్చి వీపులో పొడుచుటవంటి పని ఐర్లాండు చేసినదని వారు భావించిరి. అందు చేత అన్నివిధముల క్రూరకృత్యములను నెరపి వారు బదులు తీర్చిరి.

ఎలిజబెత్ రాణి కాలమున (16 వ శతాబ్ది) విప్లవశీలులగు ఐరిష్ ప్రజల ప్రతిఘటనను భగ్నము చేయుటకు నిశ్చయించబడినది. వారి మధ్యను ఇంగ్లీషు భూస్వాములను కాపురముంచి వారిని లేవకుండ చేయ బూనిరి. అందుకై భూమిని ఇంగ్లీషువారు స్వాధీనము చేసికొనిరి. ఐరిష్ భూస్వాముల స్థానే పరదేశులు ప్రవేశించిరి. ఇట్లు పరదేశ భూ స్వాములతో ఐర్లాండు కృషికజాతి అయ్యెను. వందల సంవత్సరములు గడచి చనినప్పటికిని, ఈ భూస్వాములు ఐరిష్ ప్రజలదృష్టిలో పరదేశులు గానే ఉండిరి.

ఎలిజబెత్ అనంతరము జేమ్సు I రాజయ్యెను. ఐరిష్ వీర్యము నంతరింపజేయు కృషిలో ఈతడొక అడుగు ముందుకుపోయెను. ఐర్లాం డులో పరదేశులకు వలస నేర్పరుచుట కతడు తీర్మానించెను. ఇందుకై ఐర్లాండుకు ఉత్తరమునన్న అల్స్టర్‌లోని దాదాపు ఆరు కౌంటీలను రాజు స్వాధీనము చేసికొనెను. ఉచితముగా భూమి పొందవచ్చునని ఇంగ్లాండునుండియు, స్కాట్లాండునుండియు సాహసికులు, గుంపులు

గుంపులుగా వచ్చిరి. ఈ ఇంగ్లీషు, స్కాచ్‌వారిలో పలువురకు భూమి లభించెను. వారు వ్యవసాయదారులుగా అక్కడ నిలిచిపోయిరి. ఈ వలస కార్యమున తోడ్పడమని లండన్ నగరమునుకూడ అడిగిరి. అల్స్టర్‌లో వలసకై అది ఒక ప్రత్యేకసంఘమును స్థాపించెను. ఇందు వల్లనే ఉత్తరముననున్న డెర్రీనగరము లండన్ డెర్రీ అను పేరు బడసినది.

ఇట్లు ఐర్లాండులో బ్రిటన్‌ను అతుకుపెట్టగా అల్స్టర్ తయారయ్యెను. ఐరిష్ ప్రజల కిది క్రోధకారణమగుటలో ఆశ్చర్యములేదు. క్రొత్తగా ఏర్పడిన అల్స్టరు వాసులు ఐరిష్‌వారిని ద్వేషించుచుండిరి. వారిని నీచముగా చూచుచుండిరి. ఐర్లాండును రెండు వైరి పక్షములుగా విభజించిన ఇంగ్లాండు సామ్రాజ్యతత్వ రాజనీతి ఎంత గడుసరిగానున్నదో! 300 సంవత్సరములు దాటినను అల్స్టర్ సమస్య పరిష్కారము కాకుండ ఆ విధముగానే నిలిచిపోయెను.

అల్స్టర్ వలస జరిగిన పిమ్మట ఇంగ్లాండులో ఛార్లస్ I కిని పార్లమెంటుకును అంతఃకలహము కలిగెను. పార్లమెంటు పక్షమున ప్యూరిటనులు, ప్రొటెస్టంటులు చేరిరి. కాన కేతలిక్ ఐర్లాండు రాజు పక్షమును చేరెను. అల్స్టర్ పార్లమెంటుకు మద్దతుగానుండెను. ప్యూరిటనులు, కెతాలిక్ మతమును అణచివేయుదురని ఐరిష్‌వారు భయపడిరి. ఇందుకు కారణము లేకపోలేదు. కాబట్టి వారు 1641 సంవత్సరమున గొప్ప తిరుగుబాటు చేసిరి. ఈ తిరుగుబాటును, దీనిని అణచివేసిన విధానమును వెనుకటికంటె క్రూరతరముగను, అసభ్యముగను ఉండెను. ఐరిష్ కేతలిక్కులు, క్రూరముగా ప్రొటెస్టంటులను సంహారము చేసిరి. క్రాంవెల్ పగతీర్చుకొన్న విధము ఘోరముగానుండెను. ఐరిష్ వారనేక పర్యాయములు సంహరింపబడిరి. ముఖ్యముగా ఐరిష్ పురోహితులు వధింపబడిరి. నేటికిని ఐర్లాండులో క్రాంవెల్‌ను ద్వేషింతురు.

క్రౌర్యనిరంకుశత్వములు ఇంతగా వున్నప్పటికిని ఒక తరము గడ

చిన పిమ్మట విప్లవము, అంతఃకలహము మరల పొడచూపెను. అందు రెండు విశేషములను గురించి చెప్పవలసియున్నది. ఒకటి లండన్‌డెర్రీ ముట్టడి, రెండు లిమరిక్ ముట్టడి. 1688 లో కాతలిక్కులగు ఐరిష్ వారు అల్స్టర్‌లోని ప్రొటెస్టంటు లండన్ డెర్రీని ముట్టడించిరి. ముట్టడిలో నున్న ప్రజలు తిండి మిగలక ఉపవాసము చేయుచునే ధైర్య సాహస ములతో పోరాడి దానిని రక్షించిరి. నాలుగునెలలు తిండిలేక ముట్టడిలో నుండిరి. చివరకు ఇంగ్లీషునావలు ఆహారమును, సహాయమును తెచ్చెను. 1690 లో లిమరిక్‌లో, కాతలిక్కు ఐరిష్‌వారు ఇంగ్లీషువారిచే ముట్ట డింప బడిరి. ఈ ముట్టడి వీరుడు పాట్రిక్ సార్సు ఫీల్డు. పరబల మధిక ముగా నున్నను ఇతడు లిమరిక్‌ను ధైర్య సాహసములతో కాపాడెను. ఈ రక్షణ కార్యమున ఐరిష్ స్త్రీలుకూడ తోడ్పడిరి. నేడుకూడ ఐర్లాండు పల్లెలలో సార్సుఫీల్డును గూర్చియు, ధైర్యవంతులగు అతని సహచరుల గూర్చియు గాలిక్ పదములు పాడుచుందురు. చివరకు సార్సుఫీల్డు గౌరవసంధి ఇంగ్లీషువారితో చేసికొన్న పిమ్మటనే లిమరిక్‌ను వదలి పెట్టెను. పురజనులకు సంబంధించినట్టియు, మతమునకు సంబంధించి నట్టియు, సంపూర్ణ స్వేచ్ఛ ఐరిష్ కాతలిక్కులకిచ్చుట లిమరిక్ సంధిలో ఒక షరతు.

ఇంగ్లీషులచే, అనగా ఐర్లాండులోని ఇంగ్లీషు భూస్వాముల కుటుం బములచే ఈ లిమరిక్ సంధి భగ్నము గావింపబడెను. ఈ ప్రొటస్టంటు కుటుంబములు డబ్లిన్‌లోని ఒక చిన్న పార్లమెంటును తమ వశములో నుంచుకొని నడుపుచుండిరి. లిమరిక్‌వద్ద త్రికరణశుద్ధిగా వాగ్దానముచేసి యుండియు వారు కేతలిక్కులకు పౌర, మత స్వేచ్ఛ నిచ్చుటకు తిరస్క రించిరి. ఇది చేయుటకు బదులు వారు కేతలిక్కులపై నేరారోపణము చేయుచు ప్రత్యేక శాసనముల నమలుపరచిరి, ఐరిష్‌వారి ఉన్ని వ్యాపార మును బుద్ధి పూర్వకముగా ధ్వంసముచేసిరి. వారి రైతులను క్రూరముగా అణచివేసిరి. భూములనుండి వారిని గెంటివేసిరి. జనసంఖ్యలో అధిక

సంఖ్యాకులు కేతలిక్కులు. వారిలో పలువురు రైతులు. ఇట్టివారికి వ్యతిరేకముగా పరదేశులగు ప్రొటస్టెంటు భూస్వాములే ఇట్టిపని చేసిరని జ్ఞాపక ముంచుకొనుము. కాని అధికారమంతయు ఈ ఇంగ్లీషు భూస్వాముల చేతులలోనే ఉండెను. ఈ భూస్వాములన్ననో వారి భూములవద్ద నివసించుచుండుటలేదు. కొల్లగొట్టు స్వభావముగల ఏజెంట్లు, శిస్తు వసూలు చేయువారి చేతులలోబడి రైతులు నలిగిపోవుచుండిరి.

లిమరిక్‌గాథ ప్రాతబడినది గాని త్రికరణశుద్ధిగా చేసిన వాగ్దానము భగ్నము చేసినందువలన కలిగిన ద్వేషము, క్రోధము మాత్రము ఉపశమించలేదు. నేడుసైతము ఐర్లాండులో ఇంగ్లీషులు చేసిన ద్రోహములను తలపునకు తెచ్చుకొనునప్పుడు ఐరిష్ జాతీయవాదులు తొలుదొల్త దీనిని స్మృతికి తెచ్చుకొందురు.సంధిని భగ్నము చేసినందువల్లను, మత అసహనము వల్లను, భూస్వాముల క్రౌర్యమువల్లను, ఆ కాలమున ఐరిష్ ప్రజలనేకులు ఇతర దేశములకు పోవలసి వచ్చెను. ఐరిష్ యువకులలో శ్రేష్ఠులు అన్యదేశములకు పోయిరి. ఇంగ్లాండుకు వ్యతిరేకముగా పోరాడు దేశముపక్షమున పోరాడుటకు సంసిద్ధులైరి. ఇంగ్లాండుతో ఎచ్చట పోరాటమున్నను అచ్చట ఐరిష్ ప్రజలు ఉండిరన్నమాటయే.

ఈ కాలమున జొనాథన్ స్విఫ్టు నివసించియుండెను. 1667 మొదలు 1745 వరకు అతడు జీవించియుండెను. గలివర్ యాత్రలు అను గ్రంథమును అతడు వ్రాసెను. అతనికి ఇంగ్లీషువారిపై ఎంత కోపమో అతడు ఐరిష్ ప్రజలకిచ్చిన సలహానుబట్టి గ్రహించవచ్చును. ఆ సలహా ఇది—"ఇంగ్లీషువారి ప్రతి వస్తువును తగులబెట్టుడు. వారి బొగ్గును మాత్రము తగులబెట్టవద్దు." డబ్లిన్‌లో సెయింటు పాట్రెక్సు కెతీడ్రలు (గుడి)లో ఉన్న అతని సమాధిపై చెక్కబడిన వాక్యము లింకను కఠినముగ నున్నవి. తన మృతిని గూర్చిన ఈ వాక్యములు బహుశా అతడే వ్రాసియుండును—

ముప్పది సంవత్సరములు

ఈ గుడిలో డీన్ (గురువు)గా పనిచేసిన
జొనాథన్ స్విఫ్టు దేహ మిందున్నది
దుర్వారక్రోధ మిక ముందు
ఆతని హృదమును దహింపజాలదు.

పాంథుడా! పొమ్మ,
చేతనైన అతనిని అనుకరింపుము
స్వాతంత్రమును కాపాడుటకు
అతడు వీరపురుషునివలె మెలగెను.

1774 లో అమెరికన్ స్వాతంత్ర్య యుద్ధము ప్రారంభమాయెను. బ్రిటిషు సైన్యములను అట్లాంటిక్ మీదుగా పంపవలసి వచ్చెను. ఇప్పుడు ఐర్లాండులో బ్రిటిష్ సేనలులేవు. ఫ్రాంసుకూడ ఇంగ్లాండుపై యుద్ధము ప్రకటించుటచే ఫ్రెంచి దండయాత్ర జరుగునని కింవదంతి పుట్టెను. కాని ఐరిష్ కాతలిక్కులును, ప్రొటస్టెంటులును రక్షణకై స్వచ్ఛంద సైనికుల సమకూర్చిరి. ప్రాతవైరములను వారు తాత్కాలికముగా మరచిరి. అన్యోన్య సహకారము చేసికొనుచు స్వశక్తి ప్రభావమును గమనించిరి. మరియొక విప్లవము ఐర్లాండులో తటస్థించునేమోయని ఇంగ్లీషువారు భయపడిరి. అమెరికా తమనుండి వీడిపోవుచున్నట్లే ఐర్లాండుకూడ వీడిపోవునేమో అని భయపడి, ఐర్లాండుకు స్వతంత్ర పార్లమెంటును అనుగ్రహించిరి. ఇట్లు మాటవరుసకు ఐర్లాండు, ఇంగ్లాండు నుండి స్వతంత్రమైనప్పటికిని క్రియకు ఒకే రాజు పాలనక్రిందనే ఉండ జొచ్చెను. ఐరిష్ పార్లమెంటు అన్ననో వెనుకటివలెనే భూస్వాముల చెప్పుచేతలలో నుండెను. ప్రొటస్టెంటులే అందు సభ్యులు. వెనుకటి రోజులలో కాతలిక్కులను పీడించిన దిదే. ఇంకను కాతలిక్కులపై అనేక విధములుగా నేరారోపణ చేయుచు వారిని దండించుచుండిరి. గ్రుడ్డిలో మెల్ల ఏమనగా వెనుకటికంటె ఇప్పుడు కాతలిక్క ప్రొట స్టెంటులలో కొంత సౌమనస్యము కుదిరినట్లుండెను. ఈ పార్లమెంటుకు

నాయకుడు హెన్రీ గ్రట్టన్. అతడు ప్రొటస్టెంటు.అయినను కాతలిక్కుల కష్టములను తొలగించ దలచెను. కాని ఆతడు చేయదగినది బహు స్వల్పము.

ఇంతలో ఫ్రెంచి విప్లవము సంభవించెను. ఐర్లాండులో అది ఆశలను పురిగొల్పెను. విశేషమేమన కాతలిక్కులు, ప్రొటస్టెంటులును దీని నామోదించిరి. వారు రానురాను ఒకరిసమీపమునకు ఒకరు వచ్చు చుండిరి. వారిని ఏకముచేయుటకును, కాతలిక్కుల కష్ట విముక్తికిని "సంయుక్త ఐరిష్ ప్రజలు"అను సంస్థ ప్రారంభించ బడెను. సంయుక్త ఐరిష్ ప్రజాసంస్థ ప్రభుత్వమంగీకరించలేదు సరికదా దాని నణచివేసెను. కాన అనివార్యమగు విప్లవము 1798 లో తటస్థించెను. వెనుకటి కొన్ని విప్లవములు అల్స్టర్ కును, మిగత దేశమునకును సంబంధించిన మత యుద్ధములు. ఇది అట్టిదికాదు. ఇది జాతీయ విప్లవము. కొంతవరకు ఉభయ మత కక్షలవారును ఇందు చేరిరి. ఇంగ్లాండు ఈ విప్లమును అణచివేసి దీనికి నాయకుడైన ఐరిష్ వీరుని, వుల్ఫుటోన్ అను వానిని, ద్రోహియని ఉరిదీసెను.

స్వతంత్ర పార్లమెంటును ఐర్లాండుకు ప్రసాదించుటవల్ల ఐరిష్ ప్రజల కెట్టి లాభములును సమకూరలేదన్నమాట స్పష్టమైనది. ఆనాటి ఇంగ్లీషు పార్లమెంటు పాకట్ బరోస్ మున్నగువానిచే ఎన్నుకొనబడు చుండెను. అది కొద్దిమంది భూస్వాములచేతను భాగ్యవంతులగు కొద్ది మంది భాగ్యవంతులచేతను నడుపబడుచుండెను. అది విశాల భావములు లేక అవినీతకరముగా నుండెను. ఐరిష్ పార్లమెంటునకును ఈ దోషము లన్నియు పట్టినవి. పైపెచ్చు కాతలిక్కు దేశములో కొద్దిమంది ప్రొట స్టెంటుల కరగతమై అది ఉండెను. అయినను బ్రిటిష్ ప్రభుత్వము ఈ ఐరిష్ పార్లమెంటును తుదముట్టించుటకును, ఐర్లాండును బ్రిటనులో కలుపుకొనుటకును నిశ్చయించెను. ఐర్లాండు దీనిని తీవ్రముగా ప్రతి ఘటించెను. డబ్లిన్ పార్లమెంటు సభ్యులకు పెద్ద లంచములు పెట్టుటచే

వారంతట వారే తమ పార్లమెంటును తుదముట్టించుటకు వోటు చేసి కొనిరి. 1800 లో యూనియన్ ఆక్టు జారీ చేయబడినది. ఇట్లు గ్రట్టన్ యొక్క అర్ధాయుష్యపు పార్లమెంటు అంతరించెను. అందుకు బదులు కొందరు ఐరిష్‌సభ్యులు లండన్‌లోని బ్రిటిష్ పార్లమెంటుకు బంపబడిరి.

అవినీతికరమగు ఐరిష్ పార్లమెంటును తుదముట్టించుటవల్ల గొప్ప హాని కలిగినదని చెప్ప వీలులేదు. కానైతే అది నిలిచియున్న యెడల ముందు ముందు మంచిస్థితికి వచ్చెడిదేమో! కాని ఈ యూనియన్ ఆక్టు ఒక గొప్ప కీడు కలిగించెను. బహుశా ఇట్టి కీడు కలుగవలెననియే అసలు ఉద్దేశమై యుండవచ్చును. ఉత్తరాదివారికిని, దక్షిణాదివారికిని,అనగా ప్రొటస్టెంటులకును కాతలిక్కులకును మధ్య జరుగుచున్న సమైక్యత నది భగ్నము చేయగలిగినది. ప్రొటస్టెంటు అల్స్టరు ।మిగత ఐర్లాండునుండి తన దృష్టిని మరలించెను. ఐర్లాండులోని రెండు భాగములును వేరుపడిపోయెను. ఈ రెండు భాగములకును మరియొక భేదము పొడగట్టెను. ఇంగ్లాండు వలెనే అల్స్టరు నవీన పరిశ్రమలను చేపట్టెను. ఐర్లాండు మిగత భాగము వ్యవసాయము చేయుచునే ఉండెను. ఎడతెగకుండ ప్రజలు వలస పోవుటచేతను, భూమికి సంబంధించిన ఆనాటి కట్టుబాట్లచేతను వ్యవసాయమైనను వృద్ధిలోలేదు. ఇట్లు ఉత్తరమున నున్నవారు పారిశ్రామికముగా వృద్ధినందుచుండగా దక్షిణమున, తూర్పున, ముఖ్యముగా పడమర నున్నవారు పారిశ్రామికముగా వెనుకబడి యుండిరి. మధ్యయుగముల వారివలెనే ఉండిరి.

యూనియన్ ఆక్టు జారీ చేసినందుకు అసమ్మతిని చూపుచు తిరుగుబాటు కలుగకపోలేదు. నిష్ఫలమైన ఈ తిరుగుబాటుకు నాయకుడు రాబర్టు ఎమ్మెల్. ఇతడు ప్రజ్ఞాశాలియగు యువకుడు. తనకు ముందున్న తన దేశస్థులనేకులవలెనే తానును ఉరిశిక్షకు పాత్రుడయ్యెను.

బ్రిటిష్ కామన్సు సభకు ఐరిష్ సభ్యులు వెళ్ళిరి. కాతలిక్కులు మాత్రము వెళ్ళలేదు. ఇంగ్లాండులోగాని, ఐర్లాండులోగాని కాతలిక్కులు

కామన్సుకు వెళ్లటకు వీలులేదు. 1829 లో ఈ ప్రతి బంధకములు తొలగింప బడినవి. కాతలిక్కులు బ్రిటిష్ పార్లమెంటుకు సభ్యులుకావచ్చును. ఈ ప్రతి బంధకములు తొలగించుటలో కృతకృత్యుడైనవాడు ఐరిష్ నాయకుడగు డానియల్ ఓకానెల్. అందుచేతనే అతనిని "లిబరేటర్" (విముక్తి నిచ్చినవాడు) అనిరి. క్రమ క్రమముగా వచ్చిన మరియొక మార్పు వోటింగు హక్కును విస్తరించుట. ఇందుచే ఎక్కువమందికి వోటు నిచ్చు హక్కు సంక్రమించెను. ఐర్లాండు నిప్పుడు బ్రిటన్‌తో కలుపుటచేత రెండు దేశములకును సమాన శాసనములే అనువర్తించు చుండెను. 1832 సంవత్సరమునాటి గొప్ప రిఫారమ్ బిల్లు బ్రిటనుకును, ఐర్లాండుకును కూడ వర్తించెను. తరువాత వచ్చిన ఫ్రాంచైజ్ బిల్లు కూడ అంతే. ఈ విధముగా బ్రిటిష్ కామన్సు సభలోని ఐరిష్ సభ్యుడు క్రమముగా మారిపోయెను. భూస్వాముల ప్రతినిధిగా నుండు నాతడు ఇప్పుడు కాతలిక్కు కృషికుల పక్షమునను, ఐరిష్ జాతీయత తరపునను మాటాడుచుండెను.

భూస్వాములచే పీడింపబడుచు హెచ్చుపన్ను లిచ్చుకొనలేక బాధపడు ఐరిష్ రైతులు దారిద్ర్యముచేత ఉర్లగడ్డలను ముఖ్యముగా తిని బ్రదుకుచుండిరి. వారికి ఉర్లగడ్డలే జీవనాధారము. నేటి హిందూ దేశపు రైతులవలెనే వారును ఆహారము నిలువయుంచుకొనుటలేదు. వెనుక ఆధారమేమియు లేదు. ఏదో ఒక విధముగా దేహమును నిలుపుకొనుచుండిరి. దేహపటుత్వము వారికి లేదు. 1846 లో ఉర్లగడ్డ పంట పండలేదు. అందుచే పెద్ద కరువు వచ్చెను. క్షామము దేశమున చెలరేగుచున్నను, శిస్తులీయలేదని రైతులను తొలగించిరి. ఐరిష్ ప్రజలనేకులు ఇండ్లువదలి అమెరికా మున్నగుదేశములకు పోయిరి. ఐర్లాండు దాదాపు జనశూన్యమయ్యెను. దున్నకపోవుటచే అనేక పొలములు బీళ్లాయెను.

దున్ని వ్యవసాయము చేయుట కనువైన భూమిని, గొర్రెలను మేపుటకు పనికివచ్చు బీడు భూమిగా మార్చుట నూరు సంవత్సరముల

పైబడి వచ్చుచు నేటి కాలమువరకును జరుగుచున్నది. ఇందుకు ప్రధాన కారణము ఉన్నిబట్టలు నేయుటకై ఫ్యాక్టరీలు ఇంగ్లాండులో వృద్ధి యగుట. యంత్రసామగ్రి అధికము చేసినకొద్దియు ఉత్పత్తి అధికము కాజొచ్చెను. అందుకై అధికముగా ఉన్ని కావలసి వచ్చెను. మనుష్యులు పనిచేయు వ్యవసాయ భూములకన్న గొర్రెలు మేయు బీడు భూములే భూస్వాములకు లాభకరముగా నుండెను.

బీడుభూములలో పనిచేయుటకు కొద్దిమంది మనుష్యులే చాలును. గొర్రెల కాపలాకు కొద్దిమంది మనుష్యులున్న చాలును. కాన వ్యవసాయ కూలీల అవసరము లేకుండుటచే భూస్వాములు వారిని వెళ్లగొట్టిరి. ఈ విధముగా ఐర్లాండు నిజమునకు జనసంఖ్య తక్కువగానున్న దేశమైనను వ్యవసాయ కూలీల సంఖ్య మాత్రము అందు అధికముగా నుండెను. అందుచే అది మరియు జనశూన్యము కాజొచ్చెను. పారిశ్రామిక దేశమైన ఇంగ్లాండుకు, ముడి పదార్థములను సరఫరా చేయు దేశముగా ఐర్లాండు తయారయ్యెను. వ్యవసాయభూమిని బీడు భూమిగా మార్చు పద్ధతి నేడు తలక్రిందులైనది. మరల ప్రజలు నాగలిని చేబట్టుచున్నారు. వింత ఏమనగా ఈ మార్పునకు కారణము, 1932 లో ఇంగ్లాండు, ఐర్లాడు దేశములమధ్య ప్రారంభమైన వ్యాపార యుద్ధము.

19 వ శతాబ్దిలో చాలకాలముపాటు ఐర్లాండు ముఖ్యసమస్య భూమికి సంబంధించిన సమస్యయును, భూమిని కనిపెట్టుకొని ఉండని భూస్వాముల చేతిక్రింద నుండు దురదృష్టవంతులగు రైతుల కష్టములును. చిట్టచివరకు ఈ భూస్వాములను తొలగించుటకు బ్రిటిష్ ప్రభుత్వము నిశ్చయించెను. బలవంతముగా వారి భూములను కొనివేసి వానిని రైతుల వశముచేసెను. ఇందువల్ల భూస్వాములకేమియు నష్టము కలుగలేదు. తమ భూముల పూర్తి కిమ్మతును వారు ప్రభుత్వమునుండి బడసిరి. రైతులకు భూమి దక్కినదేకాని దాని ఖరీదు వారు భరించవలసి వచ్చెను. ఈ మొత్తమును వారొక్కమారీయ నక్కరలేదు.

సాలు సాలుకు చిన్న చిన్న మొత్తములు వారు చెల్లించిన చాలును.

1798 లో తటస్థించిన జాతీయ విప్లవము తరువాత నూరు సంవత్సరముల వరకు ఐర్లాండులో పెద్ద విప్లవ మేమియు సంభవించ లేదు. వెనుకటి శతాబ్దులలోవలె 19వ శతాబ్దిలో ఇట్టి సంభవములు కలుగ లేదు. వారు సంతుష్టితో నున్నారనికాదు. వెనుకటి తిరుగుబాటువల్ల కలిగిన అలసట, మహాక్షామము, జన శూన్యత—ఇందుకు కారణములు. ఈ శతాబ్ది చివర భాగములో ప్రజల దృష్టి కొంతవరకు బ్రిటిషు పార్ల మెంటుపై ప్రసరించెను. అందున్న ఐరిష్ సభ్యులు తమకేదో ఉప కారము చేయగలరని వా రాశించిరి. కాని కొందరు ఐరిష్ పురుషులు అనుయాయతగా వచ్చుచున్న తిరుగుబాట్లను చావనీయ దలచలేదు. వానిని సజీవముగా నుంచగోరిరి. అట్లు చేసినప్పుడే ఐర్లాండు ఉత్సాహమును, ఆత్మయు నిర్మలముగా, నిష్కళంకముగా నుండునని వారు భావించిరి. అమెరికాకు వలసపోయిన ఐరిష్ ప్రజలు ఐర్లాండు స్వాతంత్ర్యము సాధించుటకై అక్కడ ఒక సంఘమును స్థాపించిరి. వీరికి "ఫెనియ నులు" అని పేరు. వీరు ఐర్లాండులో చిన్న చిన్న తిరుగుబాటులను లేవదీసిరి. కాని ప్రజాసామాన్యమున కిందులో జోక్యము లేదు. ఫెని యనులు వెంటనే అణచివేయబడిరి.

లేఖ పెరిగిపోయినది. కాన ఆపెదను. కాని ఐర్లాండు చరిత్ర ఇంకను పూర్తికాలేదు.

## 140

## ఐర్లాండులో హోంరూలు : సీన్ ఫీన్

మార్చి 9, 1933

సాయుధ విప్లవము లనేకము కలిగినవి. క్షామము మున్నగు కష్టములు తటస్థించినవి. అందుచే స్వాతంత్ర్యము బడయుట కిట్టి పద్ధతులు వినియోగించి ఐర్లాండు కొద్దిగా అలసటజెందెను. 19 వ శతాబ్ది

రెండవ భాగమున బ్రిటిష్ పార్లమెంటుకు ఎన్నిక హక్కు విస్తరింప బడుటచే ఐరిష్ జాతీయ వాదులు పలువురు కామన్సు సభకు సభ్యులుగా ఎన్నుకోబడిరి. ఐరిష్ స్వాతంత్ర్యము సాధించుటకు వీరేమైనను చేయ వచ్చునని ప్రజ లాశింపదొడగిరి. పూర్వ సాయుధ విప్లవ పద్ధతికిబదులు పార్లమెంటులో ప్రవేశించి కార్యసాధన చేయదలచిరి.

ఉత్తరమున నున్న అల్స్టరుకును, మిగత ఐర్లాండుకును మధ్య నున్న విభేదములు పెరిగిపోయెను. జాతి భేదములు, మత భేదములు అట్లే ఉండెను. వానికితోడు ఆర్థిక భేదములు ప్రస్ఫుట రూపముదాల్చెను. ఇంగ్లాండు, స్కాట్లండు దేశములవలెనే అల్స్టరు పారిశ్రామికమయ్యెను. పెద్ద ఫ్యాక్టరీలనుండి ఉత్పత్తి జరుగుచుండెను. మిగత దేశము వ్యవ సాయక దేశమై మధ్య యుగములను పోలుచు, జనశూన్యమై దరిద్రావస్థ ననుభవించుచుండెను. ఐర్లాండును రెండు భాగములుగా చీల్చువిషయ మున ఇంగ్లాండు ప్రాచీన రాజనీతి పూర్తిగా ఫలవంతమయ్యెను. ఎంత చక్కగా నైనదనగా—తరువాతి కాలములో వానిని కలుపుటకు ఇంగ్లాడు ప్రయత్నించియు సాధింపలేకపోయెను. ఐరిష్ స్వాతంత్ర్యమునకు అల్స్టరు పెద్ద అడ్డంకి అయ్యెను. ఐర్లాండుకు స్వతంత్రత వచ్చినచో భాగ్యవంతమగు ప్రొటస్టెంటు అల్స్టరు బీద కాతలిక్కు ఐర్లాండులో మునిగి పోవలసి వచ్చునని భయపడెను.

బ్రిటిషు పార్లమెంటులోను, ఐర్లాండులోను రెండు క్రొత్తమాటలు వాడుకలోనికి వచ్చెను. అవి "హోంరూలు"అనునవి. ఐర్లాండు ఇప్పుడు కోరుచున్నది హోంరూలు. 700 సంవత్సరములనుండి ఐర్లాండు కోరు చున్న స్వాతంత్రముకంటె ఇది భిన్నమైనది. దానికంటె చాల తక్కువది. దీని ప్రకారము బ్రిటిషు పార్లమెంటు కొన్ని ముఖ్య వ్యవహారములను పూర్వమువలెనే నడిపించుచుండెను. స్థానిక వ్యవహారములను చూచు టకు మాత్రము దానికి లోబడిన ఐరిష్ పార్లమెంటు ఉండును. వెనుక నుండియు తాము కోరుచున్న స్వాతంత్ర్యమును ఇట్లు పలుచన చేయుట

పలువురు ఐరిష్ పురుషులు సమ్మతించలేదు. కాని విప్లవముల చేతను, పోరాటములచేతను దేశము అలసిపోయి యుండెను. ఫలశూన్యమగు తిరుగుబాటులలో పాల్గొనుట కది తిరస్కరించెను.

బ్రిటిష్ కామన్సు సభలోనున్న ఐరిష్ సభ్యులలో నొకడు ఛార్లెస్ స్టీవర్టు పార్నెల్ అనువాడు. కాంసర్వేటివ్ బ్రిటిషు పక్షమువారు గాని, లిబరల్ బ్రిటిషు పక్షమువారుగాని ఐర్లాండు విషయమై ఎంతమాత్రము శ్రద్ధ చూపించకుండుట అతడు గ్రహించెను. మర్యాదగా వారు పార్ల మెంటరీ ఆట ఆడుచున్నారని అతడు గ్రహించెను. ఈ ఆట సాగనీయ కుండ చేయవలెనని అతడు సంకల్పించెను. మరికొందరు ఐరిష్ సభ్యు లతో చేరి అతడు దీర్ఘోపన్యాసము లిచ్చియు, పని సాగకుండ ఆలస్యము చేయవలెనను ఉద్దేశముతో ఇతర ఎత్తులు ఎత్తియు పార్లమెంటు వ్యవహారములలో అడ్డంకులు కల్పించ ప్రారంభించెను. ఈ యెత్తులు చూచి ఇంగ్లాండువారు చాల చికాకు పడిరి. పార్లమెంటు సంప్రదాయము కవి అణుగుణముగా లేవనిరి. పెద్ద మనిషి తరహాగా లేవనిరి. ఈ విమర్శలను పార్నెల్ లక్ష్యపెట్టలేదు. ఇంగ్లీషువారు ఏర్పరిచిన నిబం ధనల ననుసరించి, మర్యాదగా ఇంగ్లీషు పార్లమెంటరీ ఆట ఆడుటకు రాలేదతడు పార్లమెంటుకు. ఐర్లాండుకు ఉపకారము చేయుటకు అతడు పార్లమెంటుకు వచ్చెను. సాధారణ పద్ధతులతో అది సమకూరని నాడు అసాధారణ పద్ధతు లవలంబించుట న్యాయమేనని అత డూహించెను. ఏమైనను అతడు ఐర్లాండుపై దృష్టి నాకర్షింపగలిగెను.

బ్రిటిష్ కామన్సు సభలో ఐరిష్ హోంరూలు పార్టీకి పార్నెల్ నాయకుడయ్యెను. ఈ పార్టీ ప్రాత బ్రిటిషు పార్టీలు రెంటికిని అసహ్య మయ్యెను. ఈ రెండు పార్టీలును సమబలముతోనున్న సందర్భములో ఐరిష్ హోంరూలు పార్టీవారు ఏదో ఒక పక్షమువైపు మొగ్గుదురు. ఈ విధముగా ఐరిష్ సమస్య మరపునకు రాకుండ వారు చేయుచుండిరి. ఐర్లాండుకు హోంరూలు ఇచ్చుటకు తుట్టతుదకు గ్లాడ్‌స్టన్ అంగీకరిం

చెను. 1866 లో కామన్సు సభలో హోంరూలు బిల్లు నతడు ప్రవేశ పెట్టెను. ఇందున్నది స్వపరిపాలనయొక్క స్వల్ప ప్రమాణమే. అయినను పెద్ద గోలపుట్టెను. కాంసర్వేటివుల కిది సుతరాము కిట్టనేకిట్టదు. గ్లాడ్‌స్టన్ పార్టీవారైన లిబరలులుకూడ దీని నిష్టపడలేదు. ఈ పార్టీ రెండు చీలికలైనది. ఒకచీలికవారు కాంసర్వేటివులలో చేరిరి. ఐర్లాండుతో కలిసి యుండవలెనని కోరుటచే వీరికి "యూనియనిస్టులు" అని పేరు వచ్చెను. హోంరూలు బిల్లు పతనమయ్యెను. దానితోపాటు గ్లాడ్‌స్టన్ కూడ పతనమయ్యెను.

ఏడు సంవత్సరములైన పిమ్మట 1893 లో, 84 వ ఏట గ్లాడ్‌స్టన్ మరల ప్రధానమంత్రి అయ్యెను. రెండవ హోంరూలు బిల్లునతడు ప్రవేశపెట్టెను. కామన్సు సభలో కొద్ది వోట్ల తేడాతో అది అమోదించబడెను. బిల్లులు శాసనములగుటకు పూర్వము అన్ని బిల్లులను లార్డ్సు సభకూడ ఆమోదించవలెను. లార్డ్సు సభలోనున్న వారందరు కాన్సర్వేటివులును, పశ్చిమ బుద్ధులును. ఎన్నికల ఫలితముగా ఏర్పడినదికాదు లార్డ్సుసభ. పెద్ద భూస్వాములు, కొందరు బిషప్పులు వంశ పరంపరగా అందలి సభ్యులు. కామన్సు సభ ఆమోదించిన ఈ హోంరూలు బిల్లును ఈ లార్డ్సు సభ నిరాకరించెను.

ఇట్లు పార్లమెంటులో చేసిన కృషివల్లనైనను ఐర్లాండు ఈప్సిత సిద్ధి కాలేదు. ఇంకను విజయము చేకూరునేమోయని ఐరిష్ జాతీయ పక్షమువారు (హోంరూలు పక్షము) పార్లమెంటులో కృషిచేయుచునే యుండిరి. ఐర్లాండు ప్రజల విశ్వాసమును వీరు మొత్తముమీద చూరగొని యుండిరి. కాని అనేకులు ఈ పద్ధతులు నిష్ప్రయోజన మనియు, బ్రిటిషు పార్లమెంటువల్ల లాభములేదనియు భావించిరి. ఐరిష్ ప్రజలనేకులకు చిల్లర రాజకీయములపై అసహ్యము పుట్టెను. సాంస్కృతిక ఆర్థికకృషిసల్ప వారు పూనుకొనిరి. 20 వ శతాబ్ది తొలి సంవత్సరములలో ఐర్లాండులో సాంస్కృతిక పునరుద్ధరణము కలిగెను. ముఖ్యముగా

వారి ప్రాచీన భాషయు, పడమటి జిల్లాలలో ఇంకను ప్రచారములో నున్నట్టియు గాలిక్ భాషనే పునరుద్ధరించుటకు ప్రయత్నములు జరిగెను. ఈ కెల్టిక్ భాషకు చక్కని సారస్వతముకలదు. శతాబ్దులకాల మీ దేశము ఇంగ్లీషుల అధికారమందుండుటచే పట్టణములనుండి ఆ భాష తిరోహిత మయ్యెను. అది క్రమముగా అదృశ్యమగుచుండెను. స్వభాషద్వారానే ఐర్లాండు తన ఆత్మను, తన ప్రాచీన సంస్కృతిని నిలుపుకోగలుగునని ఐరిష్ జాతీయవాదులు తలచిరి. పడమటి జిల్లాలలో ప్రచారములోనున్న భాషను చేబట్టి దానిని జీవద్భాషగా చేయుటకు వారు గట్టి కృషి సల్పిరి. అందుకొరకై ఒక గాలిక్ సంఘము స్థాపించబడెను. అన్ని దేశములలో, ముఖ్యముగా పరపాలనమందున్న దేశములలో జాతీయోద్యమము దేశభాషను ఆధారముగా చేసికొని పనిచేయును. పరభాషపై ఆధారపడిన ఉద్యమము ప్రజాసామాన్యమును చేరలేదు. ప్రేళ్లు ద్రింపుకొని దృఢము కాజాలదు. ఐర్లాండులో ఇంగ్లీషు పరభాష అన వీలు లేదు. అందరికిని ఆ భాష తెలియును. అందరును ఆ భాషలోనే మాటాడుదురు. గాలిక్ భాషకన్న ఇంగ్లీషుభాషే బాగుగా వారికి తెలియును. అయినను ఐరిష్ జాతీయవాదులు, తమ ప్రాచీన సంస్కృతితో సంసర్గ వీడిపోకుండుటకై గాలిక్ భాషను పునరుద్ధరించుట ప్రధానమని తలచిరి.

శక్తి లోపలినుండి వచ్చునేగాని బయటనుండి రాదని ఆనాడు ఐర్లాండులో ప్రజలు భావించు చుండిరి. పార్లమెంటులో చేసిన ఒక్క రాజకీయ కృషివల్ల ఎంతమాత్రము లాభములేదని వారు గ్రహించిరి. కాన దృఢమగు పునాదులపై జాతిని నిర్మించుటకై ప్రయత్నములు జరిగినవి. 20 వ శతాబ్ది తొలి సంవత్సరములలోనున్న క్రొత్త ఐర్లాండు ప్రాత ఐర్లాండు వంటిదికాదు. అనేక దిక్కులలో పునరుద్ధరణ పొడ చూపుచుండెను. పైని చెప్పిన విధముగా సారస్వత విషయమున, సంస్కృతి విషయమున పునరుద్ధరణ కానవచ్చుచుండెను. కృషికులకు

సహకార పద్ధతి సమకూర్చుటచే ఆర్థికముగాకూడ పునరుద్ధరణ ప్రస్ఫుటమయ్యెను.

కాని స్వాతంత్ర్యము బడయవలయునను ఆకాంక్ష వీని వెనుక నొదిగియుండెను. బ్రిటిషు పార్లమెంటులోనున్న ఐరిష్ జాతీయపక్షము ప్రజల విశ్వాసమును చూరగొన్నట్లు కనిపించినను దానిపై ప్రజలకు నమ్మకము సడలుచుండెను. ఉపన్యాసములిచ్చుట కిష్టపడువట్టి రాజకీయ వేత్తలేగాని, ఏ పని చేయుటకును వీరికి శక్తిలేదని ప్రజలు భావింప దొడగిరి. వెనుకటి ఫినియనులకును, ఇతర స్వాతంత్ర్యవాదులకును ఈ పార్లమెంటు సభ్యులన్నను, హోంరూలు అన్నను ఎన్నడును నమ్మకము లేదు. ఇప్పుడు యువదశలోనున్న నూతన ఐర్లాండు, పార్లమెంటునుండి తన దృష్టిని మరల్చెను. స్వయం సహాయ మవసరమను భావమంతటను వ్యాపించెను. రాజకీయములందుకూడ స్వయం సహాయము నేల ప్రయోగింపరాదు? సాయుధ విప్లవభావములు మరల ప్రజల మనస్సులలో మెలగదొడగెను. కార్యరంగమున కురుకవలెనను ఈ కాంక్షకు ఒక నూతన మార్గము చూపబడెను. ఒక ఐరిష్ యువకుడు, ఆర్థర్ గ్రిఫిత్ అనువాడు, ఒక నూతన సిద్ధాంతమును బోధింపదొడగెను. దానినే సీన్‌ఫీన్ అందురు. అనగా "మనంతట మనమే" అని అర్థము.

ఈ మాటలనుబట్టి వారి అభిప్రాయమును మనము గ్రహించవచ్చును. ఐర్లాండు తనపై తాను ఆధారపడవలసినదేకాని, ఇంగ్లాండు నుండి సహాయమునుగాని, బిచ్చముగాని కోరరాదని సీన్‌ఫీనరులు అభిప్రాయ పడిరి. జాతిశక్తిని లోనుండి వృద్ధి నందింప వారు కోరిరి. గాలిక్ ఉద్యమమునకును, సాంస్కృతిక పునరుద్ధరణ కార్యమునకను వారు ప్రోద్బలముగా నుండిరి. రాజకీయములలో నాటివరకు సాగుచున్న నిష్ఫలమగు పార్లమెంటరీ కార్యములపట్ల వారు విముఖులైయుండిరి. అందుచే వచ్చునదేదియు లేదని వారు గ్రహించిరి. సాయుధ విప్లవము కూడ సాధ్యము కాదని వారు భావించిరి. బ్రిటిష్ గవర్నమెంటుతో ఒక

విధమగు సహాయ నిరాకరణమునుచేసి, పార్లమెంటరీ పనికి బదులు ప్రత్యక్ష కార్యసాధన చేయుట మంచిదని వారు బోధించిరి. ఒక తరము నకు ముందు హంగరీదేశము సాత్వికనిరోధమునుచేసి ఎట్లు విజయము సాధించెనో ఆర్థర్ గ్రిఫిత్ దృష్టాంత పూర్వకముగా చూపెను. ఇంగ్లాండు నుండి బలవంతముగా స్వాతంత్ర్యమును గ్రహించుట కట్టి యాచరణ అవలంబించవలసినదని అతడు వాదించెను.

గత పదమూడు సంవత్సరముల నుండియు ఇండియాలో అనేక విధములగు సహాయ నిరాకరణములను మనము అనుభవ పూర్వకముగా చూచియుంటిమి. మనకు ముందు జరిగిన ఐరిష్ సహాయ నిరాకరణ మును మనదానితో పోల్చి చూతము. మన ఉద్యమము అహింసపై ఆధారపడినదని లోకమున కంతకును తెలియును. ఐర్లాండులో అట్టి పునాది లేదు. అయినను సాధించదలచిన సహాయ నిరాకణోద్యమము నకు బలము శాంతియుతమగు సాత్విక నిరోధములోనే ఉన్నది. ఈ పోరాటము ముఖ్యముగా శాంతియుతముగా నుండవలెను.

సీన్ ఫీన్ భావములు మెల్లగా ఐర్లాండు యువకులలో వ్యాపించెను. వారివల్లనే ఐర్లాండు హఠాత్తుగా జ్వలించలేదు. 1906 లో లిబరల్ పార్టీ వారు అధిక సంఖ్యాకులుగా పార్లమెంటుకు తిరిగి ఎన్నుకొనబడుటచే, పార్లమెంటునుండి తమ కుపకారము జరుగగలదని అనేకు లింకను ఆశించుచుండిరి. కామన్సు సభలో తామే అధికముగా నున్నను—లార్డ్సు సభలో కాన్సర్వేటీవ్ యూనియనిస్టులు శాశ్వతముగా అధిక సంఖ్యా కులై యుండుటచే వారిని లిబరలులు ఎదుర్కొ-వలసి వచ్చెను. అచిర కాలముననే ఈ ఉభయులకును జగడము సంభవించెను. లార్డులకున్న అధికారమును తగ్గించుటయే దీని ఫలితము. ధనమునకు సంబంధించిన వ్యవహారములలో లార్డ్సు సభ నిరాకరించిన బిల్లును వరుసగా మూడు సభలలో కామన్సు సభ ఆమోదించి లార్డ్సు సభ పెట్టిన ఆటంకమును దాటగలిగెను. ఈ విధముగా, 1911 లోని పార్లమెంటు అక్టుద్వారా

లార్డ్సు సభ అధికారమును, కామన్సు సభ తీసివేసెను. అయినను ఆటంకపరుచుటకును, కలుగజేసికొనుటకును ఇంకను అధికారము చాల వరకు లార్డ్సు చేతులలో నుండెను.

తప్పనిసరిగా లార్డ్సు సభ పెట్టు ఆటంకముల కీ విధముగా పరిహారము కల్పించి లిబరలులు, మూడవ హోంరూలు బిల్లును ప్రవేశ పెట్టిరి. 1913లో కామన్సు సభచే నిది ఆమోదింపబడినది. అనుకున్నట్లే లార్డ్సు సభ దీనిని నిరాకరించెను. పిమ్మట కామన్సు సభ వరుసగా మూడు సభలలో దీని నామోదించెను. 1914 లో అది శాసనమయ్యెను. అల్స్టరుతో సహా ఐర్లాండంతకును ఇది వర్తించెను.

తుట్టతుదకు ఐర్లాండుకు హోంరూలు వచ్చినట్లే కాని–ఇట్టి "కాని"లు అనేకమున్నవి. 1912, 1913 సంవత్సరములలో హోంరూలును గూర్చి పార్లమెంటులో చర్చ జరుగుచుండగా ఉత్తర ఐర్లాండులో కొన్ని వింత విశేషములు జరుగుచుండెను. అల్స్టరు నాయకులు దాని నంగీకరించమనియు, ఒకవేళ అది శాసనమైనను దానిని నిరోధింతుమనియు ప్రకటన చేసిరి. విప్లవము లేవదీయుదుమని చెప్పి దానికై సిద్ధపడుచుండిరి. హోంరూలు రాకుండ నిరోధించుటకు పరరాజ్యము (వారి అభిప్రాయము జర్మనీ అని)ను సహాయము చేయమని అడుగుటకు సైతము సందేహించమని అనిరి. ఇది బహిరంగముగా చేసిన తీవ్ర విద్రోహము. ఇంతకన్న వింత విషయ మేమనగా ఇంగ్లాండులోనున్న కాంసర్వేటివ్ పక్ష నాయకులు ఈ విప్లవోద్యమమును ఆశీర్వదించిరి. పలువురు దానికి సహాయము చేసిరి. భాగ్యవంతులగు కాంసర్వేటివ్ వర్గములనుండి అల్స్టర్‌లోనికి ధనము ప్రవహింపజొచ్చెను. పైతరగతులవారని చెప్పబడు ప్రభుత్వ తరగతివారు సాధారణముగా అల్స్టరు పక్షమున నున్నట్లు స్పష్టము. ఈ తరగతులనుండియే వచ్చిన సైన్యోద్యోగు లనేకులు కూడ అల్స్టరు పక్షముననే ఉండిరి. ఆయుధములు దొంగతనముగ దేశములలోనికి దిగుచుండెను. స్వచ్ఛంద సైనికులకు

బహిరంగముగ యుద్ధ శిక్షణ గఱపుచుండిరి. అల్స్టర్‌లో ఒక తాత్కాలిక ప్రభుత్వము సైతము, తరుణము వచ్చినప్పుడు పనిచేయుటకై ఏర్పరుచబడెను. ఒక విశేషమేమనగా అల్స్టర్‌లో ప్రముఖ విప్లవకారుల నాయకుడొకడు పార్లమెంటులో ప్రసిద్ధుడగు కాంసర్వేటివ్ సభ్యుడు. అతని పేరు యఫ్. ఇ. స్మిత్. తరువాతి కాలమున నతడు బర్కెన్ హెడ్ ప్రభువను పేరుతో ఇండియాకు సెక్రటరీఅఫ్‌స్టేట్‌గాను, ఇతర ఉన్నతోద్యోగములలోను పనిచేసెను.

చరిత్రలో విప్లవములు సామాన్యముగా సంభవించుచునే యుండును. ముఖ్యముగా ఐర్లాండులో విప్లవములు కావలసినన్ని జరిగినవి. అయినను అల్స్టరు విప్లవమునకై చేయు సన్నాహములు మనము ముఖ్యముగా గమనించవలెను. ఈ విప్లవమునకు వెనుకనున్న పక్షము వారు తాము కాంసర్వేటీవులమనియు, చట్టబద్ధముగా ప్రవర్తింతుమనియు గొప్ప చెప్పుకొందురు. ఈ పక్షమువారే నిరంతరము "శాంతిభద్రతలు" గూర్చి ప్రసంగించు చుందురు. ఈ శాంతి భద్రతలను ప్రతిఘటించిన వారిని తీవ్రముగా దండించవలెనని చెప్పువారును ఈ పక్షమువారే. అయినప్పటికిని ఈ పక్షమందలి ప్రముఖ సభ్యులు బహిరంగముగా విద్రోహ కార్యములకు పురిగొల్పుచుండిరి. సాయుధ విప్లవమునకు సిద్ధపడుచుండిరి. సామాన్యసభ్యు లందరు ధనసహాయము చేయుచుండిరి. గమనించవలసిన వేరొక విశేషమేమనగా తలపెట్టిన ఈ విప్లవము పార్లమెంటు అధికారమును ప్రతిఘటించునది. ఏలయన పార్లమెంటు హోంరూలు బిల్లు నప్పుడు విచారించుచుండెను. దానినే తరువాత ఆమోదించెను. కాన ప్రజాప్రభుత్వపు పునాదులకే ఇది ముప్పుతెచ్చి పెట్టుచుండెను. చట్టబద్ధ పరిపాలనమునందును, చట్టబద్ధ కార్యాచరణమందును నమ్మకము గలదని చెప్పుకొను ఇంగ్లీషు ప్రజల గొప్ప నిది మటుమాయము చేసెను.

1912–14 లోని అల్స్టరు విప్లవము ఈ నటనలును, ఈ పెద్ద

కబుర్లను వట్టి బూటకమని నిరూపించెను. ప్రభుత్వముయొక్కయు, నాటి ప్రజాప్రభుత్వముయొక్కయు నిజస్థితిని వెల్లడిచేసెను. ప్రభుత్వ తరగతుల హక్కులను, ప్రయోజనములను కాపాడుచున్నంత కాలము "శాంతి భద్రతలు" ఉండవలసినదే. ప్రజాప్రభుత్వ మీ హక్కులమీదికి, ప్రయోజనములమీదికి రానంతకాలము దానిని సహించవచ్చును. కాని ఈ హక్కులను తొలగించుటకు ప్రయత్నించినట్లయిన ఈ తరగతి వారూరుకొనరు. పోరాడుదురు. శాంతి భద్రతలనునది చక్కని మాట మాత్రమే. వారి దృష్టిలో దాని యర్థము వారి ప్రయోజనములనియే. బ్రిటిష్ ప్రభుత్వము క్రియకు వర్గ ప్రభుత్వమని దీనివల్ల స్పష్టమైనది. పార్లమెంటులో దానిని ప్రతిఘటించువారు అధిక సంఖ్యాకులుగానున్నను సులభముగా ఆ ప్రభుత్వమును కదుపజాలరు. అట్టి అధిక సంఖ్యాకులు వారి హక్కులను తగ్గించునట్టి సామ్యవాద చట్టమును ప్రవేశించ బెట్టుటకు ప్రయత్నించినట్లయిన వారు, ప్రజాప్రభుత్వ ధర్మములకు వ్యతిరేకముగా తిరుగబడుదురు. ఈ విషయమును జ్ఞాపక ముంచుకొనుట మంచిది. ఇది అన్ని దేశములకును వర్తించును. చక్కని సమాసములను, పెద్దపెద్ద మాటలను చూచి మోసపోయి మన మీ యదార్థ విషయమును విస్మరించుటకు వీలున్నది. తరుచు విప్లవములు తలయెత్తు దక్షిణ అమెరికా రిపబ్లిక్ నకును, సుస్థిర ప్రభుత్వముగల ఇంగ్లాండునకును ఈ విషయమున ప్రధాన భేదము లేమియు లేవు. ప్రభుత్వతరగతులు తిష్ఠ వేసికొని కూర్చుండుటచేతను, వారిని తొలగించుట కింతవరకును ఏ యితర తరగతికిని బలము చాలనందువలనను ఆ ప్రభుత్వమునకు సుస్థిరత్వము కలిగినది. 1911 లో వారి రక్షణ దుర్గమైన లార్డ్సు సభ దుర్బలమైనది. వారు భీతావహులైరి. అల్స్టరును సాకుగా పెట్టుకొని విప్లవమును లేవదీసిరి.

ఇండియాలో శాంతి భద్రత లను మంత్రమును ప్రతిదినమును, దినమున కనేకపర్యాయములును మనము వినుచునే యున్నాము. కాన

దాని భావమేమో మనము సరిగా తెలిసికొనుట మంచిది. మన ఉప దేశకులలో నొకడైన, ఇండియాకు సెక్రటరీ ఆఫ్ స్టేటుగా నున్నవాడు అల్స్టరు విప్లవ నాయకులలో నొకడని మనము జ్ఞాపక ముంచుకో వలెనుకూడ.

ఇట్లు అల్స్టరు ఆయుధములతో, స్వచ్ఛంద సైనికులతో విప్లవము నకు సంసిద్ధమయ్యెను. ప్రభుత్వమన్ననో చీమ కుట్టినట్లు చూచుచుండెను. విప్లవప్రయత్నములను ప్రతిఘటించుటకు ఆర్డినెన్సులు అమలు జరుప లేదు. కొన్నాళ్లైన పిమ్మట ఐర్లాండులో మిగత భాగమంతయు అల్స్టరు అడుగుజాడలలో నడువ ప్రారంభించెను. వారును "జాతీయ స్వచ్ఛంద సైనిలకును" కూర్చ మొదలుపెట్టిరి. వారి అభిప్రాయము హోంరూ లును సాధించుటకు పోరాడుటకును, అవసరమైన అల్స్టరును ప్రతిఘ టించుటకును. ఇట్లు ఐర్లాండులో రెండు సైన్యములు పోటీగా ఏర్పడెను. విచిత్రమేమనగా—అల్స్టరు విప్లవమును సాగించుటకు స్వచ్ఛంద సైని కులు ఆయుధములు ధరించుచుండగా చూచీ చూడనట్లు నటించిన బ్రిటిష్ అధికారులు, "జాతీయ స్వచ్ఛంద సైనికు"లను వీరు హోంరూలు బిల్లుకు వ్యతిరేకులు గాకున్నను, అణచివేయుటలో అప్రమత్తులై ప్రవర్తించిరి.

ఐర్లాండులో ఉభయపక్షముల స్వచ్ఛంద సైనికులకు సంఘర్ష ణము అనివార్యమగునట్లు కనిపించెను. అయినచో నది అంతఃకలహము లోనికి దిగియుండును. అప్పుడే ఈ యుద్ధముకంటె పెద్ద యుద్ధము, ప్రపంచయుద్ధము, 1914 ఆగస్టులో సంభవించెను. దానిముందు మిగత విషయము లన్నియు అప్రధానము లాయెను. హోంరూలు ఆక్టు చట్ట మైనది. కాని యుద్ధానంతరముగాని అది అమలులోనికి రాకూడదని అప్పుడే నిబంధన చేసిరి. కాన హోంరూలు వెనుకటివలెనే దూరస్థమై యుండెను. యుద్ధ మంతరించుసరికి ఐర్లాండులో అనేక విశేషములు జరుగ నుండెను.

వివిధ దేశముల వృత్తాంతములను నేను ప్రపంచ యుద్ధారంభము వరకు తెచ్చుచున్నాను. ఐర్లాండులో ఈ మెట్టువరకు వచ్చితిమి. ప్రస్తుత మిక్కడ ఆగుదము. ఈ జాబును ముగించుటకు ముందు నేను నీకొక విషయమును చెప్పవలెను. అల్స్టరు విప్లవనాయకులను ద్రోహకార్యములకు, శిక్షించుటకు బదులు బ్రిటిష్‌వారు వారిని కాబినట్ మంత్రులనుగా (Cabinet) చేసియు, బ్రిటిష్ ప్రభుత్వముక్రింద వెంటనే ఉన్నతోద్యోగము లిచ్చియు బహూకరించిరి.

## 141

# ఈజిప్టును బ్రిటన్ చేజిక్కించుకొని దానిని తన వశములో నుంచుకొనుట

మార్చి 11, 1933

అమెరికానుండి అట్లాంటిక్ మీదుగా ఒక గంతువేసి ఐర్లాండు చేరుకొంటిమి. మరల మనమిప్పుడు మూడవ ఖండమగు ఆఫ్రికాకు గంతు వేయుదము. బ్రిటిష్ సామ్రాజ్యతత్త్వమునకుగురియై కృశించిన ఈజిప్టును చేరుకొందము. నేను నీకు వ్రాసిన కొన్ని జాబులలో ఈజిప్టు తొలి చరిత్రనుగూర్చి కొంత చెప్పియుంటిని. నా అజ్ఞానము కారణముగా చెప్పిన విషయము సంక్షేపముగాను, అసంపూర్తిగాను ఉండెను. అంతకన్న ఎక్కువగా నా కావిషయము తెలిసియున్నప్పటికిని ఇప్పుడు వెనుకకు పోయి దాని పూర్వ చరిత్రము నెత్తుకొనజాలను. ఎట్లాగో చివరకు మనము 19 వ శతాబ్ది వృత్తాంతము దాదాపు ముగించితిమి. 20 వ శతాబ్ది కడకు వచ్చితిమి. ఇక్కడ మన మాగవలెను. ఉండుండియు ముందుకు, వెనుకకు పోవుచు నుండజాలముగదా! అయినను ప్రతి దేశముయొక్క గత చరిత్రమును చెప్పుటకు నేను ప్రయత్నించినచో ఈ లేఖ లెన్నటికైన ముగియుగలవా?

అయినప్పటికిని ఈజిప్టు చరిత్ర దాదాపు పూజ్యమని నీవు భావించ కుందువుగాక. ఎందువల్లననగా జాతులలో బహు ప్రాచీనమైనది ఈజిప్టు. ఏ యితర జాతి చరిత్రయు ఇంత ప్రాచీనమైనది కాదు. దాని చరిత్ర గణన క్షుద్ర శతాబ్దులలో నుండదు. వేలాది సంవత్సరములలోనుండును. అద్భుతమగు దాని శిధిలములు, దాని అత్యంత ప్రాచీనతను ఇప్పుడు కూడ మన తలపునకు తెచ్చుచున్నవి. పురా వస్తు శాస్త్ర పరిశోధనలకు అవకాశమిచ్చిన మొట్టమొదటి క్షేత్రమిదియే. అట్టి పరిశోధనల కనంత మగు సావకాశమున్న క్షేత్రముకూడ అదియే. రాతికట్టడములు ఇతర శిధిలములు ఇసుకనేలలనుండి త్రవ్వి బయటకు తీయబడినప్పుడు ఆనాటి ప్రాచీనమగు మనోహర గాథల నవి చెప్పుచుండెను. త్రవ్వుట, బయలు పెట్టుట కార్యము లింకను జరుగుచునే యున్నవి. ఈజిప్టు ప్రాచీన చరిత్రకు సంబంధించిన నూతన విషయములు బయలుపడుచునే యున్నవి. ఆ చరిత్ర ఎప్పుడు ప్రారంభమైనదో, ఎట్లు ప్రారంభమైనదో మనమింకను చెప్పలేము. సుమారు 7000 సంవత్సరములకు పూర్వము నైలు నదీ లోయలో నాగరిక ప్రజలు నివసించియుండిరనియు, వారు చిరకాలము నుండి సంస్కృతీ ప్రాబల్యము కలవారనియు మనకింతవరకు తెలియుచున్నది. వారు సాంకేతిక లిపియను బొమ్మలభాషను వ్రాయుచుండెడివారు. సుందరమగు ఘటములను, స్వర్ణతామ్రదంత పాత్రలను చేయుచుండిరి. చలువరాతిని మలచు చుండిరి.

క్రీ. పూ. 4 వ శతాబ్దిలో మాసిడన్‌రాజు అలగ్జాండరు ఈజిప్టును జయించుటకు పూర్వమందుసైతము ముప్పదియొక్క ఈజిప్టు రాజవంశములు దానిని పాలించినట్లు చెప్పుదురు. నాల్గయిదు వేల సంవత్సరముల ఈ దీర్ఘ కాలములో నివసించిన అద్భుతమును గొల్పు స్త్రీ, పురుష మూర్తులు మనకు గోచరించును. నేటికిని సజీవులవలె వారు కాన్పింతురు. కార్యసాధకులగు స్త్రీ, పురుషులు, మహా నిర్మాతలు, గొప్ప తత్వవేత్తలు, యోధులు, నిరంకుశ ప్రభువులు, క్రూరరాజులు, గర్విష్ఠులగు

పాలకులు, అందకత్తెలు, వేలాది సంవత్సరములు గడుచుచుండగా "ఫేరో"ల దీర్ఘ పరంపర మన కన్నులముందు కదలుచుండును. స్త్రీలకు సంపూర్ణ స్వాతంత్ర్యముండెను. పాలకులలో వారుకూడ ఉండిరి. అది పురోహితా ధీనమైన దేశము. ఈజిప్టు ప్రజలు భావికాలమును భావించుట లోను, పరలోకమును భావించుటలోను నిరంతరము మునిగియుండిరి. కార్మికులను బలవంతముచేసి, క్రౌర్యమును ప్రయోగించి నిర్మింపజేసిన మహా పిరమిడులు ఫేరోల భావిజీవితమున కేర్పడినవే. భావికాలమునకై వాసన ద్రవ్యములతో సంరక్షింపబడ్డ ఆత్మ దేహములే మమ్మీలు(రక్షిత కళేబరములు). ఇదంతయు గూఢముగా, కఠినముగా, సంతోషవిహీన ముగా కానవచ్చును. మరియు ఆనాటి పురుషులు శిరో ముండనము చేయించుకొని చేత తలకట్లను ధరించెడువారు. పిల్లలాడుకొనుట కాట వస్తువులును అప్పుడుండెను—బొమ్మలు, బంతులు, కాలు చేతులు కదపు చిన్న జంతువుల బొమ్మలు ఉండెను. ఈ ఆటవస్తువులను చూచి ప్రాచీన ఈజిప్టు దేశస్థుల మానవత్వమును మనము గ్రహింతుము. యుగములుదాటి వారు మన సమీపమునకు వచ్చుచున్నట్లు తోచును.

క్రీ. పూ. ఆరవ శతాబ్దిలో, దాదాపు బుద్ధుని కాలములో పర్షియ నులు ఈజిప్టును జయించిరి. నైలునదినుండి సింధునదివరకును వ్యాపిం చిన వారి విశాల సామ్రాజ్యమున దాని నొక రాష్ట్రముగా చేర్చుకొనిరి. వీరు అచామెనిడ్ రాజులు. వీరి రాజధాని పెర్సిపాలిస్. వీరు గ్రీసును లొంగ దీయుటకు ప్రయత్నించి విఫలులైరి. చివరకు వీరు మహా అలెగ్జాండరు చేతిలో ఓడిపోయిరి. పర్షియనుల క్రూర ప్రభుత్వమునుండి రక్షించిన వానినిగా భావించి అలెగ్జాండరుకు ఈజిప్టు స్వాగతము చెప్పినది. అలెగ్జాం డ్రియా నగర మతని జ్ఞాపకచిహ్నముగా నక్కడ నిలిచెను. ఈ నగరమే గ్రీకు సంస్కృతికిని, విద్యలకును కేంద్రమై ప్రసిద్ధినందెను.

అలెగ్జాండరు మరణానంతరము అతని సామ్రాజ్యము నతని సేనానులు పంచుకొనిరి. ఈజిప్టు టాలెమీ వంతుకు వచ్చెను. టాలెమీలు




త్వరలోనే నూత్న దేశమున కలవాటుపడిరి. పర్షియనుల వలెగాక వారు ఈజిప్టు ప్రజల ఆచారములను అవలంబించిరి. ఈజిప్టులో పుట్టి పెరిగినవారివలెనే వారు ప్రవర్తించిరి. పురాతన ఫెరోల రాజవంశమే రాజ్యము చేయుచున్నట్లే ప్రజలు భావించి వారిని మన్నించిరి. టాలెమీలలో తుట్టతుద రాజ్యముచేసిన రాణి క్లియోపాట్రా. ఆమె తదనంతరము, క్రీస్తుశకము ప్రారంభమైనదని చెప్పబడుకాలమునకు కొద్దిసంవత్సరములు ముందుగా, ఈజిప్టు రోమన్ సామ్రాజ్యములో ఒక రాష్ట్రమయ్యెను.

రోము క్రైస్తవ మత స్వీకారము చేయుట కెంతోముందు ఈజిప్టు

ఆ మతమును స్వీకరించెను. ఈజిప్టులోని క్రైస్తవులను రోమనులు పీడింపసాగిరి. కాన వారు ఎడారిలో తలదాచుకోవలసి వచ్చెను. రహస్య మతములు ఎడారిలో తలయెత్తెను. మతస్థులైన సన్యాసులు చూపిన మహత్తులకు సంబంధించిన అద్భుత కథలతో ఆనాటి క్రైస్తవ ప్రపంచము నిండియుండెను. తరువాత రోము చక్రవర్తి కాంస్టెంటైను క్రైస్తవ మతమును స్వీకరించెను. వెంటనే రోమకసామ్రాజ్యమున నది రాజ మతమయ్యెను. అప్పుడు ఈజిప్టులోని ప్రాచీన మతావలంబులను, అక్రైస్తవులని చెప్పి, ఈజిప్టులోని క్రైస్తవులు క్రూరముగా పీడించి పగ తీర్చుకొనుటకు ప్రయత్నించిరి. ఇప్పుడు అలెగ్జాండ్రియా ప్రసిద్ధ క్రైస్తవ విద్యాకేంద్ర మయ్యెను. ఈజిప్టులో క్రైస్తవము, రాజమతమగుటవలన, తెగలుగా, పక్షములుగా చీలిపోయెను. నిరంతరము ఒకనితో నొకటి వాదించుకొనుచు ఇవి పైచేయి కొరకు పోరాడుచుండెను. రక్తపాత ముతో కూడిన ఈ పోరాటములు దుర్భరమయ్యెను. ప్రజలకు సామాన్య ముగా క్రైస్తవ తెగ లన్నింటిమీద విసుగుపుట్టెను. అందువల్లనే 7 వ శతాబ్దిలో నూతన మతముతో అరబ్బులు వచ్చినప్పుడు వారికి స్వాగ తము చెప్పిరి. ఈజిప్టును, ఉత్తర ఆఫ్రికాను అరబ్బులు సులభముగా జయించుట కిదియొక కారణమయ్యెను. మరల క్రైస్తవులు పీడింపబడిరి. క్రూరముగా అణచిపెట్టబడిరి.

ఇట్లు ఈజిప్టు కాలిఫ్ సామ్రాజ్యములో ఒక రాష్ట్రమయ్యెను. అరబ్బీ భాషా సంస్కృతులు వేగముగా వ్యాపించెను. ఇందువల్ల ఈజిప్టు లోని ప్రాచీనభాష వెనుకబడిపోయెను. రెండువందల సంవత్సరముల తరువాత, 9 వ శతాబ్దిలో బాగ్దాదు కాలిఫ్ సామ్రాజ్యము దుర్బలము కాగా, టర్కిష్ గవర్నర్లక్రింద ఈజిప్టు సగము స్వతంత్రమయ్యెను. మూడువందల సంవత్సరముల తరువాత, క్రూసేడు యుద్ధములలో పోరాడిన ముస్లిమ్ యోధుడు సలాదీన్ అనువాడు ఈజిప్టుకు సుల్తానుగా ప్రకటించుకొనెను. సలాదీన్ అనంతరమున వచ్చిన సుల్తానొకడు కాకసస్

ప్రాంతములనుండి టర్కిష్ బానిసలను పలువురను తీసికొనివచ్చి వారిని తన సైనికులుగా ఉంచుకొనెను. ఈ తెల్ల బానిసలకే మామిలూకులు అని పేరు. ఈ పదమున కర్థము బానిసలని. సైనికదళమునకని వారిని జాగ్రత్తగా ఎన్నుకొనిరి. వారు చక్కని సైనికులు. కొద్ది సంవత్సరములలోనే ఈ మామిలూకులు తిరుగుబాటు చేసి తమలో ఒకరిని ఈజిప్టు సుల్తానుగా చేసికొనిరి. ఈ విధముగా ఈజిప్టులో మామిలూకుల పరిపాలన ప్రారంభమై రెండున్నర శతాబ్దుల కాలము జరిగెను. మరి సుమారు మున్నూరు సంవత్సరములకాలము సగము స్వాతంత్ర్యముతో నడచెను. ఇట్లు ఈ పరదేశ బానిసలు 500 సంవత్సరముల కాలము ఈజిప్టులో తమ అధికారమును చెలాయించిరి. ఇది చరిత్రలో అసాధారణ సంఘటన.

అది మామిలూకులు వంశపారంపర్యముగా ఈజిప్టునేలిన తెగగా పరిణమించలేదు. కాకసస్ జాతులనుండి ఉత్తములగు తెల్ల బానిసలను తీసికొని వారు తమలో కలుపుకొనుచు వచ్చిరి. ఈ కాకసస్ జాతుల వారార్యులు. ఈ పరదేశజనులు ఈజిప్టు గడ్డలో వృద్ధినందలేదు. కొద్ది తరములు గడువగా ఆ కుటుంబములు అంతరించెను. ఉండుండియు క్రొత్త మామిలూకులను తెచ్చుకొనుచుండుటచేత వారి సంఖ్య క్షీణించలేదు. అంతేకాదు. ముఖ్యముగా వారి బలము, వీర్యము యథాతథముగా నిలిచియుండెను. ఈ విధముగా వారు వంశపారంపర్యముగా దేశము నేలు తెగగా పరిణమించలేదు. అయినను వారొక ప్రభువర్గముగా (Aristocracy) ఏర్పడిరి. పాలకవర్గముగా ఏర్పడిరి. చిరకాలము రాజ్యము చేసిరి.

16 వ శతాబ్ది తొలిరోజులలో కాంస్టాంటినోపుల్ నేలు టర్కిష్ ఆటొమన్ సుల్తాను ఈజిప్టును జయించి మామిలూకు సుల్తానును ఉరి తీయించెను. ఈజిప్టు ఆటొమన్ సామ్రాజ్యములో ఒకరాష్ట్రమయ్యెను. అయినను మామిలూకులు పాలక ప్రభువర్గముగానే నిలిచిపోయిరి. కొంత

కాలము గడచిన పిమ్మట, యూరోపులో టర్కులు దుర్బలులు కాగా, ఆటొమన్ సామ్రాజ్యములో ఒక భాగముగా ఈజిప్టు యదార్థమున కున్న ప్పటికిని, క్రియకు మామిలూకులే ఈజిప్టులో తమ ఇష్టము చొప్పున ప్రవర్తింపజొచ్చిరి. 18 వ శతాబ్ది అంతమందు నెపోలియన్ ఈజిప్టుకు వచ్చినప్పుడు మామిలూకు లతని నెదిరించి ఓడిపోయిరి. మామిలూకు యోధు డొక్కడు ఫ్రెంచి సైన్యము వద్దకు స్వారి చేయుచు పోయి, మధ్య యుగముల సంప్రదాయానుసారము, సైనికాధిపతిని ద్వంద్వ యుద్ధమునకు ఆహ్మానించెనన్న కథ నీకు చెప్పితిని, జ్ఞాపకమున్నదా?

మనమిప్పుడు 19 వ శతాబ్దికి వచ్చితిమి. ఈ శతాబ్ది మొదటి భాగమున ఈజిప్టు, ఆల్బానియన్ టర్కు అయిన మెహెమెట్ ఆలీ ఆధిపత్యమున నుండెను. ఈత డా దేశమునకు పరిపాలకుడయ్యెను. ఈ టర్కిష్ పరిపాలకులను ఖెడీవులందురు. నేటి ఈజిప్టుకును స్థాప కుడుగా మెహెమెట్ ఆలీకి పేరువచ్చెను. అతడు చేసిన మొదటి కార్యము, మామిలూకులను ద్రోహముగా సంహరించుట. అంతటితో మామిలూకుల ఆధిపత్యము అంతరించెను. అతడొక ఇంగ్లీషు సైన్య మును కూడ ఈజిప్టులో ఓడించి, దేశమున కధిపతియాయెను. నామ కార్థము టర్కిష్ సుల్తాను సార్వభౌమత్వమును మాత్ర మత డంగీ కరించెను. జానపదులను (మామిలూకులనుకాదు) తీసికొని అతడొక క్రొత్త సైన్యమును నిర్మించెను. క్రొత్తగా కాలువలను త్రవ్వించెను. ప్రత్తి పంటను ప్రోత్సహించెను. అదియే ఈజిప్టు ప్రధాన పరిశ్రమము కానున్నది. నామకః తన యజమానియైన కాంస్టాంటి నోపుల్ సుల్తానును తరుముగొట్టి ఆ నగరమును స్వాధీనము చేసికొందుననికూడ బెదిరించెను. కాని అట్లు చేయలేదు. సిరియాను మాత్రము ఈజిప్టులో కలుపుకొనెను.

80 వ ఏట మెహెమెట్ ఆలీ 1849 లో మరణించెను. అతని తరువాత వచ్చినవారు దుర్బలులు, మితితప్పి ప్రవర్తించువారు, అస మర్థులు. వారు ఒకవేళ సమర్థులయినను, యూరోపియన్ సామ్రాజ్య

వాదుల దురాశనుండియు, అంతర్జాతీయ ద్రవ్యాధికారుల క్రౌర్యము నుండియు తప్పించుకొనుట వారికి దుర్లభ మయ్యెడిది. విదేశీయులు, ముఖ్యముగా ఇంగ్లీషువారును, ఫ్రెంచివారును ఖెడీవులకు వారి యుప యోగార్థము, అత్యధికమైన వడ్డీలకు ధనమును అప్పు ఇచ్చుచుండిరి. వడ్డీ సకాలమున చెల్లించనినాడు యుద్ధనౌకలు వడ్డీని వసూలు చేయుటకు వచ్చుచుండెను. అంతర్జాతీయ వాదుల కుట్రకు సంబంధించిన ఈ గాథ అసాధారణమైనది. ద్రవ్యాధికారులును, ప్రభుత్వములును చేతులు కలుపు కొని, పరదేశమును కొల్లగొట్టి స్వాధీనము చేసికొనుటకు పనిచేయు చుండిరి. ఖెడీవు లనేకులు అసమర్థులైనను ఈజిప్టు మిక్కిలి అభివృద్ధి చెందెను. చూడుము, ప్రధాన ఇంగ్లీషు వార్తాపత్రికయైన "టైమ్సు" 1776 జనవరిలో ఇట్లు వ్రాసెను—"అభివృద్ధియన్న నెట్లుండవలెనో ఈజిప్టు అత్యద్భుతముగా ప్రదర్శించుచున్నది. ఇతర దేశములు 500 సంవత్సర ములలో చెందు యభివృద్ధి ఈజిప్టు 70 సంవత్సరములలో సాధించినది." ఇది యిట్లున్నను పరదేశ ద్రవ్యాధికారులు తమకు రావలసిన డబ్బు దమ్మిడీలతో వసూలుచేసి తీరెదమనుచుండిరి. దేశము దివాళా తీయు టకు సిద్ధముగానున్నదని నిరూపించి విదేశము లీ పరిస్థితులలో కలుగ జేసికోవలయుననిచెప్పిరి. పరదేశ ప్రభుత్వములు-ముఖ్యముగా ఇంగ్లీషు, ఫ్రెంచి ప్రభుత్వములు కలుగుజేసికొనుటకు తొందరపడుచుండిరి. ఈజిప్టు ఇండియాకు పోవు మార్గములోనున్నది. ఈజిప్టును చూచినవారికి నోరూరుచున్నది. కావున ఎట్లు దానిని వదలిపెట్టగలరు? కలుగజేసి కొనుటకు వారికి సాకు కావలెను. అది దొరికినది.

ఇంతలో సూయజ్ కాల్వ నిర్మింపబడినది. బలవంతముగా కూలీలచేత పనిచేయించి, వారిని క్రూరముగా హింసించి కాలువకట్టిరి. 1869 లో నౌకలు పోవుటకు దానిని తెరచిరి. (క్రీ. పూ. 1400 ప్రాంత మున ప్రాచీన ఈజిప్టు రాజవంశముల కాలములో ఎర్రసముద్రమునకును, మధ్యధరాసముద్రమునకును నడుమ ఇట్టి కాలువ ఉండెడిదట, విన్నావా?)

ఈ కాలువను తెరుచుటతోడనే యూరోపు, ఆసియా, ఆస్ట్రేలియా దేశముల మధ్య నడుచు వాణిజ్యము సూయజ్‌కు వచ్చెను. ఈజిప్టు ప్రాముఖ్యము మరింత హెచ్చెను. ఇండియా తూర్పు దేశములు ఇంగ్లాండుకు ప్రాణతుల్యమగు లాభస్థానములు కాబట్టి ఈ కాలువను, ఈజిప్టును తన వశములో నుంచుకొనుట మిక్కిలి ప్రధానమయ్యెను. 1875 లో ఇంగ్లాండుకు ప్రధానామాత్యుడుగానున్న డిజ్రాలి ఋణగ్రస్తుడగు ఖెడీవ్ పేరనున్న సూయజ్‌కాలువ వాటాల నన్నింటిని తక్కువధర కొక్కమారు కొనివేసెను. ఇది మంచి పెట్టుబడియన్నమాట అటుండగా దీనివల్ల కాలువ యాజమాన్యము చాలవరకు బ్రిటిష్ ప్రభుత్వము చేజిక్కెను. కాలువకు సంబంధించిన ఈజిప్టుయొక్క మిగతవాటాలు ఫ్రెంచి ద్రవ్యాధికారులకు దక్కెను. ఇట్లు ఈజిప్టుకు కాలువపై ద్రవ్యరూపమగు అధికారము ఈ షణ్మాత్రమును లేకుండెను. ఈ వాటాలద్వారా బ్రిటిషువారును, ఫ్రెంచివారును బ్రహ్మాండమగు లాభములనుతీసిరి. అంతేకాదు కాలువపై అధికారము చెలాయించిరి. ఈజిప్టును తమ గుప్పెటలో పెట్టుకొనిరి. 1932లో బ్రిటిష్ ప్రభుత్వమునకు వచ్చిన లాభము 35 లక్షల పౌనులు. దాని అసలు పెట్టుబడి 40 లక్షల పౌనులు.

ఈజిప్టు దేశముపై ఇంకను ఎక్కువ అధికారము సంపాదించుటకై బ్రిటిష్ ప్రభుత్వము ప్రయత్నించక తీరినదికాదు. కాన 1879 లో ఈజిప్టు దేశ వ్యవహారములలో నిరంతరము కలుగజేసికో ప్రారంభించెను. తన ద్రవ్యాధికారుల చేతులలో అధికారముంచెను. ఈజిప్టు దేశస్థులనేకుల కిది కంటకముగానుండెను. ఈజిప్టు దేశ వ్యవహారములలో పరదేశస్థుల జోక్యము నంతమొందించుటకై కంకణము కట్టుకొన్న జాతీయ పక్ష మొకటి తలయెత్తెను. దీనికి నాయకు డొక పడుచు సైనికుడు. అతని పేరు అరబీ పాషా. అతని తల్లిదండ్రులు బీదలు. కూలిపని చేసికొను తరగతికి చెందినవారు. అతడు ఈజిప్టు సైన్యములో సామాన్య సైనికుడుగా ప్రవేశించెను. అతని పలుకుబడి హెచ్చెను. అతడు యుద్ధ

శాఖకు మంత్రి అయ్యెను. ఆ పదవిలోనుండి అతడు ఇంగ్లీషు, ఫ్రెంచి అధికారుల ఉత్తరవులను అమలులోపెట్ట నిరాకరించెను. పరదేశుల ఆజ్ఞలను ఉల్లఘించినందుకు ఇంగ్లాండు తలపెట్టిన ప్రతిక్రియ-యుద్ధము. 1882 లో ఇంగ్లీషు నావికాదళము అలెగ్జాండ్రియా పట్టణమును ముట్టడించి, దానిని శతఘ్నులపాలుచేసి, తగులబెట్టెను. పాశ్చాత్య నాగరీకౌత్కృష్ట్యము నిట్లు ప్రకటనచేసి, ఈజిప్టు సేనలనుకూడ ఓడించి బ్రిటిష్‌వారు ఈజిప్టుపై పూర్ణాధికారము వహించిరి.

ఈ విధముగా బ్రిటిష్‌వారు ఈజిప్టు నాక్రమించుటకు ప్రారంభించిరి. అంతర్జాతీయ శాసనమునుబట్టి చూచిన ఇది అసాధారణ పరిస్థితి. టర్కిష్ రాజ్యములో ఈజిప్టు ఒకభాగము లేదా రాష్ట్రము. టర్కీతో ఇంగ్లాండు స్నేహభావము ,నెరపుచున్నట్లు భావన. అయినను వారి రాజ్యములో ఒకభాగము నది చల్లగా ఆక్రమించినది. అక్కడ ఇంగ్లాండు తన ప్రతినిధిని (agent) నియమించెను. ఆ ప్రతినిధి అందరిమీదను అధికారము చెలాయించవచ్చును. అతడు దొడ్డ మొగలాయీ చక్రవర్తి వంటివాడు. ఇండియాలో రాజప్రతినిధి వంటివాడు. ఈ బ్రిటిష్ ప్రతినిధి ముందు ఖెడీవు సైతము, అతని మంత్రులుసైతము చేతులు కట్టుకొని నిలువవలసినవారే. మొట్టమొదటి బ్రిటిష్ ప్రతినిధి మేజరు బేరింగు అనువాడు. అతడు ఈజిప్టులో 25 సంవత్సరములు పరిపాలన నెరపెను. పిమ్మట అతడు లార్డు క్రోమర్ ఆయెను. క్రొమర్ ఈజిప్టును నిరంకుశుడై ఏలెను. పరదేశపు ద్రవ్యాధికారులకును, వాటాదార్లకును లాభములు చెల్లించుటయే అతని ప్రధమ కర్తవ్యము. కాల నియమముతప్పకుండ ఈ పని జరుగుచుండెను. ఈజిప్టు దేశ ద్రవ్య పరిస్థితి సుదృఢముగా నున్నదని అందరును మెచ్చుకొనుచుండిరి. ఇండియాలోవలెనే ఆ దేశమున పరిపాలనా సామర్థ్యము పెంపొందెను. కాని ఆ 25 సంవత్సరముల అనంతరమున ఈజిప్టు ప్రాత అప్పు మొదటనున్నట్లే నిలిచిపోయెను. విద్యాభివృద్ధికి ఎట్టి కృషియు ఈ కాలమున జరిగియుండలేదు.

జాతీయ విశ్వకళాశాల స్థాపించు ప్రయత్నమును సైతము క్రోమరు అరికట్టెను. అతడు 1892 లో ఇంగ్లాండు ప్రధానామాత్యుడగు లార్డు సాలిస్‌బరీకి వ్రాసిన జాబునుబట్టి అతని వైఖరి వెల్లడియగును–"ఖెడీవ్ అచ్చముగా ఈజిప్టు దేశస్థుడుగానే ఉండిపోగలడు." ఈజిప్టు దేశస్థుడుండవలసిన విధముగా ఈజిప్టు దేశస్థుడుండుట లార్డు క్రోమరు దృష్టిలో ఒక నేరము. భారత దేశస్థుడు భారత దేశస్థుడుండవలసిన విధముగా నున్నచో బ్రిటిష్‌వారు కంటగించుకొని శిక్షింతురుగదా!

ఈజిప్టు బ్రిటిష్‌వారి వశమవుట ఫ్రెంచివారి కిష్టముగాలేదు. ఈ దోపిడిలో వారికి వాటా దొరుకలేదు. ఇతర యూరోపియన్ రాజ్యములకు కూడ ఇష్టముగాలేదు. ఈజిప్టు దేశస్థుల కిష్టముగాలేదని చెప్పనక్కర లేదు. ఈజిప్టులో తాము కొద్దికాలమే ఉండదలచినట్లును, త్వరలో వెళ్లిపోదలచినట్లును, కావున ఆందోళన చెందనవసరములేదనియు బ్రిటిష్ ప్రభుత్వము అందరితోను చెప్పుచుండిరి. ఉండుండియు, అధికారరీత్యా, అనధికారరీత్యా ఈజిప్టును వదలి వెళ్లిపోవుదుమని బ్రిటిషు ప్రభుత్వము ప్రకటించుచుండెను. ఇట్టి పవిత్రప్రకటనను వారు 50 సార్లు పైబడి చేసియుండిరి. వానిని లెక్కించుట కష్టము. కాని బ్రిటిష్‌వారు ఈజిప్టును అంటిపెట్టుకొనియే ఉండిరి. ఇంకను అక్కడ ఉండిరి.

1904 లో వివాదగ్రస్తమగు పలు విషయములగూర్చి బ్రిటిష్‌వారు ఫ్రెంచివారితో ఒక ఒడంబడిక చేసికొనిరి. మొరాకాలో ఫ్రెంచివారు ఇష్టమువచ్చినట్లు వ్యవహరించుటకు వారొప్పుకొనిరి. ఇందుకు మారుగా ఫ్రెంచివారు బ్రిటిషువారి ఈజిప్టు దేశాక్రమణమును సమ్మతించిరి. "ఇస్తినమ్మా వాయనం, పుచ్చుకొంటినమ్మా వాయనం" తీరుననున్న దిది. కాని సర్వస్వతంత్ర రాజ్యమని చెప్పబడిన టర్కీకి మాత్రము ఈ ఒడంబడికలో ప్రసక్తిలేదు. ఈజిప్టు ప్రజల ఇష్టానిష్టములను తెలిసికొనవలసిన అవసరమే లేదుకదా!

ఈ కాలమున ఈజిప్టుకు సంబంధించిన వేరొక విశేషమేమనగా,

ఈజిప్టులోని న్యాయస్థానములకు పరదేశులను విచారించు అధికారము లేదు. ఈ న్యాయస్థానములు వారిని విచారించుటకు తగినవి కాదని వారి భావన. పరదేశులు వారి సొంత న్యాయస్థానములచేతనే విచారింపబడ వలెను. కాన "దేశాంతర న్యాయస్థానములు" విదేశ న్యాయాధిపతులతో, విదేశాభి మానములతో వెలసినవి. అట్టి విదేశ న్యాయాధిపతులలో నొక్కడే ఆ న్యాయస్థానములగూర్చి ఇట్లు వ్రాసెను–

"ఈజిప్టులోని విదేశవాసులకు అట్టే పన్నులు చెల్లించవలసిన అవసరము లేదని నా నమ్మకము. ఎంత చక్కని పరిస్థితి! పన్నులు చెల్లించ నవసరములేదు. తాము నివసించు దేశములోని న్యాయస్థానములకుగాని, న్యాయశాసనములకుగాని బద్ధులై యుండనవసరములేదు. సరిగదా ఆ దేశమునుండి లాభములు పొందుట కనుకూలములన్నియు మాత్రము తమ హస్తగతము చేసికొనవలెను."

ఇట్లు బ్రిటన్ ఈజిప్టు దేశము నేలినది. ఇట్లు బ్రిటన్ ఆత్మ లాభార్థము ఈజిప్టును వినియోగించుకొన్నది. దాని ప్రతినిధులు తమ రెసిడెంసీలలో (బసలలో) నిరంకుశ ప్రభువుల వైభవముతో, వేషము లతో నివసించియుండిరి. ఇట్టి సందర్భములలో జాతీయత పెరుగుట సహజమేగదా! జాతీయత పెరిగినది. సంస్కరణోద్యమములు పొడ చూపినవి. 19వ శతాబ్దిలో నున్న ఈజిప్టు సంస్కర్తలలో ఉత్తముడు జమాలుద్దీన్ అఫ్ఘని అనువాడు. అతడొక మత నాయకుడు. నాటి పరిస్థితులతో సమన్వయపరచి ఇస్లాం మతము నతడు నవీనపరచ ప్రయత్నించెను. ఎట్టి పురోభివృద్ధినైనను ఇస్లాంతో సమన్వయ పరచ వచ్చునని అతడు బోధించెను. ఇండియాలో హిందూమతమును నవీన పరచుటకు చేసిన ప్రయత్నములవంటి ప్రయత్నములే అతడు ఇస్లామును నవీనపరచుటకు చేసెను. కొన్ని ప్రధాన బోధనలను తీసికొని, ప్రాత ఆచారములకును, విశ్వాసములకును క్రొత్త అర్థములను, క్రొత్త సమ న్వయములను వానికి కుదుర్చుటకు చేసిన ప్రయత్నములే ఈ ప్రయత్న

ములు. దీని ప్రకారము నేటి విజ్ఞానము, ప్రాచీన మత విజ్ఞానమునకు వ్యాఖ్యానప్రాయమగును. లేదా దానితో చేరును. ఈ పద్ధతి శాస్త్రపద్ధతి కన్న భిన్నము. శాస్త్రపద్ధతి ధైర్యముగా ముందుకుపోవునేగాని వెనుకటి విజ్ఞానముతో ముడి పెట్టుకోదు. ఏమైనను, జమాలుద్దీన్ పలుకుబడి ఈజిప్టులోనేకాదు, ఇతర అరబ్బీ దేశములలో కూడ అతిశయముగా నుండెను.

పరదేశ వర్తకము వృద్ధికాగా ఈజిప్టులో ఒక నూతన మధ్య తరగతి తలయెత్తెను. క్రొత్త జాతీయత కది వెనుపూసవలె నుండెను. ఈ తరగతి నుండియే సాద్ జగ్‌లూల్‌పాషా అను నాయకు డుద్భవించెను. నేటి ఈజిప్టు నాయకులలో అత డనుత్తముడు. ప్రధానముగా ఈజిప్టు ముస్లిం దేశము అయినను అందింకను కాప్టులు అను క్రైస్తవులు పలువు రుండిరి. ఈ కాప్టులు ప్రాచీన ఈజిప్టు ప్రజ లందెల్ల శుద్ధమైన వారు. ఈ నూతన మధ్యతరగతిలో ముస్లిమ్‌లును, కాప్టులునుకూడ ఉండిరి. అదృష్ట వశమున వారిలో వైరములు లేవు. వారిద్దరి మధ్య విభేదములు కల్పించుటకు బ్రిటిష్‌వారు ప్రయత్నించిరిగాని లాభము లేకపోయెను. జాతీయపక్షమును చీల్చుటకుకూడ బ్రిటిష్‌వారు ప్రయత్నించిరి. అప్పుడప్పుడు ఇండియాలోవలెనే కొందరి మితవాదుల సహకారమును పొందుటద్వారా కృతార్థులైరి. దీనినిగురించి ముందు ముందు నీకు వివరముగా చెప్పగలను.

ఆగష్టు 1914 లో ప్రపంచయుద్ధము ప్రారంభమౌసరికి ఈజిప్టు పరిస్థితు లిట్లుండెను. మూడునెల లైన పిమ్మట ఇంగ్లాండు, ఫ్రాంసు వారి మిత్రులకు వ్యతిరేకముగా టర్కీదేశము జర్మనీతో చేతులుకలిపెను. తోడనే ఈజిప్టును తమ రాజ్యములో కలుపుకొనుటకు ఇంగ్లాండు నిశ్చయించెను. కాని కొన్ని చిక్కులు వచ్చెను. అందుకు బదులు బ్రిటిష్ వారి రక్షిత రాజ్యముగా ఈజిప్టు ప్రకటింపబడెను.

ఇది ఈజిప్టుగాథ. 19 వ శతాబ్ది రెండవభాగములో యూరోపి

యన్ సామ్రాజ్యతత్వమునకు ఆఫ్రికా మిగత భాగముకూడ ఆహుతి అయ్యెను. యూరోపియన్ రాజ్యములవారు బిల బిల లాడుచు వచ్చి పడిరి. వా రా మహాఖండమునంతను తమలో తాము పంచుకొనిరి. రాబందులవలె వచ్చి వారు దానిపై పడిరి. ఒక్కొక్కసారి తమలో తాము పోట్లాడుకొనిరికూడ. వారిని నిరోధించు వారెవ్వరును లేకుండిరి. ఇటలీమాత్రము 1896 లో అబిసీసియాలో ఓడిపోయెను. ఆఫ్రికా ప్రధానముగా బ్రిటిష్, ఫ్రెంచివారి వశగతమయ్యెను. కొన్ని భాగములు బెల్జియన్, ఇటాలియన్, పోర్చుగీసువారి వశమయ్యెను. యుద్ధములో పరాజితులగువరకు జర్మనులుకూడ అందుండిరి. రెండే రెండు స్వతంత్ర రాజ్యములు మాత్రము మిగిలినవి. తూర్పున అబిసీనియా ఒక్కటి. పడమటి తీరముననున్న చిన్న లైబేరియా ఒక్కటి. మొరాకో ఫ్రెంచివారి యొక్కయు, స్పానిష్‌వారి యొక్కయు అధికారములో నుండెను.

ఈ విశాల దేశభాగములను స్వాధీనము చేసికొన్న గాథ దీర్ఘమైనది. విషాదకరమైనది. అది ఇంకను పూర్తికాలేదు. ఆ ఖండమును స్వప్రయోజనార్థమై వినియోగించుకొనుటకు, ముఖ్యముగా రబ్బరును బలవంతముగా లాగుకొనుటకు ప్రయోగించిన పద్ధతులు ఇంతకన్నను శోచనీయమైనవి. అనేక సంవత్సరములకు పూర్వము బెల్జియం, కాంగోలో చేసిన క్రూరకృత్యముల గాథలు నాగరీకమని చెప్పబడు ప్రపంచములో వ్యాపించినప్పుడు అందరును ముక్కుపై వ్రేలు వేసికొనిరి. నల్లని శరీరముగల మానవుని భారము దుర్భరముగదా!

ఆఫ్రికాకు తమోఖండమని * పేరు. 19 వ శతాబ్ది రెండవ భాగము వరకు దాని అంతర్భాగమునుగూర్చి ఎవ్వరికిని తెలియదు. దేశపటముపై ఈ అజ్ఞాతఖండ మెక్కుటకు ముందు అనేక సాహస యాత్రలు చేయవలసివచ్చెను. ఆ దేశ పరిశోధకులలో అనుత్తముడు, స్కాటిష్ మిషనరీయగు డేవిడ్ లివింగ్‌స్టన్. అనేక సంవత్సరముల

* Dark continent.

కాలము అతడా దేశ గర్భమునసుండి పోయెను. బయటి దేశముల కతని వార్తలందకుండెను. అతని పేరుతోపాటు హెన్రీ స్టాన్లీ పేరు ఎత్తుకొనవలెను. స్టాన్లీ వార్తాపత్రికలలో పని చేయువాడు. దేశ పరిశోధకుడు. ఇతడు డేవిడ్‌ను వెదుకుచు పోయి ఆ ఖండము మధ్య భాగమున నతనిని కనుగొనెను.

## 142

# టర్కీ యూరోపులో దుర్బలదేశ మగుట (సిక్‌మాన్ ఆఫ్ యూరప్ అను పేరు పొందుట)

మార్చి 14, 1933

మధ్యధరా సముద్రము మీదుగా ఈజిప్టునుండి టర్కీకి ఒక చిన్న దాటుమాత్రమే. 19 వ శతాబ్దిలో యూరోపులోని ఆటొమన్ టర్కుల సామ్రాజ్యము నానాటికి తీసిగ ట్టగుచుండెను. వెనుకటి శతాబ్దిలోనే అదిక్రమముగా క్షీణించుటకు ప్రారంభించెను. టర్కులయొక్క వియన్నా ముట్టడుల గూర్చియు, టర్కుల ఖడ్గదాటి కాగలేక ఈ యూరోపు కొంత కాలముపాటు గడగడ వణకుటను గూర్చియు చెప్పియుంటిని జ్ఞాపకమున్నదా? క్రైస్తవ ప్రపంచము చేసిన పాపములకు దానిని దండించుటకై నిమిత్తమాత్రముగా టర్కు వచ్చెనని పాశ్చాత్య దేశములందలి భక్తులగు క్రైస్తవులు తలచిరి. వియన్నా ద్వారములనుండి తుది సారి టర్కులు వెనుకకు కొట్టబడినది మొదలు వారి జాతకము మారెను. నాటి నుండియు వారు యూరోపులో ఆత్మరక్షణ మార్గములే చూచుకొనుచుండిరి. యూరోపు ఆగ్నేయమున టర్కులు స్వాధీనము చేసికొన్న దేశములన్నియు ఇప్పుడు వారికి ప్రక్కలో బల్లెములవలె నుండెను.

వారిని తమలో ఐక్యము చేసికొనుటకు టర్కులు ప్రయత్నించలేదు. ప్రయత్నము లొకవేళ చేసియున్నను ఫలించెడివికావు. టర్కుల నిరంకుశ పరిపాలనమునకును, తలయెత్తుచున్న జాతీయ భావములకును సంఘర్షణ కలుగుచుండెను. యీశాన్యమున జారుల పాలనమందున్న రష్యా నానాటికి వృద్ధియగుచు టర్కిష్ రాజ్యములకు గట్టి ఒత్తిడి నిరంతరము కలిగించుచుండెను. రష్యా, టర్కులు సహజ శత్రువులైరి; బద్ధ శత్రువులైరి. 200 సంవత్సరముల కాలము రష్యా టర్కులతో ఉండుండియు యుద్ధములు చేయుచునేయుండెను. చివరకు జారును, సుల్తానును తమ సామ్రాజ్యములతోపాటు నేల కొరగిరి.

సామ్రాజ్యముల చరిత్రనుబట్టి చూచిన ఆటొమన్ సామ్రాజ్యము చిరకాలము వర్ధిల్లినదనియే చెప్పవలయును. ఆసియా మైనర్‌లో చిరకాలము వర్ధిల్లి పిమ్మట 1361 లో యూరోపులో నది కాలూనెను. 1453 దనుక కాన్‌స్టాంట్‌నోపుల్ టర్కుల వశగతము కాలేదుగాని దాని చుట్టును ఉన్న భూభాగ మంతయు అంతకు ఎంతో ముందే దాని వశమయ్యెను. పడమటి ఆసియాలో హఠాత్తుగా తైమూర్ తలయెత్తి టర్కిష్ సుల్తానును అంగోరావద్ద 1402 లో పూర్తిగా ఓడించుట కారణముగా కొంత కాలమునకుగాని ఆ మహానగరము టర్కుల వశము కాలేదు. కాని టర్కులు యీ ఓటమినుండి త్వరలోనే తేరుకొనిరి. 1301 మొదలు మన కాలములో ఆటొమన్ సామ్రాజ్య మంతరించువరకు అది నిలిచిన కాలము $5\frac{1}{2}$ శతాబ్దుల పైబడినది. అది దీర్ఘ కాలమే.

మధ్యయుగములైన తర్వాత యూరోపులో రూపొందుచున్న నూతన పరిస్థితులకు యీ టర్కు ఎంతమాత్రము సరిపుచ్చుకోలేదు. వర్తక వాణిజ్యములు వృద్ధినందుచుండెను. యూరోపులోని వస్తు నిర్మాణము చేయు నగరములలో ఉత్పత్తిని వృద్ధిచేయుటకు ఏర్పాటులు జరుగుచుండెను. యీ విషయములు టర్కును ఆకర్షించలేదు. అతడు చక్కని సైనికుడు, పట్టుదలతో పోరాడువాడు, క్రమశిక్షకు బద్ధుడు.

విశ్రాంతి సమయములో నతడు సుఖజీవన మపేక్షించువాడు. కదపినచో క్రూరముగా, భయంకరముగా ప్రవర్తించువాడు. అతడు నగరములలో స్థిరనివాస మేర్పరుచుకొనెను. చక్కని భవనములు కట్టి ఆ నగరములకు అందము తెచ్చెను. అయినను దేశద్రిమ్మరుల ప్రాత వాసన అతనిని వదలిపెట్టలేదు. దాని కనుగుణముగానే అతడు తన జీవితమును దిద్దుకొనెను. టర్కీల జన్మభూములలో ఇట్టి జీవిత పద్ధతి సముచితమై యుండవచ్చును. కాని యూరోపులోను, ఆసియామైనరులోను తయారైన వినూత్న పరిసరముల కది తగియుండలేదు. నూతన పరిసరముల కనుగుణముగా ప్రవర్తించుటకు టర్కీలు సమ్మతించలేదు. కావున యీ రెండు భిన్న పద్ధతులకును నిరంతర సంఘర్షణము జరుగుచుండెను.

అటొమన్ సామ్రాజ్యము మూడు ఖండములను కలుపును—అవి యూరోపు,ఆసియా, ఆఫ్రికా. ప్రాక్పశ్చిమ దేశముల మధ్యనుండు వర్తక మార్గము లన్నియు దానిలోనే ఉండెను. టర్కీల కట్టి బుద్ధియేపుట్టి, తగిన సామర్థ్యమే ఉన్నట్లయిన ఇట్టి అనుకూల పరిస్థితులను లాభకరముగా వినియోగించుకొని గొప్ప వాణిజ్య జాతిగా పరిణమించి యుండెడివారు. కాని వారి కట్టి బుద్ధి పుట్టనూలేదు; సామర్థ్యమూలేదు. ఇతరులు లాభములు సంపాదించుకొనుట వారికి ఇష్టములేక కాబోలు తమకు ప్రమేయము లేకున్నను యీ వర్తకమును నిరుత్సాహ పరచిరి. ఈ ప్రాచీన వర్తక మార్గములను అరికట్టుట ఒక కారణముగా యూరోపులోని సముద్ర జీవులగు వర్తకజాతులు ప్రాగ్దేశముల కితరమార్గముల వెదుకుకొనక తీరినదికాదు. పశ్చిమమునకు నూతన మార్గములు కొలంబసు కనుగొనుటకును, తూర్పునకు నూతన మార్గములు డయాజ్, వాస్కోడిగామాలు కనుగొనుటకును ఇదియే కారణము. కాని టర్కీలు దీనికంతకును ముభావముతో నుండిరి. క్రమశిక్షణవల్లను, సైనిక శక్తి వల్లను మాత్రమే వారు తమ సామ్రాజ్యమును పరిపాలించిరి. పర్యవ

సానమేమనగా—ఆటొమన్ సామ్రాజ్యమందలి యూరోపియన్ దేశము లలో వర్తకమును, ధనోత్పత్తి కార్యములును క్రమముగా సన్నగిల్లెను. జాతి, మత సంఘర్షణలవల్లకూడ నిట్టి పరిస్థితి సంభవించెను. క్రూసేడు మత యుద్ధముల కాలమునుండియు, అంతకు ముందునుండియుచూడ బాల్కను దేశములలోని క్రైస్తవులకును, టర్కులకును ఉండిన ప్రాచీన మత కలహములు నేటి తరముల వారికికూడ సంక్రమించెను. ఆటొమన్ రాజ్యములలోని యూరోపియన్ భాగములు ఎట్లు క్షీణించెనో తెలుపుటకొక ఉదాహరణము : ప్రాచీనకాలమున ప్రసిద్ధ నగరమని పేరు పొందిన ఏథెన్సు, గ్రీసు 1829 లో స్వతంత్రమగుసరికి సుమారు 2000 జనసంఖ్య గల ఒక గ్రామముమాత్రమే. (100 ఏండ్లు గడచిన పిమ్మట నేడు ఏథెన్సు జనాభా 5 లక్షలు మించినది).

వాణిజ్య కార్యములు, ద్రవ్యోత్పత్తి కార్యములు లోపించుట చివరకు టర్కీ పాలకులకే అపకారకమైనది. సామ్రాజ్యముయొక్క కాలు, సేతులు దుర్బలమై క్షీణించుటతోడనే సామ్రాజ్య హృదయము కూడదుర్బలమై జబ్బుపడెను. యీ సంఘర్షణలలో, యీ కష్టములలో యీ సామ్రాజ్యమింతకాలము దక్కుట ఆశ్చర్యకరమగు విషయము.

అనేక వందల వంవత్సరముల కాలముపాటు ఆటొమన్ సుల్తానుల బలము "జానిసరీల"ను బట్టి వచ్చెను. జానిసరీ లను వారు టర్కిష్ కాల్బలము. వారు క్రైస్తవ బానిసలు. బాల్యమునుండియు వారికి శ్రద్ధతో శిక్ష గరపువారు. యీ జానిసరీలు ఈజిప్టులోని మామిలూకులను తలపునకు దెత్తురు. కాని వారిలో భేదములున్నవి. టర్కిష్ సైన్యమున అత్యుత్తమ సైనికదళముగా వారు పేరందినను ఈజిప్టులోవలె వారెన్నడును రాజ్యాధికారులు కాలేదు. కాని మామిలూకులవలెనే వారును వంశ పారంపర్యపు తెగగా ఏర్పనడివారు కారు. బానిసలుగా వారభిమానింపబడుచుండిరి. ఉన్నతోద్యోగములు వారికొరకై కేటాయింపబడుచుండెను. వారి కొడుకులుమాత్రము స్వతంత్ర ముస్లిములగుచుండిరి.

యూరోపులో టర్కులు కాలు నిలుపుకొన్న తుది ప్రదేశము

19 వ శతాబ్దిలో టర్కీ పోగొట్టుకొన్న ప్రదేశము

- - - - 1912–13 లో బాల్కన్ యుద్ధముల తరువాత

రష్యా
ఆస్ట్రియా – హంగరీ
రుమేనియా
బుఖారెస్టు
బోస్నియా
బెల్గ్రేడు
బల్గేరియా
సోఫియా
కాంస్టాంటినోపుల్
సెలోనికా
ఏథెన్సు

బానిసలకుమాత్రమే ఉద్దేశింపబడియుండుటచే ఈ దళములలో వారు చిరకాలముండుటకు వీలులేదు. ఈ దళములకు క్రొత్త సైనికులను శ్వేత, క్రైస్తవ బానిసలనుండియే ఎప్పుడును తీసికొనుచుండిరి. ఇదంతయు అసాధారణముగా కనిపించుచున్నది కాదూ ? కాని ఒక విషయము గుర్తుంచుకోవలెను. ఆరోజులలో ఇస్లామిక్ దేశములలో బానిస అను పదమునకున్న అర్థము ఈనాటి అర్థమునకు సమానముకాదు. తరుచు బానిసలు చట్టరీత్యా సాంకేతికముగా మాత్రమే బానిసలు. కాని వారు అత్యున్నతోద్యోగముల నందుకొనుచుండిరి. ఇండియాలో బానిసరాజులు ఢిల్లీలో పాలించినమాట జ్ఞాపకమున్నదా ? ఈజిప్టు నేలిన సలాదీన్ కూడ తొలుత బానిసయే. పాలక తరగతులను అన్నివిధముల సమర్థులనుగా చేయుటకు వారికి పరిపూర్ణ శిక్షణ నీయవలయుననుట టర్కీల అభిమతమై యుండును. శిక్షణ నిచ్చుటకు ఉచితమగు కాలము తొలి బాల్యమునుండి పైబడిన కాలమని వారికి తెలియును; ప్రతి ఉపాధ్యాయునకును తెలియును. ముస్లిం ప్రజలనుండి వారి పిల్లలను తీసికొని, వారిని వారి తల్లిదండ్రుల నుండి పూర్తిగా వేరుచేయుటగాని, వారిని బానిసలుగా చేయుటగాని సులభ సాధ్యముకాదు. కాన వారు క్రైస్తవబాలురను గ్రహించి సుల్తానుయొక్క బానిస కుటుంబములో చేర్చి వారికి కఠిన శిక్షణ నిచ్చువారు. ఈ చిన్న పిల్లలు పెరిగి పెద్దవారైన పిమ్మట ముస్లిములగుట సహజమేకదా.

సుల్తానుల విషయమునకూడ ఈ విధానము వర్తించుచుండెను. మామూలు విధముగా సుల్తాను వివాహమాడడు. బానిస బాలికలను బహు జాగ్రత్తగా ఎన్ని, వారిని సుల్తాను అంతఃపురమునకు పంపెడివారు. వీరే సుల్తాను పిల్లలకు తల్లులు. 18 వ శతాబ్ది తొలి రోజుల వరకును ఆటొమన్ సుల్తాను లందరును బానిస తల్లులకు పుట్టినవారే. వారును కఠినశిక్షణ పొందవలసినవారే. బానిస కుటుంబములోని ఇతర బానిసలవలెనే వారును కఠోర క్రమశిక్షకు గురికావలసినవారే.

సుల్తాను మొదలు ఇతర ఉద్యోగస్తులవరకు వారు వారు చేయు ప్రత్యేకోద్యోగములకు బానిసలను జాగ్రత్తగాతీసికొని, వారిని క్రమశిక్షలో నుంచి, శిక్షణ నొసంగుట కొంతవరకు శాస్త్రసమ్మతమే. ఇందుకు ఫలితముగా ఆయా శాఖలు శక్తి సామర్థ్యములతో పనిచేయును. క్రొత్త బానిసలను తీసికొనుచుండుటచే ఉద్యోగస్తులు క్రొత్తవారు నిరంతరము వచ్చుచుండిరి. వంశ పారంపర్యముగా దేశము నేలు వంశము లేర్పడుటకు వీలులేకుండెను. తొలి రోజులలో ఈ సామ్రాజ్యము బలిష్ఠముగా నుండుట కీ విధానమే కారణమై యుండవచ్చును. కాని ఈ విధానము యూరోపియన్ పరిస్థితులకుగాని, ఆసియాదేశ పరిస్థితులకుగాని ఒప్పి యుండలేదు. ఇది ఫ్యూడల్ విధానముకన్న భిన్నమైనది. యూరోపులో ఫ్యూడల్ విధాన స్థానము నాక్రమించుకొనుచున్న విధానమునకును ఇది చాల భిన్నముగా నుండెను. ఈ విధానము ప్రకారము, ముఖ్యముగా వర్తక వాణిజ్యములు లోపించినప్పుడు, నిజమైన మధ్య తరగతి తల యెత్తుటకే వీలులేకుండెను. 16 వ శతాబ్ది రెండవ భాగము తరువాత ఈ విధానము ఆదిని ఉన్న కట్టుదిట్టములతో నిలువలేదు. బానిస కుటుంబములో కొంత వంశ పారం పర్యాంశము ప్రవేశించెను. ఆ కుటుంబము లోని వారికుమారులు అందుండి పోవచ్చును. వారి తండ్రుల వృత్తులనే అవలంబించవచ్చును. అనేక విధములుగా, క్రమక్రమముగా ఈ విధానము పలుచబడెను. కాని దాని పునాదులు నిలిచియుండుటచే, శతాబ్దుల కాలము కలిసి మెలిసి ఉన్నప్పటికిని టర్కీ యూరోపుకన్న విభిన్నముగానుండెను. అది యూరోపులో పరదేశస్థుని వలె నుండెను. టర్కీలోసైతము పరదేశ ప్రజలు, వారి వారి శాసనములతో, వారి వారి మిత్ర కూటములతో, టర్కులతో కలువకుండ కేటాయింపుగానే ఉండిపోయిరి.

అసాధారణమగు ఈ ప్రాచీన తురష్క విధానమును గూర్చి ఇంత వరకు నీకు చెప్పుటకు కారణము ఆటొమన్ సామ్రాజ్యము రూపొందుట కది సహకరించెను. అంతేకాదు. దాని కదియే సాటి. ఇప్పుడది లేని

మాట నిజము. ఇదంతయు చరిత్రకు సంబంధించిన విషయమైనది.

ఎప్పటికప్పుడు ఒత్తుకొని మీదికి వచ్చుచున్న రష్యనులతో పోరాడుట తోడను, సామంత జాతుల తిరుగుబాట్లను అణచివేయుటకై వారితో పోరాడుట తోడను గత 200 సంవత్సరముల టర్కీ చరిత్ర గడచిపోయినది. గ్రీసు, రుమేనియా, సెర్బియా, బల్గేరియా, మాంటినీగ్రో, బోస్నియా—ఇవన్నియు బాల్కన్ దేశములు. ఇవి ఆటొమన్ సామ్రాజ్యములోని భాగములు. ఇంగ్లాండు, ఫ్రాంసు, రష్యాల సహాయముతో 1829 సంవత్సరమున గ్రీసు ఈ సామ్రాజ్యమునుండి వీడిపోయినదని మనము చూచియుంటిమి. రష్యా స్లావ్‌దేశము. బాల్కన్ దేశములలోని బల్గేరియా, సెర్బియాలుగూడ స్లావ్ దేశములే. జారుల ఏలుబడిలోనున్న రష్యా ఈ స్లావ్ దేశముల పక్షము వహించి వానిని రక్షించుటకై పూనుకొన్నట్లు కనిపించ ప్రయత్నించెను. రష్యాను నిజముగా ఆకర్షించినది కాంస్టాంటినోపుల్. బైజాంటియన్ చక్రవర్తుల వారసునని జారు చెప్పుకొనుచు, తన రాజనీతి నంతయు ప్రాచీన సామ్రాజ్య రాజధానియగు ఈ మహానగరమును పొందుటకై ప్రయోగించెను. రష్యా-టర్కీల సంగ్రామ పరంపర 1730 తో ప్రారంభమయ్యెను. మధ్య మధ్య సంధులతో ఈ యుద్ధములు 1768, 1792, 1807, 1828, 1853, 1877, 1914 సంవత్సరములలో సాగుచునే యుండెను. 1774 లో రష్యా టర్కీనుండి క్రిమియాను గ్రహించి నల్లసముద్రమును చేరుకొనెను. కాని దీనివల్ల ప్రయోజనములేదు. నల్లసముద్రము దిగ్బంధమై యుండెను. దానినుండి బయటికి పోవు మార్గమువద్ద కాంస్టాంటినోపుల్ ఉండెను. 1792, 1807 సంవత్సరములలో రష్యా దేశపు సరిహద్దు కాంస్టాంటినోపుల్ వైపుకు చొచ్చుకొని ముందుకు వచ్చుచుండెను. టర్కిష్ సరిహద్దు వెనుకకు పోవుచుండెను. గ్రీకు స్వాతంత్ర్య యుద్ధ సమయమున జారు లాభము పొందగోరి, టర్కులు అన్యథాప్రవృత్తులై యున్నప్పుడు వారిపై దండెత్త ప్రయత్నించెను. ఇంగ్లాండు, ఆస్ట్రియాలు కలుగ

జేసికొనకున్నచో అతడు కాంస్టాంటినోపుల్‌ను వశము జేసికొనియే యుండును.

రష్యా వారిని బడకుండ ఇంగ్లాండు, ఆస్ట్రియాలు టర్కీ నేల రక్షించిరి? టర్కీమీద అపేక్ష చేతకాదు. రష్యాతో స్పర్ధ, దానిని చూచిన భయము. ఆసియాలోను, ఇతర ప్రదేశములందును ఇంగ్లాండుకును, రష్యాకును పరిపాటిగా స్పర్ధ చెలరేగుచుండెనని ఇదివరలో నీకు చెప్పియుంటిని. ఇండియా బ్రిటన్ చేజిక్కుటచే బ్రిటిష్‌వారు రష్యన్ సరిహద్దులవరకు వ్యాపించిరి. జారుల రష్యా ఏనాడు ఇండియాకు ఏమి చేసిపోవునో అని వారు నిరంతరము భీతావహులై యుండిరి. కాబట్టి రష్యాకు బలము చేరకుండ ఆటంకపరుచుట, దాని కార్యములను భంగపరచుట బ్రిటిష్‌వారి కర్తవ్యమాయెను. కాన్‌స్టాంటినోపుల్ రష్యాకు చెందియుండినయెడల దానికి మధ్యధరాసముద్రములో చక్కని రేవు పట్టణముండెడిది. ఇండియాకు పోవు మార్గములో యుద్ధ నౌకాదళము నుంచుటకు దానికి సాధ్యమయ్యెడిది. ఇది చాల ప్రమాదకరమైన విషయము. కాన టర్కీని రష్యా అణచి వేయకుండ అనేక పర్యాయములు ఇంగ్లాండు దానికి అడ్డుతగిలెను. టర్కీజోలికి పోకుండ రష్యానాటంకపరచుట ఆస్ట్రియా అభీప్సితముకూడ. నేడు ఆస్ట్రియా చిన్న దేశము. కొద్ది సంవత్సరముల క్రితము బాల్కను దేశముల సరసను ఒక గొప్ప సామ్రాజ్యమై అది వెలిగెను. టర్కీ చితికిపోయినప్పుడు బాల్కన్ దేశములలో పెద్దభాగము తాను గ్రహించ వలెనని అది కోరుచుండెను. కాన రష్యాను దూరముగా నుంచుటయే దాని అభీప్సితము.

పాపము టర్కీ కష్ట పరిస్థితులలో నుండెను. బలవంతులగు పొరుగుదేశములు అదనుచూచి, దానిపైబడి, ముక్కలుముక్కలుగా చీల్చి వేయవలెనని చూచుచుండిరి. 1853లో టర్కీ నుద్దేశించి రష్యా జారు, బ్రిటిష్ రాయబారితో నిట్లన్నాడట—"మనబాధ్యతలో ఒక జబ్బు మనుష్యుడున్నాడు—చాలా జబ్బు మనుష్యుడు... ....హఠాత్తుగా మన చేతులలో

అతడు ప్రాణములు విడువవచ్చును." ఈ మాట ప్రసిద్ధికివచ్చెను. నాటి నుండి టర్కీ "యూరోపులోని జబ్బుమనుష్య" డాయెను. కాని ఈ రోగి ఒకపట్టున చావలేదు. అతడు మరణించుటకు దీర్ఘకాలము పట్టినది.

ఆ సంవత్సరములోనే, 1853 లోనే, టర్కీని తుదముట్టించుటకు జారు వేరొక యత్నము చేసెను. ఇది క్రిమియన్ యుద్ధముగా పర్యవసించెను. ఈ యుద్ధమున ఇంగ్లాండు, ఫ్రాంసులు రష్యాను అటకాయించిరి. మరి 21 సంవత్సరములకు, 1877లో జారు మరల టర్కీపై బడి దానిని నోడించెను, మరల పరదేశములు కలుగజేసికొనుట వలన కొంతవరకు టర్కీ రక్షింపబడినది. ఏమైనను కాంస్టాంటినోపుల్ రష్యాకు దక్కకుండ రక్షింపబడినది. 1878 లో టర్కీనిగూర్చి విచారించుటకు బెర్లిన్ నగరమున ఒక ప్రసిద్ధ అంతర్జాతీయ సభ సమావేశమయ్యెను. బిస్మార్కు అక్క డుండెను, డిజ్రాలి అక్కడుండెను. యూరోపులోని రాజకీయ నాయకు లనేకులు అక్క డుండిరి. వారందరు ఒకరినొకరు బెదరించుకొనిరి. ఒకరిపై నొకరు కుట్రలు పన్నిరి. ఇంగ్లాండు రష్యాపై యుద్ధము ప్రకటించవలసినదే కాని రష్యా చివరకు లొంగిపోయెను. బెర్లిన్ సంధికి ఫలితముగా బాల్కన్ దేశములైన బల్గేరియా, సెర్బియా, రుమేనియా, మాంటినిగ్రోలు స్వాతంత్ర్యము సంపాదించెను. ఆస్ట్రియా బొస్నియాను, హెర్జిగోవినాను ఆక్రమించెను (హెర్జిగోవినా మట్టుకు టర్కిష్ అధికారముక్రిందనున్నట్లే లెక్క). టర్కీ పక్షము కొంతవరకు అవలంబించినందుకై టర్కీనుండి రుసుముక్రింద సైరస్ ద్వీపమును బ్రిటన్ స్వీకరించెను.

36 ఏండ్ల తరువాత 1914 లో తరువాతి రష్యా-టర్కిష్ యుద్ధము మహా సంగ్రామభాగముగా సంభవించెను.

ఈ కాలమున టర్కీలో గొప్ప మార్పులు జరుగుచుండెను. 1774 లో రష్యాచేత పూర్తిగా పరాజితులై టర్కులు దిగ్భ్రాంతులైరి.

యూరోపులో తాము వెనుకబడి పోవుచున్నట్లు గ్రహించిరి. శౌర్యజీవులు గాన వారు తమ సైన్యమును ఆనాటి పరిస్థితుల కనుగుణముగా సంస్కరించవలసి యుండునని గ్రహించిరి. ఈ కార్యము కొంతవరకు నిర్వహింపబడినది. నూతన ఉద్యోగులతరగతి ద్వారానే పాశ్చాత్య భావములు టర్కీలో ప్రవేశించెను. నేను ఇదివరలో చెప్పినట్లు టర్కీలో చెప్పుకోదగ్గ మధ్యతరగతి లేదు. సుశిక్షితమైన వేరు తరగతియును లేదు. 1853–56 లో జరిగిన క్రిమియన్ యుద్ధానంతరముననే పాశ్చాత్యీకరణము చేయుటకు ప్రయత్నములు జరిగినవి. నియమబద్ధ ప్రభుత్వము అవసరమని చెప్ప ఉద్యమ మొక్కటి తలయెత్తెను (అనగా సుల్తాను నిరంకుశముగా పాలించుటకు బదులు ప్రజాప్రతినిధుల సభ సహాయముతో పాలించుట). ఈ ఉద్యమమునకు నాయకుడు మిధత్ పాషా. 1876 లో కాన్‌స్టాంటినోపుల్‌లో నియమబద్ధ పరిపాలనకై అల్లరులు చెలరేగెను. సుల్తాను అందుకు సమ్మతించెను. కాని, బల్గేరియాలో తిరుగుబాటువల్లను, రష్యన్ యుద్ధమువల్లను వెంటనే రద్దు చేసెను. యుద్ధమునందు అమిత ధనము వ్యయమగుట చేతను, సంస్కరణముల ప్రవేశపెట్టుటవల్ల ధనవ్యయమగుటచేతను, ఆర్థికముగా ఎట్టి ముఖ్యమగు మార్పులు కలుగనందువల్లను, టర్కీ ప్రభుత్వము దివాలా తీసినది. ఇందుకు ఫలితముగా పాశ్చాత్య ద్రవ్యాధికారులనుండి అప్పులు తీసికోవలసి వచ్చెను. వీరు దేశాదాయమును కొంత తమ వశములో పెట్టుకొనిరి. ఇట్లు పాశ్చాత్యీకరణము చేయుటకును, సంస్కరణములు ప్రవేశపెట్టుటకును చేసిన ప్రయత్నములు సఫలముకాలేదు. ప్రాత సామ్రాజ్యపు కట్టడములో ఇవి ఇముడుట కష్టము.

20 వ శతాబ్ది తొలి రోజులలో నియమబద్ధ ప్రభుత్వమునకై (రాజ్యాంగ వ్యవస్థ) గోల ఎక్కువైనది. వెనుకటివలెనే సైనికోద్యోగులు మాత్రమే కట్టుగానుండిరి. వారిలోనే "యువ టర్కుపక్షము" అను నూతన పక్షము వేగముగా వ్యాపించెను. "ఐక్య అభివృద్ధి సభలు"

**(Committees of Union and Progress)** రహస్యముగా ఏర్పడి నవి. సైన్యమందలి బహు సంఖ్యాకులను తమ పక్షములో చేర్చు కొని వారు 1908 లో సుల్తానును, 1876 నాటి రాజ్యాంగవ్యవస్థను పున రుద్ధరించునట్లు బలవంతముచేసిరి. అట్లు జరుగుట తోడనే దేశమున ఉత్సాహము వెల్లివిరిసెను. అంతకుముందు ఒకరినొకరు చంపుకొను టర్కులును, ఆర్మీనియనులును కౌగలించుకొనిరి. నూతన యుగోదయ మైనదనియు, అందరును హెచ్చు తగ్గులు లేక సమానముగా నుందు రనియు, లోబడియున్న తెగలవారికి సంపూర్ణ హక్కు లుండుననియు తలుచుకొని ఆనందాశ్రువుల విడిచిరి. రక్తపాతములేని ఈ తిరుగుబాటుకు ప్రధాన వీరుడు ఎన్వర్ బే. ఇతడు అందమైనవాడు. అహంకారి. ధైర్య సాహసములు కలవాడు. ముందు కాలములో టర్కీని రక్షించనున్న ముస్తఫా కెమాల్ కూడ ఒక ముఖ్య యువ తురుష్క నాయకుడు. కాని ఎన్వర్ వలె అతడు ముందుకు రాలేదు. ఈ ఇద్దరికిని ఒకరి పచ్చ ఒకరికి కిట్టదు.

యువ తురుష్కులకు కాలము సుఖముగా నడువలేదు. సుల్తాను వారిని కష్టపెట్టెను. రక్తపాతము కలిగెను. సుల్తానును పదచ్యుతుని గావించి వేరొకని నతని స్థానమున నిలిపిరి. ఆర్థిక కష్టములు సంభ వించెను. విదేశ రాజ్యముల వల్ల తొందరలు కలిగెను. ఇట్టి గందర గోళములో బోస్నియా, హెర్జిగోవినాలను తన రాజ్యములో కలుపు కొన్నట్లు ఆస్ట్రియా ప్రకటించెను (బెర్లిన్ సంధి అనంతరము 1878లో వీని నది ఆక్రమించినది). బలవంతాన, ఉత్తర ఆఫ్రికాలోని ట్రిపోలీని ఇటలీ గ్రహించి యుద్ధము ప్రకటించెను. టర్కులు ఏమియు చేయలేక పోయిరి. వారికి సరియైన నావికాదళము లేదు. ఇటలీ కోరికలను వారు చెల్లించక తప్పినదికాదు. అట్లు చేసీ చేయుట తోడనే సమీప దేశమం దొక ప్రమాదము వారి నెదుర్కొనెను. యూరోపునుండి టర్కులను వెడలగొట్టి, వారి దేశమును కొల్లగొట్టి పంచుకోవలయునని ఉద్దేశించి

బల్గేరియా, సెర్బియా, గ్రీసు, మాంటినీగ్రో దేశములు ఆ తరుణము అనుకూలముగా నున్నదని తెలిసికొని బాల్కను లీగ్ అను పేర వారు ఏకమై అక్టోబరు 1912 లో టర్కీని ఎదిరించిరి. టర్కీ అలసట చెంది యుండెను. ఐకమత్యములేదు. రాజ్యాంగ వ్యవస్థ కావలెనను వారును, వద్దనువారును అధికారమునకై ప్రాకులాడు చుండిరి. బాల్కన్ లీగు ఒత్తిడికి తట్టుకోలేక టర్కీ చదికిలబడెను. అమిత నష్టముల పాలాయెను. ఇట్లు కొద్దిమాసములలో మొదటి బాల్కను యుద్ధము ముగిసెను. యూరోపునుండి దాదాపు పూర్తిగా టర్కీ వెడలగొట్టబడెను. కాంస్టాంటినోపుల్ మాత్రమే దానికి మిగిలియుండెను. దాని ప్రాచీన తమమగు యూరోపియన్ నగరము, అడ్రియానోపుల్ సైతము, దానికిష్టము లేక పోయినను, బలవంతముగా గ్రహింపబడినది.

తోడనే విజేతలు కొల్లగొట్టిన దేశమును పంచుకొనుటలో వివాద పడిరి. ఉన్నట్లుండి బల్గేరియా ద్రోహ బుద్ధితో తన పూర్వ మిత్రుల మీద పడెను. అన్యోన్యము హత్యలు చేసికొనిరి. పిమ్మట ఈ కల్లోల పరిస్థితులనుండి లాభము కొట్టవలెనను ఊహతో ఇంతవరకును తటస్థముగా నున్న రుమేనియా రంగములోనికి దిగెను. దీనికి ఫలితము—బల్గేరియా తాను సంపాదించిన దంతయు పోగొట్టుకొనెను. రుమేనియా, గ్రీసు, సెర్బియా దేశములు తమ రాజ్యమును అధికముగా విస్తరింప జేసికొనిరి. అడ్రియానోపుల్‌ను టర్కీ తిరిగి పొందెను. బాల్కన్ ప్రజలు ఒకరినొకరు ద్వేషించుకొను తీరు ఆశ్చర్యకరమైనది. బాల్కన్ దేశములు చిన్నవే కాని అనేక పర్యాయములు యూరోపు యుద్ధములకవి రంగభూమి యైనవి.

1909 లో యువ టర్కులచే పదచ్యుతుడు కాబడిన సుల్తాను చోద్య పురుషుడు. అతని పేరు అబ్దుల్ హమీద్ II. అతడు 1876లో సింహాసనమెక్కెను. సంస్కరణములన్నను, నేటి క్రొత్త మార్పులన్నను ఇష్టములేదు. అతడు సమర్థుడనియే చెప్పవలెను. స్వలాభము

నకై ఒక అగ్రరాజ్యమును వేరొక అగ్రరాజ్యముపై పురిగొల్పెడు వాడను పేరతనికి కలదు. ఆటొమన్ సుల్తానులందరును కాలీఫ్‌లను మాట నీకు జ్ఞాపకమున్నదా? కాలీఫ్ అనగా ఇస్లాం మతాధ్యక్షుడు. అబ్దుల్ హమీద్ తన హోదాను పురస్కరించుకొని ముస్లిముల నందరను ఏకము చేయ ప్రయత్నించెను. దానికి పాన్ ఇస్లామిక్ ఉద్యమ మని పేరు. ఇందులో ఇతర దేశస్థులైన ముస్లిము లందరు చేరవచ్చును. తత్ద్వారా అతడు వారి సహకారమును పొందవచ్చును. కొద్ది సంవత్సరముల కాలము యూరోపులోను,ఆసియాలోను ఈ పాన్ ఇస్లామిజం(ఐక్య ఇస్లాంతత్వము) గూర్చి చెప్పుకొనిరి. కాని అందుకు ఆధారములేదు. మహా సంగ్రామము వచ్చుటతోడనే అది పూర్తిగా అంతరించెను. టర్కీలో పాన్ ఇస్లామిజంను ప్రతిఘటించినది జాతీయత. ఈ రెంటిలోను జాతీయతయే బలవత్తరమైనది.

బల్గేరియా, ఆర్మీనియాలలో జరిగిన హత్యలకును, దురంతముల కును బాధ్యుడు అబ్దుల్ హమీద్ అని భావించుటచేత యూరోపులో నతడు ప్రతిష్ఠగోల్పోయెను. గ్లాడ్‌స్టన్ అతనిని "మహా హంత"అన్నాడు. ఈ దురంతములను గర్హించుచు అతడొక గొప్ప ఉద్యమమును ఇంగ్లాం డులో లేవనెత్తెను. తమ చరిత్రలో ఆతని పరిపాలన కాలము మహా దుష్టకాలమని టర్కులే తలచిరి. హత్యలును, దురంతములును తరుచు క్రమము తప్పకుండ బాల్కను దేశములలోను, ఆర్మీనియాలోను జరుగు చుండెను. ఉభయపక్షములవారును ఇందు పాల్గొనిరి. టర్కులను హత్య చేయుటలో బాల్కన్ ప్రజలు, ఆర్మీనియనులు ఎంత బాధ్యులో బాల్కనులను ఆర్మీనియనులను హత్యచేయుటలో టర్కులంతబాధ్యులు. శతాబ్దుల కాలమునుండి వారిలో జీర్ణించిన జాతి, మత వైషమ్యములు ఇట్టి క్రూర విధముగా బహిర్గతమైనవి. ఇందు అమితముగా బాధపడిన దేశము ఆర్మీనియా. ఇప్పుడది సోవియట్ రిపబ్లికులలో నొకటి. కాకసస్ సమీపమున నున్నది.

ఇట్లు బాల్కన్ యుద్ధముల తర్వాత టర్కీ అలసిపోయినట్లు తెలిసికొన్నది. యూరోపులో దానికి కాలు నిలుపుకొనుటకు తావుమాత్రము కలదు. దాని మిగత సామ్రాజ్య మంతయు విచ్చిపోవుచుండెను. ఈజిప్టు నామకః దానికి చెందినదే. యదార్థమునకు అది బ్రిటన్ ఆక్రమణలో నుండెను. బ్రిటన్ స్వోపయోగమునకై దానిని వినియోగించుకొనుచుండెను. ఇతర అరబ్బీ దేశములు సైతము జాతీయోద్యమము వైపు మొగ్గుచున్నట్లే కనిపించుచుండెను. టర్కీ అధైర్యపడినదన్న ఆశ్చర్యము లేదు. దానికి భ్రమ తొలగినది. 1908 లో అది పెట్టుకొన్న ఆశలన్నియు దగ్ధమైనవి. ఆ సమయమునందే దానియెడల జర్మనీ సానుభూతి చూపుచున్నట్లు కనబడెను. జర్మనీదృష్టి తూర్పు దేశములపై ప్రసరించుచుండెను. మధ్య ప్రాచ్య దేశము లందంతటను జర్మనుల పలుకుబడి వ్యాపింపజేయవలెనని అది కలలు గనుచుండెను. టర్కీ కూడ జర్మనీ నాశ్రయించెను. వారి స్నేహము వృద్ధి అయ్యెను. 1914లో ప్రపంచ యుద్ధము సంభవించినప్పుడు పరిస్థితు లిట్లుండెను. రెండవ బాల్కన్ యుద్ధము ముగిసిన సంవత్సరములోనే ప్రపంచ యుద్ధము వచ్చెను. టర్కీ విశ్రాంతికి నోచుకోలేదు.



—♦—

# పిల్లల పుస్తకాలు

1. లక్క పిడతలు (చింతా దీక్షితులు) .... 1-0-0

# అపూర్వ గ్రంథములు

"అపూర్వగ్రంథములు" అను శీర్షికను ఇంతవరకెన్నడును ముద్రింపబడని, ఎన్నడో ముద్రింపబడినను నేడు లభింపని తెనుగు రచనలను ప్రచురింతుము. ఈ ప్రచురణలు విక్రయింపబడవు. రూ 10-0-0 పంపి, "అపూర్వగ్రంథములు" అను సంఘమున సభ్యులుగా చేరినవారికి ఉచితముగా నాలుగు ప్రచురణలు పంపబడును. ఇప్పటికి రెండు ప్రచురణలు మాత్రమే వెలువడినవి. ఇవి—

## 1. రతి రహస్యము.

సంస్కృతమున హరిహరుడు రచించిన 'రతిరహస్యము'నకు గద్వాలు మహారాజగు ముష్టిపల్లి సోమ భూపాలుని ఆంధ్రీకరణము, శ్రీ బులుసు వేంకటరమణయ్యగారి టీక, శ్రీ నిడదవోలు సుందరేశ్వరరావుగారి పరిచయముతో సహా 180 పుటలు. క్రౌన్ ఆక్టావో సైజు. కాలికో బైండు.

## 2. తెనుగు - ఇంగ్లీషు నిఘంటువు.

1818 లో 'ఎ వొకాబులరి ఆఫ్ జెంటు అండ్ ఇంగ్లీష్' అన్న పేరుతో, రచయిత పేరు లేకనే, కాన్‌స్టంటైన్ సాంపి అను నాతనిచే, కమర్షల్ ప్రెస్‌న ముద్రింపబడి మద్రాసులో ప్రచురింపబడినది. కొద్ది మార్పులతో పునర్ముద్రణ మొనరించి యున్నాము. 400 పుటలు. క్రౌన్ ఆక్టావో సైజు. కాలికో బైండు. (రచయిత : విలియం బ్రౌన్.)

కల్చరల్ బుక్స్ లిమిటెడ్

31, మీరాన్ సాహెబ్ వీధి,

మౌంట్ రోడ్డు : : మద్రాసు-2.

# సంస్కృతి ప్రచురణలు

| | | | |
|---|---|---|---|
| 10. | సోవియట్లదేశం (శశి) | .... | 0-10-0 |
| 11. | నేటిచైనా (పింగళి పరుశురామయ్య) | .... | 0-10-0 |
| 15. | లెనిన్ (క్లారా జట్కిన్) | .... | 0- 8-0 |
| 17. | హిందూ పద్ పాదుషాహి (వి. దా. సావర్కర్) | | 2- 8-0 |
| 19. | ఇండియా స్వాతంత్ర్య సమ్య (డి. యన్. ప్రిట్) | | 0- 8-0 |
| 21. | సుభాస్ బోస్ అంతర్ధాన గాథ (ఉత్తమచంద్) | .... | 1- 8-0 |
| 22. | గాంధీతో ఒకవారం (లూయీ ఫిషర్) | .... | 1- 8-0 |
| 25. | సామ్రాజ్యం ( ,, ) | ... | 1- 0-0 |
| 26. | మహమ్మదీయ రాజ్యాలలో జాతీయ వికాసము | .... | 1- 8-0 |
| 27. | నాగరికత చరిత్ర (సి. ఇ. యమ్. జోడ్.) | .... | 1- 4-0 |
| 29. | భారతీయ నాగరికత (సి. ఇ. యమ్. జోడ్) | .... | 1- 8-0 |
| 31. | ప్రపంచ చరిత్ర (నెహ్రూ) (1) I | ... | 1- 4.0 |
| 32. | ప్రపంచ చరిత్ర ( ,, ) (1) II | ... | 1- 0-0 |
| 33. | ప్రపంచ చరిత్ర ( ,, ) (3) | ... | 2- 0-0 |
| 34. | ప్రపంచ చరిత్ర ( ,, ) (4) | ... | 2- 0-0 |
| 35. | జీవితాదర్శం (చలం) | .... | 0- 8-0 |
| 36. | విజ్ఞాన భాస్కరులు (కస్తూరి సూర్యప్రకాశరావు) | | 1- 0-0 |
| 37. | సర్దార్ పటేల్ (టి. బదరీనారాయణ్) | .... | 1- 0-0 |
| 38. | వసంతము (జద్దెపూడి రాధాకృష్ణమూర్తి) | ... | 1- 0-0 |
| 39. | విజ్ఞాన శేఖరులు (కస్తూరి సూర్యప్రకాశరావు) | .... | 0-15-0 |
| 40. | నా చిన్నప్పుడు (గాంధిజీ) | .... | 1- 0-0 |
| 41. | వీర స్వర్గము (ప్రతాప రామకోటయ్య) | .... | 0- 8-0 |
| 42. | సోవియట్ రష్యా (నెహ్రూ) | ... | 1- 0-0 |
| 43. | ప్రపంచ చరిత్ర (ఐదవ భాగం) నెహ్రూ | .... | 2- 0-0 |
| 44. | తెలుగు -- ఇంగ్లీషు నిఘంటువు (విలియం బ్రౌన్) | | 5- 0-0 |
| 45. | ప్రపంచ చరిత్ర (ఆరవ భాగం) నెహ్రూ | .... | 2- 0-0 |



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA126B105 |
| పుస్తకం పేరు | ప్రపంచచరిత్ర 06 |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 213 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 6, 212 |
| లేని పేజీలు | 1,2 |
| తయారు చేసినది | P. Jayamma |
| పేజీలు విడదీసినది | P. Jayamma |
| స్కాన్ చేసినది | Uma |
| పరీక్ష చేసినది | THASIN |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | NO |
| పరిస్థితి | Good |